# శ్రీ రఘురామ చరిత్రము

కృతిపతి :

శ్రీ పాట్నూరు స్వామిబాబుగారు

నరసన్నపేట.


రచయిత :

విద్వాన్ కట్టి వెంకటసుబ్బారావు

నరసన్నపేట.

# పీఠిక

హిమవంతమునఁ బొడమిన గంగానది యార్యావర్తమెల్లఁ బవిత్ర మొనర్చి నట్లు, వాల్మీకి గిరిసంభూతయగు రామాయణ మహానది రామసాగర గామినియై భారతభూమి నంతటఁ బ్రవహించుచు మానవ మానసక్షేత్రములను భక్తిఫలభరితములుగాఁ జేయుచున్నది. శ్రీరామమంత్రము జపించి తరించినవారు కోటానుకోటులు. రామకథ భారతదేశమున నాగరకభాష లన్నిటను బరివర్తింపఁబడినది. కొన్ని యథామాతృకములు. పెక్కులు స్వేచ్ఛానువాదములు. రామకథ ననుసంధింపఁబడిన గద్య పద్య నాటకాది వాఙ్మయము నసంఖ్యేయము. కవులు చర్విత చర్వణమని నిరసింపక యన్నిభాషలందును రామకథలు రచింతురు. పలు పోకడలఁబోవు నవ్యకవులు కూడఁ దమ కృతులకు శాశ్వత స్థితిగోరి రామకథలనే రచించుట చూచుచున్నాము. దీనికి రామకథ యజరామరము భుక్తి ముక్తి ప్రదము నగుటయే హేతువు.

శ్రీ కిట్టి వెంకటసుబ్బారావుగారు రఘురామచరిత్ర ప్రబంధమును బ్రసిద్ధకవిచీర్ణమార్గమున రచించి కృతార్థులైరి. పండితవంశమున జనించి విద్వత్పరీక్ష నుత్తరించి యసమాన కవితాధార నలవఱచుకొనిరనుట యీ గ్రంథము వలన సువ్యక్తమగుచున్నది. సంస్కృతాంధ్ర భాషలందలి రామాయణములు నితర రామకథా ప్రబంధములును వీరికి సుపరిచితములే. ప్రాచీనకవుల మార్గము లన్నియు వీరు తమ ప్రబంధమున వెలయించినారు.

వీరు వాల్మీకి, కాళిదాసు, శ్రీనాథులను మాత్రమే స్తుతించుట పీఠికా కవిత్రయము నెడఁగల భక్తి తాత్పర్యమును బ్రకటించుచున్నది. ఆ కవుల యనుసరణములు ననుకరణములు నిందనేకములు. శ్రీనాథుని శైలి వీరికి వరవడి యైనది. శ్రీనాథుఁడు గీర్వాణభాషాప్రౌఢియుఁ దెలుఁగు పలుకుల నుడికారమునుగల తన భాష కర్ణాట (చవికప్పైన) భాషయని యుగ్గడించినాడు. ఇందలి భాషయు నట్టిదే.

అనుసరణ మొవ్వోత్తి యను శబ్దార్థములు కవికి స్వాధీనములు. ఈ కావ్యమున నన్వయ సారళ్యము కొల్లగానున్నది. ప్రసాదగుణ మెల్లెడలఁ బరిస్ఫుటము.

భావము సుగమము. కల్పనము హృదయంగమము. శైలి ముద్దులుగులుకు నొయ్యారముల కుప్ప - ధారాధారళము - నేటి కాలమున నిట్టి ధారాశుద్ధి ప్రదర్శించు వారరుదు - కృతికర్తను భర్తను నెఱుఁగనివారీ కృతి ప్రాచీన కవికృతి యనుకొనుట కవకాశము లనేకము లున్నవి.

ఇతరానుసరణమందును, కల్పనలను, ఔచితిని, సందర్భశుద్ధిని, కవి స్వతంత్రతనే వెలయించెనుగాని ప్రాచీనమార్గములకు దాస్యమొనరింపలేదు. గ్రుడ్డి యనుసరణ గావింపలేదు. కవికి ప్రతిభ జన్మసిద్ధమును, వ్యుత్పత్తి పరిశ్రమ సాధ్యమునయి యుండును. ఈ రెండును నీ కవి కభ్యాసాతిశయమున నన్నికెక్కినవి. దీని కుదాహరణములు చూపనక్కఱలేదు. ఇది సహృదయులకెల్లఁ దెల్లమే. పండితులు దానిని సులభముగా నెఱుంగఁగలరు.

ఇట్టి యుత్తమోత్తమ కావ్యము రచించిన కవిని, దాని స్వాంకితము గావించికొనిన కృతిపతిని మిక్కిలిగ నభినందించుచున్నాను. కర్త, భర్తల కీర్తియు నీ కృతియు రామనామమువలె నాచంద్రతారకమై వెలయింప శ్రీరాముఁ డనుగ్రహించునుగాత. శ్రీ శ్రీ శ్రీ

వాల్తేరు.
విజయదశమి,
విజయసంవత్సరం.

ఆచార్య, విద్వాన్,
గంటి జోగిసోమయాజి యమ్. ఏ. ఎల్. టి.,
ప్రొఫెసరు, ఆంధ్రభాషాశాఖాధ్యక్షుఁడు,
ఆంధ్ర విశ్వకళాపరిషత్తు.
17-10-53.

శ్రీః

# స్వవిషయము

నేఁడు నేను ఇచ్ఛాపురమునందు జిల్లాబోర్డువారి యున్నత పాఠశాలలో ప్రధానాంధ్రోపాధ్యాయుఁడను. "నమశ్శివాయ" "రామలింగేశ్వర" శతకములను దొల్లి రచియించి, కీ॥ శే॥ మా తల్లిదండ్రులును, మా వంశీయులును తరించుటకై మా యిష్టదైవమగు శ్రీరామచంద్రమూర్తి చరిత్రమును, సంగ్రహించి "శ్రీ రఘురామ చరిత్రము" అను పేరిటఁ బద్యకావ్యముగ రచించితిని.

నరసన్నపేట వాస్తవ్యులగు శ్రీయుతులు పోట్నూరు స్వామిబాబుగారు, 1923 వ సంవత్సరమున మా పెద్దయన్న బ్ర॥ శ్రీ విద్వాన్ కట్టి సాంబమూర్తి శాస్త్రిగారిని రావించి, తమ పురమున సంస్కృతపాఠశాలలోఁ బండితునుగా నియమించి, నాఁటినుండియు నేఁటిదనుక మా కుటుంబము నాత్మకుటుంబముగా నెంచి యవ్యాజకరుణతో నన్నివిధములఁ గాపాడుచున్నారు. శ్రీవారి సాహాయ్యమున నేను ఆయుర్వేదమునందును విద్వద్బిరుదమును అందియుంటిని.

శ్రీ స్వామిబాబుగారు అగ్రనాయకశ్రేణిఁ జెందిన రాజకీయ సాంఘిక వేత్తలు. తమ నిరంతరోదారసేవాతత్పరతచే నరసన్నపేటకొక వింతచెలువమును జేకూర్చిరి. విద్యాకళారంగములలో వారొనర్చిన త్యాగ మింతింత యనరానిది. పండిత కుటుంబములకుఁ బుష్కలంబుగ గృహక్షేత్రాది దానంబుల నొనర్చి యాచంద్రతారార్కమగు కీర్తిని సముపార్జించిరి. తమ జీవితప్రవాహమున నొక సీకరమునైనను వ్యర్థపుచ్చక దేశకార్యమునకై పలువిధములఁ బాటుపడుచు నిరాడంబరముగ జీవయాత్రను సాగించుచున్నారు. ఎందఱెందఱికో విద్యాభ్యాస వివాహోపనయనాదులకు, అత్యుత్తమ సాహాయ్యమునొనర్చి యసంఖ్యాకములగు దానధర్మముల నొనర్చిరి. మా కుటుంబమున నా రెండవయన్న కీ॥ శే॥ కామేశ్వరరావుగారి వివాహమునకు మిగుల ధనసహాయము గావించిరి.

తమ రెండవకుమార్తె చి॥ సౌ॥ సుందరాంబ వివాహసమయమున, నా వివాహమునకై రూ 500/-లు దారవోసి, యాధనమును వృద్ధిచేసి దానితో నన్నొకయింటివానినిగా నొనర్చిరి. శ్రీ స్వామిబాబుదంపతుల చేతిచలువచే నా కుటుంబము దినదినప్రవర్ధమానమగుచున్నది. ఇంతయేల ? మా కుటుంబమునకు శ్రీ స్వామిబాబుదంపతులే యేడుగడ యని నేనెల్లప్పుడును దలంచుకొనుచుందును.

సత్సంతానములలోఁ గృతి యుత్తమసంతానము గావున, పవిత్రచరిత్రు

లును, శ్లాఘావిముఖులునగు శ్రీ స్వామిబాబుగారిని నా కృతికన్యను బరిగ్రహించుటకై పట్టుపట్టి యెట్టకేలకు నొడంబఱచి శ్రీవారి షష్టిపూర్తి మహోత్సవ సమయమున నీ కృతికన్యాసమర్పణము గావించి, వారిచే సత్కృతుండనై కృతకృత్యుండనైతిని. అస్మదిష్టదైవమగు శ్రీరామచంద్రమూర్తి, శ్రీ స్వామిబాబు దంపతులకును, వారి సంతతివారికిని, అభ్యుదయపరంపరలను నిరంతరము నొసంగుగాక యని ప్రార్థించుచున్నాను.

ఆమూలాగ్రముగ నా గ్రంథమును బరికించి ప్రోత్సహించిన బ్రహ్మశ్రీ సామవేదుల సీతారామశాస్త్రిగారికిని బ్రహ్మశ్రీ బులుసు వేంకటరమణయ్యగారికిని అనేక కృతజ్ఞతాపూర్వకవందనము లర్పించుచున్నాను.

ప్రూఫులు దిద్దుట మున్నగు పలువిధశ్రమల కోర్చి నా కృతికి బ్రచురణావకాశమును గలిగించిన బ్రహ్మశ్రీ మా యన్నగారగు కట్టి సాంబమూర్తిశాస్త్రిగారికిని, బ్రహ్మశ్రీ వాసా సూర్యనారాయణశాస్త్రిగారికిని కృతజ్ఞతతో నమస్కారము లొనర్చుచున్నాను. నాతోపాటు గ్రంథపరిశోధనలో పాల్గొని సాహాయ్యమొనర్చిన సోదరాంధ్రోపాధ్యాయులు శ్రీమాన్ కందాళ వేంకటాచార్యులుగారికి నమోవాకములు.

ఆంధ్రవిశ్వవిద్యాలయ గీర్వాణాంధ్రశాఖాధ్యక్షులును, ప్రధానోపన్యాసకులును, బహుగ్రంథకర్తలును, పండితయశోధురంధరులునగు విద్వాన్ బ్రహ్మశ్రీ గంటి జోగిసోమయాజులుగారు నా కృతికి ఉపోద్ఘాతమును వ్రాసి ప్రసాదించుట, నా యిష్టదేవతాకరుణాప్రాంగిపేషణ ఫలమని సంతసించుచు, వారికి నా వినయపూర్వకప్రణామసహస్రంబు లర్పించుచున్నాను.

ఈ కృతి ముద్రణమునకగు వ్యయభారమునంతను శ్రీ స్వామిబాబుగారు వహించుటయేగాక, చక్కని రూపమున నా కృతి వెలువడుటకై, యసామాన్య శ్రద్ధనుబూని యత్యంతాదరాభిమానములను బ్రదర్శించిరి. శ్రీవారికి నా ప్రత్యేక ధన్యవాదములు.

కవితాసంపదచే గాకున్నను, కావ్యవస్తుకృతుల మహత్త్వముచే నైనను నా కృతి సహృదయుల మన్ననల నందకపోదని యూహించుచున్నాను. దోషముల సైరించుట సహృదయులకు సహజమని మఱియొకపరి సవినయముగ మనవి చేయుచున్నాను.

ఇట్లు విబుధవిధేయుండు,

విద్వాన్ కట్టి వేంకటసుబ్బారావు

గ్రంథకర్త.

# విషయానుక్రమణిక

## బాలకాండము



## అయోధ్యాకాండము



## అరణ్యకాండము

## కిష్కింధాకాండము



## సుందరకాండము



## యుద్ధకాండము

## ఉత్తరకాండము





శ్రీ

# కృతిపతి జనకులు



కీ॥ శే॥ పొట్నూరు గడ్డెయ్య శ్రేష్ఠిగారు.

జాతినంతను దగురీతి సంస్కరించె
దేశసేవల దిట్టయై తేజరిల్లె
స్థిరతరంబగు ధర్మంపు సిడములెత్తె
స్వామి దాబన నిరవారు సాటిమీరి॥

పేర్మి కులపతి చరితంబు తీర్చిదిద్ది
జగతి నాదర్శజీవియై జాలువారు
దయయు, సత్యంబు, దానంబు, నయము, వినతి
పుట్టువాదిగ దనలోనఁ బొంగిపొరల
వఱలు నీమూర్తి, గుణగుంభ, పంజరంబు॥

శ్రీ

# కృతిపతి ధర్మపత్ని



శ్రీమతి వజ్రమ్మగారు.

శ్రీః

శ్రీ శారదాంబాయైనమః.

# శ్రీ రఘురామ చరిత్రము



## బాలకాండము

శా॥ శ్రీమద్భాస్కరకోటి కాంతియుతమై చిద్రూపమై శాశ్వతం
బై మాంగళ్యనిధానమై యమలమై యానందసంపూర్ణమై
నీమాత్రైక విబోధ్యమై మహితమై దీపించు శ్రీజానకీ
రామబ్రహ్మము స్వామిబాబు గుణవారాశిన్ గృపన్ బ్రోచుతన్.

ఉ॥ భానునిమిక్షితీశ్వరుల వంశములన్ మహనీయలోక సం
తానములన్ రసోజ్జ్వల సుధామయ సత్కవివాగ్విభూతులన్
బూని తరింపఁజేయ నిలఁ బుట్టిన నిస్తుల పుణ్యమూర్తులన్
నే నల పుణ్యదంపతుల నిచ్చలుగొల్తుఁ గృతీశుఁ బ్రోవగన్.

సీ॥ జాయతోఁజనునన్నఁ జాయయై వెన్నంటు
రామానుజుఁడు సుమిత్రాసుతుండు,
సౌభ్రాత్రమునఁ దాపసవ్రతవర్తియై
పరగు రాఘవ భక్తిపరుఁడు భరతుఁ
డనర్ఘ రామదూతాఖ్య నిర్మలకీర్తి
నజరామరుండైన యనిలసుతుఁడు,
పతిదేవతాకుల ప్రథమగణ్యతగన్న
సాధ్వీమతల్లిక జనకజాత,

తే॥గీ॥ ప్రథిత పాటూర్నరు కులజాతు భద్రశీలు
గడ్డెయశ్రేష్ఠి పుత్త్రు విఖ్యాతకీర్తి
వజ్రమాంబా మనోహరు స్వామిబాబు
గాచుచుందురుగాత సౌఖ్యమ్ములొసఁగి.

ఉ॥ నాలుగు మోములన్ నిగమనాదములుప్పతిలంగ వాణితో
హేలఁగఁ జాటుసూక్తిఁ బ్రచరించుచు వైదిక ధర్మసంగతిన్
దూలఁగనీక యాత్మకృతిఁ బ్రోప జగంబు సృజించుధాత యు
ద్వేలకృపాతరంగములఁ దేల్చి కృతీశుఁ జిరాయుఁ జేయుతన్.

తే॥గీ॥ తామరసగర్భవక్త్ర సౌధమున నిల్చి
పరమకల్యాణి యంభోజ భవునిరాణి
ప్రణవరూపిణి ప్రణతగీర్వాణి వాణి
పల్కుతోడ్పాత మత్కృతిపతికి నెందు.

చం॥ మతి ముదమొంది పద్మజరమావిభు లాత్మ శిరంబు లార్ప, సం
స్తుతి యొనరింప గౌరి, కనుదో యఱమోడ్చి రసానుభూతిమై
నతితరహర్ష తాండవపరాయణుఁడై సుఖలింగమూర్తి, మత్
కృతిపతి బ్రోచుగాతఁ జిరకీర్తి వెలుంగఁగ నెల్లకాలమున్.

తే॥గీ॥ అర్ధచంద్రావతంసు దేహార్ధలక్ష్మి
వడకు గుబ్బలికూఁతురు పడఁతిమిన్న
సర్వమంగళ సత్కృపాసముదయమున
మత్కృతీశున కిడుగాత మంగళములు.

తే॥గీ॥ విఘ్నతిమిరంబు వెలయించు వేవెలుంగు
కొలుచు భక్తులపాలి ముంగొంగుపసిఁడి
కొండరాచూలిపట్టి వేదండముఖుఁడు
జయమునొడగూర్చు మత్కృతీశ్వరున కెపుడు.

తే॥గీ॥ తండ్రియిచ్చిన మకుట మౌఁదల ధరించి
కొడుకొసంగిన జాళువాయుడుగుదోయి
పేర్మిదాలిచి నరసన్నపేటనేలు
వేంకటేశుఁడు మత్కృతి విభునిఁ గాచు.

## అవతారిక

చం॥ అనుచు మదిష్టదేవతల నాదృతిఁగొల్చి యుదారశీలతన్
నను నొకయింటిమానిసి నొనర్చిన పావనకీర్తి నేక్రియన్
దనుపగనేర్తు? నెవ్విధిని ధన్యతనొందును జన్మమంచు నే
ననయము చింతనొందుదు మదాత్మ ఋణంబున గ్రుంకుకై నడిన్.

చం॥ తలఁపునఁ దోఁచె సత్కవు లుదారగుణాఢ్యుల కీర్తిమూర్తులన్
నిలుపరె కావ్యబంధముల, నేతృగుణంబులఁ దత్ప్రబంధముల్
పొలయవె శాశ్వతత్వ మటు పూనికృతిన్ రచియించియిచ్చి నేఁ
దలఁగుదుచింత! యీను భయతారక మిద్ది యటంచు నెంచుచున్.

ఉ॥ రక్కసతాల్మిపూని రఘురామచరిత్రము పల్కనెంచితిన్ ;
పెక్కులు రామకావ్యములు పేర్కొన నేలని పల్కఁబోకుఁడీ ;
తక్కనె జాతిరత్నముల తళ్కుమెఱుంగులు పెక్కు లబ్బినన్
మక్కువ సొమ్ములన్ నిలిపి మానుల దాల్పరె? గారవింపరే?

ఉ॥ శ్రీరఘురాముఁబోలు గుణసింధువొకం డొరుఁడబ్బునొక్కొ, సం
సారము పారమున్గదున సాధ్యమె తత్కథలెత్త మానినన్ ;
చేరిన సర్వసద్గుణ విశేషము లొక్కెడ తప్పు వాలిదో!
చారుకృతుల్ రచించు కవిచంద్రులదో! యిటు కొంచెమెంచుడీ.

తే॥గీ॥ ప్రాతవడినంత హేమ మపాత్రమగునె?
యమృత మాధుర్యమడఁగునె యధికమైన?
భవభయంబేర్చునే గాంగ వారిఁదక్క
బహుళ పంకిలనిర్ఘగీ విహారణముల.

సీ॥ బంకుపల్యాన్వయ ప్రథిత శీతాంశుండు
మల్లయశాస్త్రి ధీమండనుండు,
భద్రవాసావంశవారాశి చంద్రుండు
సూర్యనారాయణ సూరివరుఁడు,

కాశ్యపాన్వయమణి ఘనసత్త్వగుణఖని
సాంబమూర్తి మదగ్రసంభవుండు,
సామవేదాన్వయ సంజాత బుధుఁడు సీ
తారామశాస్త్రి యుదారగుణుఁడు,

తే॥గీ॥ పూర్ణసంతుష్టి స్వామిబాబు ప్రదత్త
ఘనతరోదార వృత్తుల గ్రాసవాస
దైన్యమెఱుఁగక చిరతాదరముతోడ
బుధులు దేవేంద్రునటుగొల్చి పొల్చుచుండ.

సీ॥ పొల్చినారు సహస్రలాంభోరాశిఁబోషమిన
శారదపూర్ణిమా శశధరుండు,
విశ్రాణనక్రియావిహారజావనిజాత
బుధలోకమందారభూరుహంబు,
నిత్యవిత్తేశత్వ నిధిపతిత్వంబుల
ప్రభవనగాదిగ గన్న రాజరాజు,
సకలధర్మక్రియాచరణపావనమూర్తి
సాధుభూసురసురార్చాపరుండు,

తే॥గీ॥ గర్దెయ్య శ్రేష్ఠి కృతపుణ్యకర్మఫలము
చంద్రమాంసాధ్వి సుకృతంబుసముదయంబు,
వజ్రమాంబాచిరంతన ప్రాణధనము
సకల సద్గుణరాశి శ్రీ స్వామిబాబు.

ఉ॥ ఇంద్రసమాన వైభవుఁ డహీనగుణోజ్జ్వల పుణ్యమూర్తి, రా
జేంద్రవిహారనామక తదిష్టసభాంతరమందు దేవదం
తీంద్రము నెమ్మిరత్నగిరిశృంగమునందటు కొల్వుతీరఁగ
సాంద్ర శుభప్రసంగముల సంగతి కల్గె ముదావహంబుగన్.

తే॥గీ॥ పరమసత్కీర్తి శాశ్వతత్వంబుఁగొలుపు
సప్త సంతానసముదయ స్థాపనంబు,
భాగ్యపూర్ణుల కగు పూర్వభాగ్యవశత
నుభయలోక మహోజ్జ్వల విభవకరము.

సీ॥ పండితబ్రాహ్మణ ప్రవర సంతతినిల్పి
గృహభూమిదాన సత్కృతులఁ దన్పె,
అభ్యుద్ధరించి సుధాకరంబొనరించె
పద్మాకరము గోరుపానిచెలువు,
సుందరేశ్వరదివ్యమందిరాంతర్భూమి
పరమ సద్భక్తిమై బాగొనర్చె,
సర్వర్తు ఫలపుష్ప సముదయంబులతోడ
నలరు నారామమ్ము నలరఁజేసె.

తే॥గీ॥ నిధులఁబూరించె సద్గుణ నిధియతండు,
పుణ్యపుత్రులఁగనె కులపుత్త్రుఁడితఁడు,
పరమపావన దివ్యప్రబంధమొకటి
యంకితమొనర్ప పూర్ణమానన్ని యనుచు.

చ॥ తలచి, బుధోత్తముల్ నను నుదారకృపామతి ధన్యుఁ జేయఁగా
బిలిచి, "హితంబుగోరుదువు విప్రవతంసుఁడ వొక్క సత్కృతిన్
సలిపి, యశస్కరంబుగను షష్టి సమోత్సవమం దొసంగు ము
జ్జ్వలమతి స్వామిబాబునకు సాంద్రకృపామతి కంచు దెల్పిరన్.

తే॥గీ॥ సరవిఁదలఁచితి రఘురామ చరితఁజెప్ప,
పండిత కవీంద్ర బృందంబు పల్కెనిట్లు
పరమధార్మిక కృతిపతి ప్రాపుదొఱకె
తడవుకొననేల కృతిసేయ తడయనేల ?

## ⇐ కృతికర్తృవంశ ప్రశంస ⇒

సీ॥ జననంబు సర్వసజ్జనలోక సంస్తుత్య
పావనకాశ్యపాన్వయమునందు,
తాత భిషఙ్మణి తరుణ ధన్వంతరి
నయశాలి శ్రీ జగన్నాధసూరి,
జనకుండు సాహిత్యసార వినోది, సు
బ్రహ్మణ్య పండిత ప్రధితకీర్తి,
తల్లి వేంకమసతి ధన్య సద్గుణగణ్య
సర్వసన్నుతపుణ్య సాధుశీల,

తే॥గీ॥ కవివతంసులు పండితగణ్యకీర్తు
లగ్రజాతులు సజ్జను లమలమతులు
పూజ్యపాదులు శ్రీ సాంబమూర్తిశాస్త్రి
యీశపదకింకరుండు కామేశసుకవి.

కం॥ వేంకట సుబ్రహ్మణ్యుఁడ ;
కింకరుఁడ బుధావతంస కృతబుద్ధులకున్
పంకజలోచన పదయుగ
పంకేరుహ చింతనైకపరమానసుఁడన్.

సీ॥ సకల విద్యారత్న సంభవాంబుధులౌచు
చిరకీర్తిగన్న సద్గురులకరుణ,
శ్రీరామ పాదాబ్జ సేవాసముద్భూత
పరమ నిర్మల సుధాప్రాయ భక్తి,
అనవద్యపండిత జనతా సమాగమ
సంజాత సత్కావ్యచతురగోష్ఠి,
సాంద్ర నిర్మలగుణ స్వామిబాబువదాన్య
దర్శితాకారణౌదార్యగరిమ,

తే॥గీ॥ కారణమ్ములు నుద్బోధకములుగాఁగ
సంతరింతును రఘురామచరితమిద్ది
పావనచరిత్రు శ్రీ స్వామిబాబుశ్రేష్ఠి
పరమధార్మికవరుఁ గృతిపతి నొనర్చి.

కం॥ బంగారమునకు రతనపు
సంగతి లభియించినట్లు సంతసమొదవెన్
మంగళకరమగు మత్కృతి
బంగారపుఁగొండ స్వామిబాబున కిడుటన్.

## పూర్వకవిప్రశంస

తే॥గీ॥ మధురతరదివ్యవాఙ్మయాంబరమునందు
తారకాకృతి వెలిగెడి ధన్యజనుల
సంస్కృతాంధ్రకవీంద్రుల సంస్తుతింతుఁ
బలుకుఁబూఁబోణి వాల్గంటివెలుగు లనుచు.

ఉ॥ పంచమనాదమొప్పి రసబంధురకావ్యరసాలశాఖ లే
యంచున నిల్చిరామచరితాఖ్యకుహూధ్వని విశ్వమెల్లమ్రో
యించిన కోకిలమ్ము ప్రణమిల్లుదు నిచ్చలు పుట్టుపుట్టువున్
గాంచనగర్భురాణి నుడికారపుసొమ్ములయిమ్ము గావునన్.

ఉ॥ నూతనభావసౌరభమనోజ్ఞసుమంబులకావ్యకల్ప భూ
జాతములం దమర్చి రససారసుధన్ బుధషట్పదాళి సం
ప్రీతివహింపఁ గ్రోంజవుల విందిడు మాధవు కాళిదాసు నా
చేతమునం దలంతుఁ గృపఁజేకొని దీవనసేయ మత్కృతిన్.

శా॥ నానారాజ సభాంగణంబుల యశస్సన్నార్ద్రిముల్ చేయుచున్
దానోద్రిక్త గజేంద్రమట్లు కవితాధారా వినోదంబులన్
దీనారాద్యభిషేక గౌరవములందీపించు భద్రాహ్వయున్
శ్రీనాథున్ గవినాథు నాంధ్రకవితాశ్రీనాథు వర్ణించెదన్.

కం॥ హితమతినై యీకావ్యము,
సతత ప్రఖ్యాతినొంది సంతసపఱుపఁగా
జతురత నాపాదింపఁగఁ
గృతిపతి వంశంబు నెల్ల కీర్తింతు నిఁకన్.

## కృతిపతి వంశావతారము

సీ॥ పురుషోత్తమావాస భూమియై యలరుట
పోలు వైకుంఠమ్ము పోట్లనూరు,
సదమల లక్ష్మిసముదయ స్థలంబౌట
పోలు దుగ్ధాంభోధి పోట్లనూరు,
అర్థార్థి సురభూరుహావసథంబౌట
పోలు వేల్పులప్రోలు పోట్లనూరు,
నవ నిధీశ్వరహర్మ్య విపులనస్థలియౌట
పోలు చైత్రరథమ్ము పోట్లనూరు.

తే॥గీ॥ దాననుండుట తదభిఖ్య తనరునొక్క
వైశ్యవంశంబు సకల సంపదలకిరవు
సంప్రదాయ విశుద్ధంబు సత్యధనము
పేర్మి నెలకొనె నరసన్నపేటయందు.

కం॥ ఆవంగడంబువారలు
శ్రీవత్ససగోత్రులగుట సిరికిరవులె యం
దావిర్భవించెఁ బాపయ
పావననిజధర్మరతుఁడు బహుధార్మికుఁడై.

కం॥ పాపయ్యసెట్టి కడుపున
భూపాల ప్రవరవినుత పూతచరిత్రుం
డేపున వేంకయ పుట్టెను
దాపత్రయహరణ శంభుదయ రూపొందన్.

కం॥ వెంకయ్య గనియెఁ బాపయ
శంకర పాదాబ్జయుగళ షట్పదు సుగుణా
లంకారు దీనజనతా
సంకటహరు నర్థిలోకచందన తరువున్.

మ॥ లలితానంతగుణుండు పాపయమహాలక్ష్మీకరంబూనఁగా
నెలసెన్ గేహము దుగ్ధవార్థిగతి; పర్వెన్ భాగ్యవారాశి; పు
త్రులు గడ్డెయ్యను లక్ష్మణున్ సుగుణసంస్తుత్యున్ గనెన్ వెంకనన్
బోలిచెన్ బాపయ తత్సుతత్రయముతోఁ బూర్ణప్రమోదంబునన్.

తే॥గీ॥ బాల్యమున మాసె వెంకన్న పసరుపూప
పెరిమగడ్డెయ్య లచ్చన్న లరసికొలువ,
బాహుయుగమున ధర్మంబు పరగినట్లు
పాపయశ్రేష్ఠి పెంపొందు స్వకులవృత్తి.

తే॥గీ॥ న్యాయవర్తనుఁడని వణిఙ్నాయకులును
గారవింతురు పాపయ్య గణ్యకీర్తి
ధర్మమే సోదరుండు సత్యంబు బిడ్డ
యన్నలోకోక్తి చెల్లు నాయనఘుపట్ల.

శా॥ నెయ్యంబారగనొక్కమిత్రుకడనెంతే సొమ్ము వెచ్చించి పా
పయ్యశ్రేష్ఠి జలాశయంబు వెలిచెన్ పాంథోపయోగార్థమా
యయ్యన్ బోలిన ధార్మికుల్ గలరె? నిత్యస్తుత్యుఁ డాతండు; గ
డ్డయ్యశ్రేష్ఠిని బెద్దచేసి కనె బ్రహ్మైక్యంబు శాంతాత్ముఁడై.

ఉ॥ గడ్డెయసెట్టి లక్ష్మణుఁడు గాదిలితమ్ముఁడు తోడుసూప, చే
పడ్డ సమస్త కృత్యముల భారముపూని స్వవృత్తిచేయుచున్
చెడ్డలెనంబెఱుంగకయ చెందును భాగ్యము కీర్తినంతలో
జడ్డనచేయు ధర్మములు సజ్జనపఙ్క్తిము సంతసింపగా.

తే॥గీ॥ అనుఁగుఁదమ్ముఁడు లచ్చయ్య చనెనుదివికి
తండ్రిపోయిన యొకయేఁడు దాఁటకుండ,
గడ్డెయశ్రేష్ఠియంత నేకాకియయ్యె
వెనుక ముందర తోడ్పాటు వెదుకరాక.

తే॥గీ॥ కొట్లసంతల బేరంబు గుత్తబేర
మన్నియునుమాని క్రమముగా నడిపెఁబేరి
మొనరఁజేయ గడంగె నా ఘనుఁడు తాను
దక్షిణాపథమునఁ గీర్తి దనరుచుండ.

ఉ॥ పట్టినదెల్ల క్రొందళుకు బంగరునై తగు స్పర్శవేధి యీ
దిట్టకరంబులం గలిగితీరునటంచు తలంపుగల్గ వే
రెట్టుల లాభమొంది పచరించుచు నిత్యము దానధర్మముల్
సెట్టికులంబు మేటియనఁ జెందెను గడ్డెయ సెట్టికర్తలన్.

సీ॥ అమలోదకమ్ము జలాశయమ్మును నిల్పె
దనపేరు ధర చిరస్థాయిగాఁగ,
సౌవర్ణమకుటంబు సంతరించెను భక్తి
వేంకటేశ్వరమౌళివీధి వెలుఁగ,
ఆసేతుహిమశైల మఖిలతీర్థంబుల
సపరివారంబుగా జలకమాడె,
శ్రావణపూర్ణిమా సమయ సమాగత
విద్వద్వరేణ్యులఁ బ్రీతిఁదన్పె,

తే॥గీ॥ గ్రామసంఘాధిపత్యగౌరవము జెందె
సజ్జనోత్తముఁ డనఁగ యశంబునొంద,
వైభవజితామరేంద్రుఁడై పరగుననుచు
గడ్డెయశ్రేష్ఠి విపుల విఖ్యాతిగాంచె.

కం॥ కింతలిమెట్టిన పుత్త్రిక
సంతానసురద్రుమలతిక చంద్రాంబిక ధీ
మంతుఁడు గడ్డెయ చేకొనె
సంతసమున దేవవిభుఁడు శచికాంతనటుల్.

తే॥గీ॥ అరసి యాదంపతులు సుతప్రాప్తికొఱకు
నియత సద్భక్తి "తోచర్ల" నృహరిభక్తు
స్వామి సేవించి తత్కృపా వైభవమున
నింటనిల్పిరి నరసింహు నింటివేల్పు.

కం॥ ఆ దంపతులొనరించిన
సాదర తత్స్వామిసేవ నలరిసఫలమై
మేదుర సుగుణోపేతుఁడు
ప్రాదుర్భవమయ్యె స్వామిబా బాత్మజుఁడై.

ఉ॥ ముత్తెముతోడి శుక్తిగతి ముద్దులపట్టిని భార్య గాంచుచుఁ
జిత్తమునందు సంతసము చెందును గడ్డెయసెట్టి; సౌహృదం
బత్తుకొనంగనిల్పుచు నిజాంకతలంబున దాదికొమ్మనన్
బుత్తురు హర్ష భారమునఁ బ్రొద్దునిమేషముపోల్కి సంపతుల్.

తే॥గీ॥ అరిగెనో లేదొ యిటు నాలు గైదునెలలు
గడ్డెయశ్రేష్ఠి సుఖరేఖ యడ్డుతిరిగె;
చంద్రమాంబిక సంపూర్ణచంద్రవదన
యస్తమించెను బతిని శోకాబ్ధిముంచి.

ఉ॥ ప్రాణముప్రాణమైన ప్రియపత్నిని గడ్డెయసెట్టి బాసియుఁ
బూనిక శ్రద్ధఁ దాల్చెఁ బ్రియపుత్త్రుని బెంపగ; నేకమాత్ర సం
స్థానమునొందె వత్సలత తల్లియు దండ్రియు వేఱుగాక; యా
సూనుని గాచుఁ బూవుగతి చోద్యముగా, కసుగందకుండఁగన్.

తే॥గీ॥ ఏకమాత్రాత్మజుఁడు మాతృహీనుఁడనక
విద్య గఱపించెనెమ్మిమై వెఱవుఁజూచి,
జాతి రత్నంబునేనియు సానదీర్ప
కున్న నిద్దంపుఁదళుక్కును వన్నెగలదె ?

ఉ॥ ఏకత మాత్మసూను నెటకెన్నఁడుఁబుచ్చి యెఱుంగ దైన శ్రీ
కాకుళ మాంగ్లవిద్యల వికాసమునందఁ బ్రవాసమంపె, నా
సాకత మెన్నగా దరమె ! సర్వవిధంబుల నాత్మజాతు పెం
పే కనఁగోరు తండ్రియు వివేకియు గడ్డెయసెట్టియోగదా !

తే॥గీ॥ ప్రాక్తనాత్మీయ సంస్కార వైభవమున
వెల్లివొడిచినగతి నెల్లవిద్య లబ్బ
స్వామిబా బాత్మగురులకుఁ బ్రాణమయ్యె
శిష్యుఁడెన్నగ సుతనిర్విశేషుఁడుగద !

తే॥గీ॥ విద్యతోఁబాటు నేర్చెనో వితరణంబు
తనువుతోఁబాటుఁ బుట్టెనోతలఁప నరిది ;
గఱచునప్పుడె పేదబాలురకొసంగు
పొత్తములు జీతములు కట్టుపుట్టములును.

సీ॥ సౌందర్యసేవధి సద్గుణాంభోనిధి
ఘనధర్మజలధి మాంగళ్యపరిధి,
పరహితాకాంక్షిణి భద్రస్వరూపిణి
వరమనీషిణి సత్యభరితవాణి,
చిరపుణ్యనిత్య యాశ్రితలోకసంస్తుత్య
కమనీయచరిత సత్కర్మనిరత,
కరుణాతరంగిణి గంభీరభాషిణి
స్తవనీయసచ్ఛీల దానలోల,

తే॥గీ॥ ఆంధ్రవరకులపూతదుగ్ధాబ్ధి జాత
జగ్గయశ్రేష్ఠి పుత్త్రిపద్మమ్మ నెంచి
తనయునకుఁ బెండ్లియొనరించె ధన్యమూర్తి
గడ్డెయశ్రేష్ఠి యతిలోకగణ్యకీర్తి.

చం॥ జనకుఁడు దక్షుఁడై గృహముచక్కనఁ దీర్చుచు దిద్దుచుండఁగాఁ
దన గృహలక్ష్మి నెయ్యమునఁ దన్పుచు సౌఖ్యము చూరవెట్టగా
ననయము స్వామిబాబు సుఖహర్మ్యములందె వసించి, విద్యలం
దనితర లభ్యపాండితి నయత్నమునం గడియించె దక్షతన్.

తే॥గీ॥ ప్రథితగుణగణ్య వేంకటరమణమాంబ
సుందరాంబ జనించి యానందపఱతు
రనుఁగుఁ దలిదండ్రులను కలశాంబురాశిఁ
గల్పలతికయు సురభియు గల్గినట్లు.

ఉ॥ అల్లన సర్వకార్యభరమాత్మజుఁ బూన్చి నివృత్తకర్ముఁడై
యుల్లము విష్ణుతత్పరతనొందగ గడ్డెయమేనువాసె; గా
సిల్లియు స్వామిబాబు గృహకృత్యములన్ సరిఁజేసి పేర్మి రం
జిల్లుచు దేశమాతృపదసేవకు దీక్షవహించెఁ బత్నితో.

తే॥గీ॥ పతికి తోడయ్యెవజ్రాంబ పరమధీర
సకల సత్కార్యములకు నుత్సాహమొసఁగి;
సతులతోడ్పాటుగల్గ సజ్జనులకెందు
సాధ్యములుగాని పనులున్న జగములందు.

సీ॥ సత్రశాలనుగట్టె జార్జిరాజేంద్రుని
పట్టాభిషేకోత్సవంబువేళ,
గ్రామసంఘాధ్యక్ష గౌరవంబును బూని
గ్రామంబునకు వింతకలిమిఁగూర్చె,

సర్వతోముఖ వికాసంబందఁదనజాతి
వైశ్యసంఘంబును బాదుకొలిపె;
కులధర్మకర్మలు విలసిల్లఁ దలపోసి
సంఘ సంస్కారంబు సంఘటించె;

తే॥గీ॥ గుల వయోజన విద్యలపాలుపంగోరి
పండితులఁ దెచ్చి నెలకొల్పెఁ బాఠశాల,
దేశహిత కార్యనిర్వాహ దీక్షఁబూని
త్యాగధనుఁడౌచుఁ జిరకీర్తి ధనముఁ బెంచె.

తే॥గీ॥ అంధవరసత్కులాబ్ధి సుధాంశుమూర్తి
యైన లక్ష్మణమూర్తికి నగ్రదుహిత
తరుణి వేంకటరమణమ్మ ధన్యచరిత
నిచ్చి పెండ్లి యొనర్చె నెంతేనిఁ గూర్మి.

కం॥ టంకాలవంశజలధి శ
శాంకుఁడు శశిభూషణునకు నతిహర్షమునన్
పొంకముగ సుందరాంబిక
బంకజముఖినిచ్చి తీర్చె పరిణయవిధులన్.

కం॥ తనసతియుఁ గూఁతు లల్లురు
మనుమలు సేవింపఁ గీర్తి మహనీయుండై
యొనరుచు సత్కార్యంబుల
ఘనపుణ్యుఁడు స్వామిబాబు కలకాలంబున్.

సీ॥ వేంకటేశ్వరపద ద్వితయమ్ము వెలుగొంద
సౌవర్ణపాదముల్ సంఘటించె,
సుఖలింగపార్వతీ సఖుని యాస్థానంబు
ప్రతిశబ్దమిడఁగట్టె ప్రణవఘంట,

ఆమయార్తులు నిల్వ నాలయంబును గట్టి
వైద్యశాలకు వింత వన్నెఁగూర్చె,
వేసవేల్వెచ్చించి పూని లోఁతొనరించి
పద్మాకరంబును బాగొనర్చె,

తే॥గీ॥ ధరణిగోగృహకన్యాది దానవితతిఁ
దన్పి యర్థులఁ దనకీర్తి ధరణినిల్పె
వింతయభివృద్ధి నరసన్నపేటఁగూర్చి
శాశ్వత ఖ్యాతిఁగాంచు శ్రీ స్వామిబాబు.

సీ॥ తనపేరు సతిపేరు ధరచిరస్థాయిగా
కట్టనిర్పేట విఖ్యాతిమూట,
పాంథులకై నిల్పె గాంధిమహాత్ముని
సదభిఖ్యఁదనరు విశ్రాంతిగృహము,
మండలాధిపతిత్వమహనీయుఁడై ధర్మ
పరిపాలనాపాటవంబు నెఱపె,
సరితీర్చి నిర్మించి హరిజనవాటిక
హరిజనోద్ధరణ పుణ్యంబుగాంచె,

తే॥గీ॥ వైదికకులీన పండిత బ్రాహ్మణులకు
శాశ్వతావాస వృత్తుల సంఘటించె
వైదికాచార కర్మముల్ ప్రబలఁజేసి
కులముసంస్కృతి యొనరించి కూర్చెవన్నె.

## షష్ఠ్యంతములు

కం॥ ఈదృక్సద్గుణ నిధికిన్
శ్రీదయితపదారవింద సేవారతికిన్
వైదికధర్మాసక్తున
కాది సదాచారరతున కమలాత్మునకున్.

క॥ పరకాంతాధనచింతా
విరహితునకు వివిధదేశ విఖ్యాతునకున్
పరమ మనీషా శాలికిఁ
బరహితచింతానితాంత పరతంత్రునకున్.

క॥ నానాదాన వినోదికి
దీన జనోద్ధరణ కార్యదీక్షారతికిన్
జ్ఞానికి విద్యానిధికిన్
భూనుత ధర్మానుషంగ పూతాత్మునకున్.

క॥ శ్రీనిత్య నివాసునకున్
మానిత సదసద్వివేక మహితాత్మునకున్
నానార్థిలోక వినుతా
నూనయశోనిధికి సమధికోన్నతజనికిన్.

క॥ శ్రీవజ్రాంబావిభునకు
పావన సద్ధర్మరతికి భద్రగుణునకున్
ధీవినుత సత్యసూక్తికి
భావితకీర్తికిని స్వామిబాబువిభునకున్.

క॥ అమ్మహితున కభ్యుదయా
ర్థమ్ముగ నాచెప్పఁబోవు రఘురామచరి
త్రమ్మునఁ గథాక్రమం బది
యిమ్ముగఁ జేకొందు మదికి నింపు జనింపన్.



# కథాక్రమము



ఉ॥ ఆతతపుణ్యశాలి, నిగమాంతరహస్య విశేషవేది, వి
ద్యోతిత రామనామజప దూషిత సంసృతివారిరాశి, ప్రా
చేతసుఁ డాశ్రమంబుగొని శిష్యగణంబులతో వసించు నా
నాతరుషండమండితవనంబగు నా తమసాతటంబునన్.

క॥ ప్రాతర్వేళల శిష్య
వ్రాతంబులఁగఱపివేదపారక్రమముల్
చేతఃప్రీతిగ పన్నది
స్నాతుండై త్రిషవణంబు సంయమి తీర్చున్.

క॥ ఒకనాఁ డమ్మునిచంద్రుం
డకలుష చిత్తమున శిష్యులందఱకంతన్
సకలాగమ సారంబుల
నకలంకముగాఁ దెల్పి యలరుచునుండన్.

సీ॥ కర్పూరపాండురాకారసౌమ్యచ్ఛాయఁ
గటికచీకటులు దిక్తటుల నణఁగ,
మందవాతాహత మహతికాతంత్రుల
రమణీయసామస్వరంబులొలుక,
వీనులవిందౌచు విన్వీథి మాఱ్మ్రోయ
వనజాక్షు నామకీర్తన మెసంగ,
చంద్రాంశు సన్నిభస్ఫటికాక్షమాలిక
తరుణాంగుళులఁ గెంపుఁ దళుక్కునొంద,

తే॥గీ॥ సకలభువనాంతసంచారి సత్తపస్వి
పరమతేజోఽధికుం డబ్జభవసుతుండు,
సర్వవిష్టపవార్తాప్రసంగవేది
నారదుఁడువచ్చె భక్తివిశారదుండు.

కం॥ ముని, పూజచేసి యుచితా
సనమున నాసీనుఁజేసి సద్వినయమునన్
"ఘనవీర్యుఁడు గుణగణ్యుఁడు,
వినుతబలుం డెవ్వఁడొక్కొ పేర్కొను మనఘా.

ఉ॥ ఎవ్వనికంటఁగెంపు దులకింపగ నాకులమౌ జగత్త్రయం
బెవ్వఁడు కేల చాపముధరించిన నిర్జరనాథుసేనియున్
జివ్వకుఁ దప్పపాఱు, గుణసింధు వనందగు పూరుషోత్తముం
డెవ్వఁడు ? వానిఁబేర్కొను మునీంద్ర ! యశోధనునన్న నాతఁడున్.

మ॥ సురసంప్రార్థితుఁడై రమావరుఁడు రక్షోభీతి వారింపఁ బం
క్తిరథ శ్రేష్ఠతనూజుఁడై వసుధ జన్మించున్ దశగ్రీవ సం
హరణంబుంబొనరించు వర్షదశ సాహస్రంబు రాజ్యంబుసే
యు; రమానాథుఁడె రాముఁడై యలరు సత్యోత్సాహ సంపూర్ణుఁడై.

కం॥ అని పేర్కొనిచనె సురముని,
ముని గానియు గురూపదేశముగ నద్దానిన్
దినమనమునఁ జింతించుచు
వనజాక్షునిలీల భక్తిభరితుండగుచున్.

కం॥ మాధ్యందిన సవనార్థం
బధ్యయనంబుడిగి శిష్యు లనుయాయులుగా
మధ్యాహ్నవేళఁ దమసా
మధ్యంబున గ్రుంకులాడి మరలుచునుండన్.

ఉ॥ క్రౌంచయుగంబు కామవశగంబగుటం గవగూడి మక్కువన్
చంచు పుటంబులార్చినునుచక్కటి ఱెక్కల మేనుగప్పుచున్
మించు తమిన్ గఱంగుచు రమించుచునుండ నిషాదు డంతలోఁ
బొంచి శరంబునేసి మగపుల్లునుగూల్చెఁ గృపావిహీనుఁడై.

ఉ॥ పెంటియు జంటఁబాసి మది వేదురి నందురి కుందుచుండ నా
యొంటిపులుంగు నెవ్వగల నుల్లము జల్లన సత్కృపార్ద్రమై
కంటజలంబు గ్రమ్మ మదిఁగ్రమ్మి భరింపవశమ్ముగాక నో
ర్వెంట నిషాదుఁ దిట్టునటు వెల్వడె శోకము శ్లోకరూపమై.

శ్లో॥ "మానిషాద ప్రతిష్ఠాం త్వ మగమశ్శాశ్వతీ స్సమాః
యత్క్రౌంచ మిథునా దేక మవధీః కామమోహితమ్".

తే॥గీ॥ నిగమ భిన్నంబుగా మాని మొగము వెంట
వాఙ్మయామృత నిష్యంద భాగ్యమయ్యె
నని భరద్వాజ ముఖ్యులౌ మునులు పలుక
నచ్చెరువునందె వాల్మీకి యాత్మకృతికి.

ఉ॥ ఆశ్రమభూమిచేరి హృదయంబునఁ జింతిలుచుండ, ధాతవా
ణీశ్రితవామభాగుఁడయి నెమ్మి దలిర్పగఁ దేరదోఁచి, సం
ప్రశ్రయబుద్ధి సంయమి సపర్యలొనర్పగ, హర్ష మంది, "స్వ
కాశ్రయమిచ్చె భారతి దయామతి సంసృతి మోచనారతిన్".

కం॥ పుణ్యశ్లోకుని చరిత ము
గణ్య ఫలప్రదముగానఁ గావ్యంబు యశో
గణ్య! రచింపుము బహుతర
పుణ్యదమై సర్వకలుషముల హరియింపన్.

కం॥ అనిచెప్పి ధాత యరిగిన
మునిచంద్రుడు వామలూరు పుత్త్రుఁడు దర్భా
సన సంస్థితుఁడై నారా
యణలీలలు భూమిపుట్టుటాదిగ నెల్లన్.

తే॥గీ॥ దివ్యదృష్టిప్రభావసందీప్తిచేత
భావి భూతంబులను భవద్వర్తనముల
గాంచి ప్రత్యక్షముగ వ్రాసెఁ గావ్యముగను
జానకీరామచరిత నిస్తంద్రభక్తి.

తే॥గీ॥ వృత్తబంధంబు బహుతాళవిధము రాగ
సంపదయు హత్తుకొనఁగఁ గుశలవు లనెడి
కవలఁ జదివించెనఁట నాది కావ్యమెల్ల
శ్రుతధరులు నేర్చిరింత విస్మృతియులేక.

కం॥ వీణా నినాదమల్లన
గానమునకుఁ దానమనఁగఁ గవల-చ్ఛోటల్
మానీంద్రుల దనియించిరి
గానామృత మానికావ్య గాంభీర్యములన్.

* * * *

సీ॥ బ్రహ్మ కుమ్మనుమండు బ్రహ్మ తేజోరాశి
బ్రహ్మనిత్యుఁడు పరబ్రహ్మపరుఁడు,
ప్రత్యహంబు సహస్ర పరమలింగార్చనా
పరనిత్య పీరశైవవ్రతుండు,
వర తపోబలమునఁ బరమేష్ఠిఁదన్ని య
పూర్వవరముఁగొన్న పుణ్యతముఁడు,
ఇంద్రాది దివిజుల నెక్కటిపోరిలో
గెల్చి పేరొందిన కీర్తిధనుఁడు,

తే॥గీ॥ రాక్షసాధిపుఁ డాహవరంగమందు
జచ్చెఁ దనచేతనని మానసమున రోసి
యశ్వమేధమ్ము కల్మష హరమటంచు
సవన దీక్షవహించె నిక్ష్వాకుకులుఁడు.

క॥ సాకేతపురంబున సు
శ్రీకులు కుశలవులు పాడ మృదుమధురముగా
నాకర్ణించిన మంత్రులు
వాకొన నాలించి కావ్యబంధుర ఫణితిన్.

మ॥ తమి శ్రీరాముఁడు పిల్వఁబంచి కవలన్ దండాధిపామాత్య భృ
త్యమునీంద్రానుజ వర్గము ల్గొలువ సాంద్రప్రీతిఁ గొల్వుండి, గా
నము సేయన్ సుదలింప నా కుశలవుల్ నానావిధానూనరా
గములన్ దాళములన్ విపంచికల నిక్వాణంబులం జూపుచున్.

సీ॥ దివిజకల్లోలినీ తీర్థంబుకై వడి
బహుజన్మకృతపాపభరము ద్రోయ,
లోకబాంధవకరాలోకంబుపోలిక
వితత తమోవృత్తి వెడలనడప,
మధురపుష్పోద్భూత మకరంద మట్టుల
భావసంపద పరవశతఁగొల్ప,
పుండ్రేక్షుఖండంబుపోల్కి నాస్వాదింప
సర్వాంగి రసపుష్టి సంఘటింప,

తే॥గీ॥ మౌనితల్లజరచిత రామాయణంబు
భూసుతారామచారిత్ర భూషితంబు,
పాడఁదొడఁగిరి తత్సభావాసులెల్ల
భక్తివశులౌచు తన్మయత్వంబునొంద.



# కథా ప్రారంభము



సీ॥ సప్తాశ్వబద్ధైక చక్రరథంబుఁ గో
చదలెల్లఁ గ్రుమ్మరు జాంఘికుండు,
జంఘాద్వయవిహీన సారథి నిర్జిత
గాఢ సంతమసాఖ్య కలుషవైరి,
పద్మినీ కన్యకావక్త్ర నిద్రాముద్ర
విరియించి నవ్వించు వెరవుకాఁడు,
సకల క్రియాధార చైతన్య సంధాన
చణసహస్రోజ్జ్వల చతురకరుఁడు,

తే॥గీ॥ గ్రహములకురాజు ధర్మ కర్మలకుసాక్షి
వ్యోమరత్నంబు ఋతుకాల యోగకర్త
ద్వాదశాత్ముండు రవి లోకబాంధవుండు
ఖరకరుం డొప్పు విశ్వమంగళకరుండు.

సీ॥ స్మృతికర్తయై ధర్మరతి సర్వపూజ్యుఁడై
వసుధఁ బాలించె వైవస్వతుండు,
పాకారిమెచ్చ నధ్వరశతంబొనరించి
ప్రజలఁగాచెను దిలీపప్రభుండు,
విశ్వజిద్యజ్ఞావభృథపూతగాత్రుఁడై
ప్రఖ్యాతి నిలనేలె రఘునృపుండు,
రాజమండలి పరాక్రమముమై నిర్జించి
చెలువతో రాజ్యమ్ముచేసె నజుఁడు,

తే॥గీ॥ పరమ ధార్మికులై బాహుబల సమార్త
విజయ లబ్ధోరుకర్తులై వీరలోక
భీకర నిజప్రతాపులై బిరుదు గనిన
రాజవర్యుల నుతికెక్కె రవికులంబు.

తే॥గీ॥ అజునిపిమ్మట దశరథక్ష్మాధిపుండు
పరమ సంయమి ధారుణీశ్వరులమేటి
సరవి నుత్తరకోసల జనపదముల
జిత దశేంద్రియవృత్తి శాసించు నెమ్మి.

తే॥గీ॥ షణ్ముఖోత్తమ విక్రమశాలియగుచుఁ
బ్రాప్తరాజ్యము న్యాయతత్పరతనేల
ప్రకృతి వర్గము నిశ్చలాపారభక్త
నతని ననురక్తిఁగను నమృతాంశునట్లు.

సీ॥ కాలూను దాభూమిపాలుదండవిభీతి
జనపదంబుల రోగసముదయంబు,
వైరిరాజులు కింట పరికింప రచ్చోటు
లద్రాజమార్గాంధు దఱియలేక,
సమయానుకూల వర్షముల సస్యముఁబెంచి
పర్జన్యుఁ డారాజు ప్రణయమొందు,
భూపాల పుణ్యానుభూతి నుర్వరయాచు
వసుధ దున్నక యన్ని పంటలీను,

తే॥గీ॥ అమర తేజస్కుఁడతులిత శమరతుండు
ధనపతికిఁ దోడు కోసల ధరణిజేఁడు
మనుసమాదిష్ట నృపధర్మమార్గ మరసి
క్ష్మాతలంబెల్ల పాలించి నీతి నిలుప.

చం॥ నలుదెసలం జయించు రఘునాథునిచే నెటు వాసికెక్కె, నా
వల నజరాజచంద్రపరిపాలనమం దెటు సౌఖ్యమొందె భూ
లలన యహీన విక్రమకళావిభవుండు బలారితుల్యదో
ర్బలనయశాలి పంక్తిరథవల్లభుచే నటుగాంచు భాగ్యముల్.

మ॥ సమవర్తిత్వము, దుష్టశిక్ష, వసువర్షంబున్, మహాతేజమున్,
విమతాత్మీయవిభేద శూన్యముగ నుర్వీపాలుఁ బొందించుటన్
యమపాశాయుధ రాజరాజ కమలాప్తానూనుఁడౌ నాతఁడా
గమతుల్యాజ్ఞ యమోఘమై పరగు నా కాకుత్స్థు రాజ్యంబునన్.

తే॥గీ॥ వేఁట జూదంబు పానంబు వెలఁదులనెడి
వ్యసనములకా నృపాలుండు వశుడుగాఁడు,
కల్లలాడఁడు పరిహాస కథలనైన
నింద్రుకడ నైన దైన్యంబు నెఱుఁ గఁ డతఁడు.

కం॥ పరుసములు వలుకఁ డెయ్యెడ
నరిమిత్రులఁగూర్చు నాశ మభ్యుదయంబున్
వరనీతిపథము తొలఁగఁడు
నరపతు లోరులానృపాలునకు సరిగలరే?

తే॥గీ॥ ధనువు మోపెట్టి యొక్కటి ధరజయించు
నేకరథమున నా ధరణీశమౌళి
శరధు లాతని విజయ ఘోషణము నెఱపు
విజయ దుందుభు లగు సురవితతిమెచ్చ.

తే॥గీ॥ శతమఖాజయ్య విక్రమ క్రతువిరోధి
సైన్యములఁ ద్రోలి సురలకు జయముఁగూర్ప
సురవధూగణమా తేని పరమయశము
హర్షమునఁ బాడు దేవసభాంతరముల.

తే॥గీ॥ మగధ కోసల కేకయ తత్క్ష్మాపతీంద్ర
సుతల నతిరూపవతుల భూపతి వరించి,
ధర్మపత్నులఁగూడి యధ్వరములందు
నముచిసూదను దన్పు ననారతంబు.

తే॥గీ॥ వసుధనీరీతి శతమన్యువై భవమున
నతుల సామ్రాజ్య భోగభాగ్యములతోడ
రాజ్యమేలంగ దశరథ రాజచంద్రుఁ
డించుమించు సర్వదివేల యేండ్లుగడచె.

సీ॥ చిరతరాధి వ్యాధిగురుభారసంతప్త
మానసామల విశ్రమస్థలంబు,
దుఃఖాంధతమసంబు ద్రోసి యాశాజ్యోతి
నడరించు రత్నదీపాంకురంబు,
సారతరోశీరచందన ద్రవభిన్న
తాపసంహారణానులేపనంబు,
తీర్పజాలని పితృదేవమానవఋణ
త్రితయంబు పూర్తిగాఁ దీర్పుసొమ్ము,

తే॥గీ॥ మధుర సంసారవృక్షసంభవఫలంబు
ప్రాజ్యశీతల నయనామృతాంజనంబు
పుత్రరత్నంబు గల్గ దాప్రొద్దుదనుక
లోప మియ్యది బహుసౌఖ్యలోపమయ్యె.

కం॥ సురరాజ మిత్రుఁడయ్యును
సురసన్నుత విజయకీర్తి శోభితుఁ డయ్యున్
ధరణీశుఁ డహర్నిశమును
బరితాపము నందు పుత్రభాగ్యము లేమిన్.

కం॥ తుదిదాకె పరువమెల్లను
ముదిమియు సంప్రాప్త మయ్యెఁ బుత్త్రోదయసం
పద నాకుఁ గలుగఁబోవునె
పొదలునె పున్నామనరకమును దాటుటయున్.

చం॥ అనుచువితాకుఁజెంద నృపునార్తి నెఱింగి సుమంత్రుఁ డేకతం
బున నిటుపల్కె నారదుఁడు పూర్వమువేడ సనత్కుమారు నా
మునివచియించె నాత్మజులు పుట్టుదు రుత్తరకోసలావనీ
శునకు విభండకాత్మజుఁడు సువ్రతుఁడిష్టి యొనర్పనం చొగిన్.

కం॥ కావునఁ గొనితె మ్మమ్ముని
గావింపు; తురంగమేధ ఘనసవనంబున్
భావింపుము కార్యగతిన్
సేవింపు వసిష్ఠముఖ్య శిష్టులంబున్.

సీ॥ భవ్యతపఃక్రియాపర విభండక మౌని
యన్వయంబేఁచు రత్నాంకురంబు,
గణికాజనంబుల ఘనతపో నిధులంచు
తలఁచు సాత్త్వికముగ్ధ ధర్మగుణము,
అంగదేశావగ్రహముఁ బాప నుదయించు
పుష్కలావర్త కాంభోధరమ్ము,
రోమపాదాత్మజారూఢ పాతివ్రత్య
సంచిత చిరపుణ్య సముదయంబు,

తే॥గీ॥ నిశ్చలజ్ఞాన వైరాగ్యనికషభూమి
యుర్వి రూపొందు సప్తాంగయోగమూర్తి
పద్మసంభవ తత్ప్రజాపతులకీడు
ఋష్యశృంగుండు సుమ్ము సద్ఋషివరుండు.

చ॥ అనవుడు తేరి ఱేఁడు గురు నంతటఁ బిల్వఁగనంపి నెమ్మిమై
వినిచిన నీయుదంతమును "చేర్మినొనర్పుము వాజిమేధ మ
మ్మునివరు డెమ్మి తన్మఖము పూర్ణతగాంచిన నిష్టిసేయగాఁ
జనుసన ; దెచ్చె నమ్మునిని శాంతను జన్నమొనర్ప నెంచుచున్.

క॥ సరయూ తటినీతటి న
ధ్వరశాలను గట్టి మౌనివర్యానుమతిన్
తురగమ్ము విడిచి యొనరిచె
నరవరుఁ డయ్యశ్వమేధ నామమఖంబున్.

చ॥ పరమ తపోధనాగ్రణి విభండక పుత్త్రుఁడు నేతగాగ న
య్యిరవున పుత్త్రకామమను నిష్టిని మౌనులొనర్చుచుండ, వి
స్ఫురిత సుధాంశురేఖపొడుపుం గనవేచు సుధాబ్ధి పోల్కి భూ
వరుఁడు ప్రతీక్షసేయు సుతభాగ్య శుభోదయవేళ నయ్యెడన్.

<= ఇంద్రాదులు శ్రీ మహావిష్ణువును దర్శించుట =>

శా॥ పౌలస్త్యాధిక బాధ్యమానులగుచున్ బాకారి ముఖ్యామరుల్
శ్రీలక్ష్మీపతి రక్షగోరి కొలువన్ క్షీరాబ్ధితీరంబు సూ
ర్యాలోక ప్రతిత ప్తపాంధకుల మధ్వాయాస శాంత్యర్థమై
సాలచ్ఛాయను బోల్కిఁ జేరిరి బిభీషాపూర్ణ చిత్తాబ్జులై.

క॥ వారటచేరినయంతన్
శౌరియు మేల్కాంచె కార్యసాధన కదియే
తోరంబగు శుభచిహ్నము
దారంబుగ విఘ్నవితతి తగఁ దొలఁగుటయే.

సీ॥ నేత్రయుగ్మము యోగనిద్రాంత విశదమై
పావనాలోక నోద్భాసిగాఁగ,
నిద్రాసముద్భూత నిజ శరీరగ్లాని
యంగ భంగంబుల నస్తమింప,

సాఖశాయినికులా సప్తర్షిముఖ్యుల
గడకంటిచూపులు గారవింప,
ఫణిరాజ నిశ్శ్వాసపవన ఫూత్కృతితోడ
జృంభా విజృంభంబు చెలిమిసేయ,

తే॥గీ॥ భుజగశయ్యోపవిష్టుఁడై భోగరత్న
రాగరంజిత దివ్య విగ్రహముతోడ
వెలుగు వినతార్తిహారు పరు విశ్వభరణు
జలధిజా కరసేవిత చరణయుగళు.

సీ॥ కలశాబ్ధికన్యకా క్షౌమోజ్జ్వలాంక ని
న్యస్తమా పాదద్వయంబువాని,
పద్మావిలాస వైభవ దర్పణాయిత
కౌస్తుభోద్దీప్త వక్షంబువాని,
బాలాతపారుణ స్వర్ణాంబరంబుతో
మెఱుఁగుతో మొయిలట్లు మెఱయువాని,
దైత్యవంశచ్ఛేద దక్షహేతివ్రాత
సంస్తూయమాన యశంబువాని,

తే॥గీ॥ త్యక్తశేషవిరోధియై తార్క్ష్యుఁ డెదుర
మోడ్పుఁ గేల్దోయి గదియింపఁ బొలుచువాని
సకలసజ్జన లోకరక్షావిహారు
శుభశుభాకారు శ్రీహరి గనిరి సురలు.

తే॥గీ॥ వాఙ్మనోఽగమ్యభావుడై పరగు పరము
దైత్యకుల ధూమకేతువు దరిసి సురలు
ఫాలములమోడ్పు కేల్దోయి గీలుకొల్పి
స్తుతి యొనర్చిరి నిగమసూక్తుల ఘటించి.

తే॥గీ॥ ధాతృమూర్తిని విశ్వవిధాత వగుచు
విష్ణురూపున రక్ష గావించి యవల
రుద్రరూపంబు గైకొని రూపుమాపు
మూడు మూర్తుల వేల్ప ; చేమోడ్పు నీకు.

కం॥ అవ్యయ మొక్కటి వీవే
భవ్య బ్రహ్మేశరూపవర్తిని! తగుఁ బో
దివ్యోదక మొక్కటి వా
స్తవ్య స్థానంబుబట్టి చనుఁ బలుతెఱగై.

సీ॥ మితజగద్వ్యాపి! యమేయస్వరూపక!
వ్యక్తకారణ! యనభివ్యక్తభావ!
జయశాలి! శాత్రవాజయ్య సంశోజ్జ్వల!
బహు కామఫలద! సంప్రార్థ్య రహిత!
పాపపంకనిదూర! వర పయోమృతపూర!
యజనామృతశరీర! యాదిపురుష!
యక్షయచిత్రరూప! యశ్విలక్ష్య! నిత్యశ!
కామ్యార్థసంపూర్ణ! ఘనతపస్వి!

తే॥గీ॥ సర్వభూతాంతరస్థ! దుష్ప్రాప! నిఖిల
భూతజనికారణా! స్వయంభూ! గుణాఢ్య!
జగదధీశ్వర! త్వత్పరేశ్వరవిహీన!
అద్వయానంద! బహువిధ ప్రాప్తరూప!

తే॥గీ॥ సప్తసామోపగీత యశస్వి వగుట
సప్తసాగరజలమధ్యశాయి వగుట
సప్తలోకైక రక్షణశాలి వగుట
నాశ్రయింతుము సప్తార్చిరాస్య! నిన్ను.

కం॥ ధర్మార్థ కామ ముక్తులు
కర్మలు యుగముఖ్య కాలగతులు జగంబుల్
నిర్మల భువనస్థితులు చ
తుర్ముఖ ముఖవంద్య నీవ! దురితవినాశా.

తే॥గీ॥ హృదయకమలంబులో వెల్గులీనునిన్ను
పరమ తేజస్స్వరూపు దివ్యర్షి వరులు
ధారణాంచిత శుద్ధ చిత్తములఁ జేర్చి
ధ్యానములు సేయుచుందురు తత్త్వరూప!

తే॥గీ॥ అజుఁడ వయ్యును జన్మగ్రహణమొనర్చి
రూపుగాంచక పగతుర రూపణంచి
యోగనిద్రను జాగృతి నొందియుండు
త్వద్యథార్థ స్వరూపం బతర్క్య మీశ.

సీ॥ సగుణాత్మకుండవై శబ్దాదివిషయంబు
లనుభవించెదవు దివ్యస్వరూప!
అనితరజ్ఞేయ మహామహిమంబుల
వర్తించెదవు విశ్వభరణ దక్ష!
సంసారజంబాల సంసక్తచిత్తుల
దరిఁజేర్తు వుజ్జ్వల తత్త్వపూర్ణ!
సంబంధ గంధప్రసంగంబు నొందక
దాసీన్యమును గందు తార్క్ష్యవాహ!

తే॥గీ॥ మోక్ష సౌఖ్య ప్రదమ్ములై ముదముఁ గొల్పు
బహువిధాగమ సంభిన్న పథములెల్ల
బహునదీజల మబ్ధి రూపడిన యట్లు
శౌరి నీయందె యేకవి శాంతి నందు.

ఉ॥ యోగనిరూఢులై యతిశయోజ్జ్వల సంయమసక్త చిత్తులై
యోగ తపః ఫలంబులు త్వదర్పణచేసి యనన్యవృత్తులౌ
యోగులు, సాధుకోటులు, సనుత్తమ ధర్ములు, రక్షసేయు దో
యోగిమనోవిహారి ! దురితౌఘవిదారి ! మురారి ! శ్రీహరీ !

సీ॥ త్వన్మహా మహిమంబు తర్కింపఁ బటువన్నచోఁ
ద్వత్స్వరూప మెట్లు బోధ్యంబు దేవ ?
స్మరణమాత్రముచేఁ బ్రసాదింతు వన్న దో
దర్శనాదిఫలంబు తల్పనగునె ?
వార్ధిరత్నములట్లు వనజాప్త తేజంబు
నట్లు త్వత్కృతు లమేయంబులౌను,
ప్రాప్యమప్రాప్యంబు వాంఛితంబనలేదు
జన్మకర్మలఁ గొందు జగము కొఱకు,

తే॥గీ॥ మహిమకీర్తింపలేక శమంబునొందు
బ్రాఁజదువు లన్న వశమౌనె పరుల కెన్న ?
త్వద్గుణంబు లనంతముల్ తార్క్ష్యవాహ !
వారిరుహనేత్ర ! యబ్ధిజా వరకళత్ర !

కం॥ అనియిట్లు సురలు శౌరిన్
వినుతించిరి వివిధగతుల ; విశ్వేశు నెడన్
జను నయ్యది సత్యంబై
యణుమాత్రాత్యుక్తిలేక యతితథ్యంబై.

సీ॥ కుశలమే ? శతకోటి కోటి నిర్జితదైత్య !
యమరనాయక ! సహస్రాక్ష ! నీకు,
సేమమే ? భారతీ చిత్తాబ్జ షట్పద !
ధాత ! సర్వ జగద్విధాత ! నీకు,

మంగళంబె ? విశ్వమంగళాకర మనీ,
షా ధురంధర ! సురాచార్య ! నీకు,
భద్రమే ? సర్వదిక్పతులార ! నిజబలా
హతదానవానీకులార ! మీకు,

తే॥గీ॥ స్వస్తియే ? మీకు వసుగణ ప్రముఖులార !
విజయమే ? మీకు నిర్జర వీరులార !
అవిరత సుఖంబె ? మీకు బ్రహ్మర్షులార !
హర్షమే ? మీకు నాదిత్యులార ! యనుచు.

తే॥గీ॥ కుశల సంప్రశ్నచే ప్రీతిఁగొల్పి శౌరి
కెరగి డగ్గుత్తుకల నివేదించి రిట్లు
ప్రళయకాలంబు గాక విశ్వంబు ముంచు
రాక్షసోద్వేల జలధిపూరంబు దేవ !

ఉ॥ తపమున రావణుం డనెడు దైత్యుఁడు బ్రహ్మఁ బ్రసన్నుఁజేసి, త
త్కృప నతిలోకతేజమును దివ్యవరంబులఁ బొంది దృప్తుఁడై
అపగత సాధ్వసంబుగ దివౌకసులం బొరిపుచ్చి ద్రోలి, ని
మ్మ్కృపఁ జెఱవెట్టు వేల్పుదొర సిగ్గునఁ గుంద సుపర్వకాంతలన్.

సీ॥ యాగక్రియాలబ్ధ హవ్యభాగంబు చే
కొననీఁడు నెమ్మిమై మనఁగ నీఁడు,
అంబరంబున వ్యోమయానచారుల నిచ్చ
విహరింపనీఁడుఁ గన్పింపనీఁడు
మందాకినీ వారి మజ్జనంబొనరింప
నీఁడు తపంబు సాధింపనీఁడు,
నందనవని సుర సుందరీ సందోహ
మింపొందనీఁడు క్రీడింపనీఁడు,

తే॥గీ॥ దిక్పతులనోర్చి వెలిపించి తెచ్చి యాత్మ
సదనమున నూడిగము సేయ ముదలవెట్టు,
తక్కు ద్రుక్కడి సురలను దల్పనేల ?
కావవే ! దైత్యుఁ బొలియించి దేవ ! యనఁగ.

సీ॥ వేలాసమాసన్న శైలకందరములు
వాక్యరీతికిఁ బ్రతిధ్వనుల నీన,
ఘనఘోష గంభీర కంఠనాదం బబ్ధి
మేదురధ్వనికి నామ్రేడితముగ,
సమ్యగుచ్చారిత స్థాన పూతంబౌచు
భారతీరీతి సంస్కార మంద,
నోటవెల్వడిన మిన్నేటి వెల్లువఁ బోలి
చెలిసవ్వ మోముసఁ దోలఁకులాడ,

తే॥గీ॥ అంబుజోదరనామ నీలాంబుదంబు
దానవ గ్రీష్మకాల ప్రతప్యమాన
దివిజ సంతాప మారగా శ్రవణమధుర
వాక్సుధాపూరవర్షంబు పఱపె నిట్లు.

చం॥ అరయుదు దైత్యనాయకు పరాక్రమమందు భవ ద్బలంబులున్
సురిగె ; నఘవజ్రంబున విశుద్ధగుణంబులపోల్కి, దీనినే
నెఱుఁగుదు లోకసంతతి యనిష్ట కృతాఘముచేఁ దపస్వి య
ట్లుర్వడి కీడునొందుట ; యనూన మనోవ్యథ నెచ్చ నాచ్చెదన్.

తే॥గీ॥ ఏకకార్యార్థి నగు నన్ మహేంద్రుఁడిట్లు
ప్రార్థనమొనర్పనేల ? యప్రార్థనమున
వాయువగ్నికి సారథ్యభరము పూని
దాహ సంరంభమునకు నుత్సాహమొసఁగు.

తే॥గీ॥ స్వాసిధారానికృత్త శీర్షైకశీర్ష
మస్మదీయ రథాంగ లభ్యాంశ మగును
అతితరారూఢు నోర్చితి నసుర ధాత్ర
వరమునన పాముఁ జందనతరువు పోల్కి.

తే॥గీ॥ సరసిజాసను భక్తి ప్రసన్ను జేసి
దైవసర్గంబుచే నవధ్యత్వ మందె ;
మర్త్యులగణింపఁ డాత్మ నమంద గర్వ
భరముచే నంధుఁడగు దైత్య వల్లభుండు.

కం॥ కావున దశరథు గృహమున
నావిర్భావంబు నొంది యసురేంద్ర శిరో
గ్రీవమ్ముల రణభూమికి
గావింతును బూజ శార్ఙ్గకాండ తతులన్.

సీ॥ యాజకా కల్పిత హవ్యభాగంబులఁ
గొనుఁడు దేవత లసంక్షోభముగను,
పుష్పకాలోకనో ద్భూత సంత్రాసమ్ము
మానుఁ డాత్మల నభోయానపరులు,
శప్త దైత్యోజ్ఝిత సౌరబందీ జటా
మోక్షం బొనర్పుఁడు భువనపతులు,
దైత్య వల్లభు కంఠదశకమ్ము కాలపా
శాకృష్టమని యెంచుఁ డమరవరులు,

తే॥గీ॥ చనుఁడటంచును స్తనిత నిస్వనముతోడ
నమృత వాగ్వర్షమున నిర్జరాళికెల్ల
హృదయతాపమ్ము చల్లార్చి ముదముగొల్పి
శ్రీహరి శ్యామమేఘ మ్మదృశ్యమయ్యె.

మ॥ పురుహూతప్రముఖాది దేవతలు సమోద్మోదంబుతో ఋక్షవా
నర గర్భంబుల జన్మమందిరి రమానాథర్త్విజుం డాజి భీ
కర దైత్యేంధనరాజి వేల్వగ వషట్కారంబు వాక్రుచ్చి, దు
ష్కరనక్తంచర సర్వనాశమఖ దీక్షాపూర్తి సంధింపఁగన్.

సీ॥ ఋక్షయోని విధాతృ జృంభంబునన్ బుట్టె
జాంబవంతుండను సత్త్వఘనుఁడు
ప్లవగాంగనాకుక్షిఁ బాకశాసను నంశ
జనియించె భుజదర్పశాలి వాలి,
దినకరాంశంబున వనచరోదరమున
సుగ్రీవుఁడను మహాశూరుఁ డొదవె,
అనిలతేజంబున నంజనాసతి కుక్షి
హనుమంతుఁడను వీరుఁ డవతరించె,

తే॥గీ॥ గంధమాదన నల నీల గజ సుషేణ
శతబలి ద్వివిద మైందా ద్యసాధ్యబలులు
హరికి తోడ్పాటుప ఋక్ష వానరులయందు
నిఖిలబృందారకాంశ జనించిరిట్లు.

## ⇐ యజ్ఞపురుషుఁడు పాయసమిచ్చుట ⇒

తే॥గీ॥ ఇచటమునికృత పుత్త్రికామేష్టియందు
పాయసోదర సౌవర్ణపాత్రి తోడ,
యజ్ఞపురుషుఁడు వహ్నిమధ్యంబునుండి
ఋత్విజుల కచ్చెరువు దోప నేగుదెంచి.

తే॥గీ॥ పరమపురుష ప్రవేశ దుర్భరతనొందు
పాయసాపూర్ణ సౌవర్ణ పాత్రఁ దెచ్చి
యమృతభాండంబు నుదధి దేవాధిపునకు
నెమ్మి నర్పించి నట్టులా నృపతి కిచ్చి.

కం॥ త్రైలోక్య ప్రభవుండగు
శ్రీలోలుం డెందుఁ బుట్టుచెలువొందునొ, భూ
పాలున కాచరుమహిమము
బోలఁగ వినిపించి యజ్ఞ పురుషుం డరిగెన్.

చం॥ అరయఁగ భూనభంబుల కహర్పతి తేజ మొసంగునట్లు, భూ
వరుఁడును కోసలాత్మజకు భద్రగుణంబుల పెద్దయంచు, సుం
దరియని కైకకున్ చరు వుదారత నిచ్చియు, తద్గుణద్వయో
త్తర యని వారిచేత చరుదాయము మాగధి కీయ నెంచినన్.

కం॥ పతిచిత్తం బెఱిఁగిన యా
సతులర్థం బర్థ మొసఁగ సాధ్వికి భాగ
ద్వితయమ్ము సయ్యె నీ గతి
కుతుకమ్మునఁ జరువు పంచి కుడిచిరి సుదతుల్.

తే॥గీ॥ వేయికిరణుఁ సమృతంబు పిల్చి తెచ్చి
తామరస మిత్రుఁ డాత్మలో దాచినట్టు
లువిద లెల్లరు సత్ప్రజాభ్యుదయమునకుఁ
బరమ పురుషాంశ గర్భ సంప్రాప్తి గనిరి.

తే॥గీ॥ గర్భమందరలైన యా గరితలెల్ల
సఫల గర్భంబులైన సస్యంబులట్లు
పాండురచ్ఛవిదృశ్యలై పరగి రూర్పు
టలసతలు దోప నిద్రలు తూలుకులాడ.

సీ॥ శంఖ చక్ర గదాసిశార్ఙ్గ లాంఛనులైన
గుజ్జు లెప్పుడు చుట్టు కొలుచునట్లు,
స్వర్ణ పక్ష ప్రభాచ్ఛన్నాభ్ర సౌపర్ణ
పృష్ఠ మెక్కి వయాళి వెడలినట్లు,

తీర్థాభిషేకంబు తీర్చి భాగీరథి
నిగమ సూక్తుల మునుల్ పొగడినట్లు,
కమలాలయా కరకమల రంజితనవీ
వ్యజన సంసేవలం బడసినట్లు,

తే॥గీ॥ గర్భముననున్న యా జగత్కర్త మహిమ
స్వప్నములుగాంచి నిజపతివ్రతలు దెలుప
భువన సద్గురునకు గురు భూసురుండగుట
నాత్మ భాగ్యమపారమం చలరు నృపతి.

తే॥గీ॥ అద్వితీయైకభావుఁడౌ నాత్మ, వారి
గర్భభేదంబుచే ననేకత్వ మందె!
అమృతకరరేఖ జలదర్పణాదులందు
భిన్న భావంబులం బొంది వెలయునట్లు.

చం॥ గురుతరనైశ సంతమసకోటి హరించుచు దివ్యతేజముల్
పరమ లతామతల్లికి శుభస్థితి గాంచినయట్లు కోసలే
శ్వరసుత పుత్త్రుఁగాఁ బడసె శౌరి నిశాచరవైరి, నల్ల భూ
వరు హృదయంబుతో విబుధవల్లభు నుల్లము పల్లవింపఁగా.

తే॥గీ॥ అద్వయానందమూర్తియై యలరె యఖిల
యోగి చిత్తైక విహరణోద్యోగి యగుట
రాముఁడని లోకమంగళ కాముఁడగుచు
నామధేయం బొనర్చె భూనాథమౌళి.

చం॥ ఇనకులరత్నదీపము మహీపతి గేహమునన్ వెలుంగ, రా
వణ గృహదీపికాతతి విభాతమునందటు వెల్లబాఱె; నా
తనయునితోడి కోసలసుతామణి యొప్పె ననాఘ్రపూజలన్
దనరిన జాహ్నవీ సలిలధారనుబోలి మనోజ్ఞమూర్తియై.

తే॥గీ॥ కేకయాత్మజ భరతు సుశ్లోకచరితుఁ
గనె సుమిత్రయు నాత్మభాగంబులైన
పాయసార్ధంబులన్ జగద్భద్రమతుల
వినుత లక్ష్మణ శత్రుఘ్ను లనెడి కవల.

తే॥గీ॥ ప్రకృతి రమణీయమై శాంతభావ మొంది
సౌఖ్యదాయినియై యొప్పె; సకలలోక
మంగళాకర తద్రాజమౌళి పుత్త్ర
జన్మ సమయంబునన్ మహోత్సవ మెలర్ప.

సీ॥ జలజాక్షు నెడఁబాటు సైప కిలకు డిగ్గు
నైకుంఠ మనఁగ భూలోక మమరె,
దితిజ భీతిఁ దొలంగి దెసలెల్ల నూర్చిన
కరణి లేఁదెమ్మెర కలయవీఁచె,
దైత్యావమానంబు తలగినట్టుల సూర్య
వహ్ను లుజ్జ్వలదీప్తిఁ బ్రజ్వలిలిరి,
అసురేంద్ర రాజ్యేందిరాశ్రు బిందువులట్లు
దశకంఠు మకుట రత్నములుడుల్లె.

తే॥గీ॥ భూప పుత్త్రోత్సవారబ్ధ భూరి తూర్య
రవముతో దివ్య దుందుభి రవము చెలఁగె,
అమరతరుకీర్ణ సురభి లతాంతవృష్టి
మంగళారంభముల కగ్రిమాంగమయ్యె.

తే॥గీ॥ క్షత్త్రి యోచిత జాత సంస్కారమంది
ధాత్త్రికాదత్త శుభ పయోధార లాని,
ప్రథమ సంజాత దశరథ ప్రమదమట్లు
పెరుగఁజొచ్చిరి శిశువులు పెరిమ లొలుక.

చ॥ సహజవినీతు లాన్నృపతిచంద్ర తనూజులు సద్గురు క్రమ
ప్రహిత వివేకసంస్కృతుల భద్రగుణంబుల ప్రోడలై రఘూ
ద్వహ కుల గౌరవంబునుఁ బదంపడి పెంపొనరించి రొక్కటన్
మహిమవిశిష్టమౌ ఋతు సమాజము నందనశోభనుం బలెన్.

చ॥ తమతమ తల్లులౌను చరుదాయము నెయ్యము గొల్పినట్లు లా
సుమతులు రామలక్ష్మణులు చొక్కుచు మక్కువనుందు రొక్కటన్
గమలకులాప్తచంద్రు లన; కైకసుతుండు సుమిత్రపట్టియున్
తమి ననిలానలంబుల విధంబున జంటగనుందు రొక్కచోన్.

తే॥గీ॥ ఆ కుమారులు వినయ నయ ప్రసక్తి
జనమనోహ్లాద మొనరింప శక్తులైరి
ఘర్మసంతప్త జీవలోకమున శ్యామ
లాంబుధర రమ్యదివసవారంబు లట్లు.

క॥ గుణమణినికరంబుల దిన
మణికుల మూర్ధన్య రాజమౌళి దశరథున్
గణనీయ శమదమాదిక
గుణరత్నాకరులు సుతులు, గొలుతురు నెమ్మిన్.

సీ॥ పురుషార్థములు నాల్గు పొరిదేహముల నంది
వ్యస్తమై యుత్పన్న మైనయట్లు,
చతురుపాయంబులు జన్మగ్రహంబంది
యొక్కచో నవతార మొందినట్లు,
దైత్యాసిధారకుఁ దలఁగని చౌదంతి
దంతంబు లటు రూపుదాల్చినట్లు,
దనుజారి దీర్ఘదోర్దండ చతుష్కంబు
పూరుషాకృతిఁ దాల్చి పుట్టినట్లు,

తే॥గీ॥ పొల్చి పరివర్థమానులై పుత్త్రులెలమి
సంతసము నింప మదికి హర్షము జనింప
రమ్యసంతోషవార్ధి తరంగపంక్తిఁ
దేలి యుయ్యేలలూగు ధాత్రీవరుండు.

## ⇐ యాగరక్షణము ⇒

తే॥గీ॥ కౌశికుం డొక్కదినము భూకాంతుఁ జేరి
క్రతువిరోధులఁ జంపి యజ్ఞంబు గావ
కాకపక్షాభిరాము రాఘవునిఁ గోరె;
జ్వలితతేజస్కులకు వయఃపాక మేల?

ఉ॥ ప్రాణసమాను రాము నెలఁబ్రాయపు ముద్దుకుమారుఁ గోర నా
యానత నైరి సంస్థితుఁ డయోధ్యేశ లక్ష్మణుఁ దోడొనర్చి యా
మౌని ననుపంగఁ గాంచె; జనమాన్యులు రాఘవు లర్థి గోరినన్
ప్రాణములైన నీయ వెనుకాడరు ప్రార్థిత దానతత్పరుల్.

కం॥ పురనిర్గమ సంస్కృతికై
నరపతి శాసించు లోన నవజలదంబుల్
మరుదంకురములు వీవఁగ
సరస కుసుమవృష్టి మార్గ సంస్కృతి నెఱపెన్.

తే॥గీ॥ తండ్రియానతి నెఱపు నా ధన్వియుగము
ప్రణతిమై వ్రాలె జనకుని పాదయుగళి;
సరస మున్యాశ్రమ ప్రవాసమున కేగు
సుతుల యానఁదల నృపతి యశ్రువులు రాలె.

కం॥ జనకాశ్రు సిక్త శీర్షులు
జనలోచన మాలికాభి సంస్కృత మూర్తుల్
మునివెంట సరుగఁ జొచ్చిరి
యనువెనుకొను మధువసంతు లెన యనఁదగుచున్.

క॥ సౌమిత్రి మాత్రసహితుని
రాముని ముని గోరె ననుచు రాజేంద్రుఁడు తత్
క్షేమార్థ మాశిషంబును
గామదమున్ వజ్రకవచ కల్పము నొసఁగెన్.

సీ॥ జననీ భుజాపరిష్వంగ సౌఖ్యము బోలి
మునిపథానుగమంబు ముదము గూర్ప,
స్వర్ణదీ వీచీవివల్గితంబును బోలి
ముగ్ధ చంక్రమణంబు మురువు సూప,
లలిత బలాతిబలా ప్రభావంబున
మార్గ శ్రమంబు శమంబు నొంద,
మునినాయకోదితా పూర్వ కథాసక్తి
వారువంబటు పురోవాహి గాఁగ,

తే॥గీ॥ వర్ధితోత్సాహులై హర్ష భరము తోడ,
కేళికోద్యానవన తటీ క్రీడనార్థ
మేగినట్టుల సంతోష మెసక మెసఁగ
దాశరథు లేగుచుండిరి దశరథుని తోడ.

సీ॥ కొలుచు రాఘవుల శకుంత సంతానంబు
శ్రవణామృతాయిత స్వనము వినిచి,
అర్చించు సరసు లాయనవీశ పుత్త్రుల
విరిదమ్ములను గను విందొనర్చి,
సేద దేర్చును మందశీతవాతంబు లి
క్ష్వాకు వంశ్యుల సౌరభంబునించి,
శ్రమ బాపు కాలాంబుదములు దాశరథుల
రవిఁ గప్పి నీడ లేర్పడఁగఁ జేసి,

తే॥గీ॥ దివ్య భోగాఢ్యులైన యాదిత్య వంశ్యు
లురకఁ గ్రుమ్మర ప్రకృతి చూపోపలేక
వేడ్కఁ నొనరించు నుపచార వితతియట్లు
పరగెఁ దద్రాజసుతుల కిధ్వమ్మునందు.

తే॥గీ॥ కమలవన రమ్య సారసాకరముకంటె
సాంద్ర శీతల పాదపచ్ఛాయకంటె
లలిత దర్శనులని రామ లక్ష్మణులను
గని మహానందమందును మునిగణంబు.

తే॥గీ॥ ఫాలలోచన నేత్రాగ్ని భస్మమగుట
నంగ జన్మాశ్రమంబు శూన్యంబునైన
సహజ సుందర లావణ్య చారుమూర్తి
రాముఁడట నిల్వ మదనాభిరామమయ్యె.

చం॥ చని యటు లొక్కచో విజన సాంద్రవనస్థలిఁ జేరి రాఘవుం
డనె మునితోడఁ దాపసజనాశ్రమ భూములు గానరావు దు
ర్జను లెవరేని యిందు జనసంహరణం బొనరింతురొక్కొ నా
నినకులవర్యుతో నిటు మునీంద్రుఁడు పల్కఁదొడంగె నెమ్మిమై.

ఉ॥ తొల్లి బలారి వృత్రు నిటద్రుంచెను ; దాన తదీయ తేజముం
జెల్లె ; సురల్ మహేంద్రు నభిషిక్తు నొనర్పగ పుణ్యవారిచే
డుల్లెను గిల్బిషం బిట ; కడుం బ్రియమంది సురేంద్రు డిద్ది సం
పల్లలితం బొనర్చె ; మునివర్యుల కాశ్రయమయ్యె నంతటన్.

కం॥ సుందుండను నొక యక్షుని
సుందరి మారీచుఁడనెడు సూనునితోడన్
మ్రందింపఁ గడగె తాపస
బృందంబుల దాన నిచటు విపినం బయ్యెన్.

ఉ॥ తాటక పుత్త్రిఁగూడి బలదర్పమునన్ జనలోక మార్గ శృం
గాటకపాళి నిల్చి చిరకాలము పాంథుల జంపుచుండ ని
చ్చోటికిఁ గష్ట కుంభజుడు సోలుచు మార్గమునెంట రాఁగ న
మ్మేటిని మ్రింగ బూనె; నటమీఁద నగస్త్యుడు శాప మిచ్చినన్.

తే॥గీ॥ కుంభసంభవముని దత్త ఘోరశాప
రాక్షసీభూత యయ్యె నీ రఘుశియనుచుఁ
దాటకావృత్త మెఱిగింప తెలిసి మేటి
భూపసుత చాపముల గుణారోప మయ్యె.

సీ॥ కాలాంజనచ్ఛవి గ్రమ్మ నల్లని మేను
బహుళపక్ష క్షపాభ్రాంతిఁ గొలుప,
సరకపాలాస్థి కుండల మండిత శ్రుతుల్
బక సేవితాంబుద ప్రభల నీన,
పాదఘట్టన జాతవాత ఘూర్ణంబులై
మార్గద్రుమంబులు మహికి నొరుగ,
కర్ణ కఠోర భీకర కంఠరావంబు
వన్యసత్త్వ ప్రాణ భయకరముగ,

తే॥గీ॥ ప్రేత వసనంబు మెయిదాల్చి ప్రేవులల్లి
మేఖలమ్ముగ మొలదాల్చి మిట్టిపడుచు,
సిల్లు చూపుట కోపని సింధురంబు
మాడ్కి పఱతెంచె తాటక మాని మ్రింగ.

తే॥గీ॥ ఉద్యతోద్దండ భుజదండ యుగముతోడ,
ప్రేత వనజాత మరుద పవిత్ర గాత్ర
నరసి స్త్రీవధ మందిలి కరుణతోడ
సాయకంబును విడిచె నిక్ష్వాకుకులుఁడు.

శా॥ ఆ రాత్రించరి వజ్రసార తనుమధ్యం బందు శోభిల్లె తత్
శ్రీరామాశుగజాత రంధ్రము సురారి ప్రాజ్య సామ్రాజ్య ల
క్ష్మీ రంగస్థల దర్శనాకుమ యమాల్లోక ప్రవేశార్థమై
ద్వారం బెత్తిన యట్లు పర్వతగుహాయామాభి సంశోభియై.

తే॥గీ॥ బాణ నిర్భిన్న హృదయయై వసుధఁ ద్రెళ్లి
క్రక్కఁదల జేసె వన తరుగణముతోడ
విష్టపత్రయ సంపూర్ణ విజయలబ్ధ
రావణ స్థిర సామ్రాజ్యరమను గూడె.

తే॥గీ॥ రామ మన్మథ శరము దుర్భరము గాగ
స్వాంతమున నాట నా నిశాచరి సుగంధ
రక్త చందనలిప్తయై ప్రాణనాథు
వసతిఁ జేరెన తనుపరవశతనొంది.

ఉ॥ నాగ సహస్రతుల్య బల నాశితసన్మునివాటఁ దాటకన్
వే గడతేర్చి రాఘవుఁడు వీరుఁడు కౌశిక మౌనినుండి ర
క్షోగణ నాశ కాస్త్రతతి సూర్యశిలల్ సమిధాగ్ని నేఁచు నే
జోగతి నైజతేజమున సూర్యునినుండియు బోలెఁ గైకొనెన్.

తే॥గీ॥ వామనాశ్రమ మతిలోక పావనంబు
గాంచి ముని తెల్పు తత్పూర్వ గాధ లరసి
ప్రాక్తనాత్మీయ లీలైక భాగ మనుచుఁ
దెలియ కుత్సుకుఁ డయ్యె నాదిత్యకులుఁడు.

తే॥గీ॥ మునిజనోత్తమ కల్పిత పూజనంబు
బద్ధ పల్లవ కరపుట పాదపంబు
దర్శనోన్ముఖ మృగయూధ దర్శనీయ
మైన సిద్ధాశ్రమమ్ము సమ్మాని చేరె.

చం॥ జగములఁ గ్రమ్ము సంతమసజాల మడంచు దివాకరేందు ల
ట్లగణిత వీర్యులా దశరథాత్మజు లధ్వర దీక్షఁబూను మా
నిఁ గరగృహీత బాణులయి నేర్పున గావ దొడంగి రిమ్ములన్
బగలును రేయి కన్మొగుడుపాటు నెఱుంగక జాగరూకులై.

తే॥గీ॥ బంధుజీవ సుమంబుల పగిది రక్త
బిందువులు గ్రమ్మ, నా యజ్ఞవేది గాంచి
భీతిచే స్రుక్స్రువంబుల వీడి పాఱి
రచటి ఋత్విజు లెల్లరు ప్రాణ భీతి.

ఉ॥ జన్నము గాచుచున్న నృపచంద్రుఁడు సజ్య మొనర్చి చాప మం
దున్న మునీంద్ర సత్తముల నోడకుఁ డోడకుఁ డంచు బల్కుచున్
గన్నుల కెంపు సొంపడర కాలసమాకృతి దుర్నిరీక్ష్యుఁడై
పన్నగ దైత్య సైన్యములపై గనయం గమకించి ధీరుఁడై.

కం॥ తూణీరంబున నుండియు
బాణంబును బెఱికె మోము పై కెత్తి గనెన్
క్షోణీశ సుతుఁడు మింటన్
కోణప సైన్యంబు గృధ్ర గుప్తధ్వజమున్.

కం॥ రక్షస్సైన్యముపై శర
విక్షేప మొనర్ప మాని వీరుడు సైన్యా
ధ్యక్షుల గెడపె ఫణీంద్రుల
శిక్షించెడి గరుడి యవదుచిలువ గవియునే?

శా॥ ఆ రాజన్యుఁడు దోర్బలం బడర వాయవ్యాస్త్రమున్ వైచి యా
మారీచున్ బడద్రొబ్బె వార్ధి; బలసంపన్మత్తు మాయాధికున్
వీరున్ గాల్చె సుబాహు జన్యమున నాగ్నేయాస్త్ర యోగంబునన్
బాఱంజొచ్చిరి తక్కురక్కసులు స్వప్రాణావనాసక్తులై.

తే॥గీ॥ విఘ్నకారులఁ బొలియించి వేడ్క యజ్ఞ
రక్ష యొనరింప రాము శౌర్యమ్ము మెచ్చి
మునులు కులపతి క్రతు కార్యములను నెమ్మి
జేయఁ దొడగిరి భయశూన్య చిత్తవృత్తి.

— సీతాకళ్యాణము —

తే॥గీ॥ అవభృథ స్నాతుఁడైన సంయమివరుండు
ప్రణతి చంచలచూడులౌ రాజసుతుల
దర్భ సంపర్క కఠిన హస్తమ్ముతోడ
నాశిషంబులు వల్కుచునంట నెమ్మి.

మ॥ "ధరణీశాత్మజుఁ డెవ్వఁడేని హరకోదండంబు మోపెట్టి బం
ధురదోర్దర్ప మెలర్ప మార్గణమునందుం గూర్చు నవ్వానికిన్
ధరణీపుత్రిక నిత్తు" నంచు నెఱుగన్ జాటించి వైదేహుఁ డ
ధ్వర మొక్కం డొనరింప దీక్షగొని పిల్వంబంచె మౌనీంద్రులన్.

చం॥ జనక నృపాలు దూత మునిచంద్రుని గౌశికుఁ జేరి పిల్వ స
మ్మని యట కేగఁబూని ఫణి భూషణ కార్ముక దివ్య సత్కథా
జనిత విశేష కౌతుకవశంవద చిత్తుల రాజ పుత్త్రులన్
గొని యట కేగె; సత్ఫలము గూర్పదె సజ్జనసేవ యెన్నడున్.

తే॥గీ॥ గౌతముని పత్ని శతమఖాగంబుచేత
కఠిన పాషాణమయ్యె నెక్కాననమున
నధ్వజక్రాంతి రాఘవు లందు నిల్చి
రత్తపోధనుతోడ సాయాహ్న వేళ.

తే॥గీ॥ అతుల సౌందర్యవతి యాచు సమరనాథు,
కోడిగాఁ జేసి కూయించు కోమలాంగి
యాత్మ పూర్వ స్వరూపమ్ము నందఁ గనుట
కలుషహర రామపద రజః కరుణ గాదె.

చం॥ ముని యిటు కోసలేశ్వరుని పుత్త్రులతోఁ జనుదేర గాంచి యా
జనపతి యర్ఘ్య పాద్యముల సత్కృతి సేయుచు భక్తి మీఱు దా
ల్చిన యల యర్థకామ యుగళిం బెడబాయని ధర్మునట్లు పూ
జన మొనరించె సంతసము సంధిల గౌశికు ధర్మపద్ధతిన్.

తే॥గీ॥ వసుధ కేతెంచు నల పునర్వసుల పోల్కి
పొల్చు నబ్బాలకుల గాంచి పుర జనంబు
తెప్పపాటుంతో వెడుగంచు టెచ్చు వడును
నృప కుమార దిదృక్షా వితృప్త దృష్టి.

తే॥గీ॥ యజ్ఞ కార్యంబు పూర్ణ మైనంత మౌని
జనక రాజేంద్రుతో రామచంద్రుఁ డభవ
కార్ముకాలోక నోత్సాహ కలితుఁ డగుట
తెలిపె సమయజ్ఞుఁడై శుభా కలిత దృష్టి.

సీ॥ వైవస్వతుని దొట్టి ప్రథిత రాజన్యుల
వాసికెక్కిన సూర్యవంశ మరసి,
శతకోటిమన్మథ సౌందర్యమున మించు
శ్రీరాము నెమ్మని చెలువ మరసి,
రతికాంత చెలువమ్ము నతకరింపగజాలు
భూజాతమెయి దీవపొలుపు నరసి,
ధరణీశ భుజదర్పదళన శంభుశరాస
నారోప ముంకువ యగుట నరసి,

తే॥గీ॥ అతుల చింతాకులుం డౌచు నెడు గలచు
విధికృతం బెట్టులో యని బెగ్గడిలును,
చెడెను కార్యం బటంచు వ్రేల్మిడి యొనర్చు
జనకభూపాలుఁ డాత్మ నాసమయ మందు.

తే॥గీ॥ అనియె మునితోడ మఱియు నిట్లా నృపుండు
సమద మాతంగయూధపా శక్యమైన
కడిది భారంబు పూనంగఁ గలభకంబు
చాలునే మెట్టి బల పౌరుషంబు లున్న.

తే॥గీ॥ ప్రబల దోర్గర్వ దుర్వార వసుమతీంద్ర
వీరులెందఱో ధనువు మోపెట్టలేక
జ్యా సమాఘాత కఠినత్వచంబులైన
యాత్మ భుజములఁదిట్టి సిగ్గిరుట గనమె ?

చం॥ అన మునిపల్కె నీ దశరథాత్మజు దోర్యుగసార మింతటన్
గనియెదుగాక యిచ్చె, హరకార్ముక మెక్కిడ ; నీశు చాపమే
యినకులనాథు చేతివస మెంతో ? యెఱింగెదు ; వజ్రసార మ
ద్రిని గనఁబోలు నట్లు రఘుధీరుని లావును వింటఁ దెల్లమా.

తే॥గీ॥ అనుచు ముని పల్కె నాప్త వాక్యముల నరసి
విశ్వసించెను బతి రఘువీరు లావు
ఇంద్రగోప సమాన వహ్ని ప్రరోహ
కమ్మ ననుదాహ కత్వ గుణమ్ము వోలె.

కం॥ హర కోదండము నేరన్
బరిచర గణకోటిఁ బంచె వాసవుఁ డంభో
ధరముల తైజస కార్ముక
భరణార్థం బటు విదేహపతి యవ్వేళన్.

ఉ॥ ఖండ శశాంకమౌళి ఘన కార్ముక మెన్నఁగఁ గొండ గాన ను
ద్దండ గిరీంద్ర మిద్దియని తద్దయు రాజకుమారు లాత్మలన్
నిండిన భీతిమైఁ దొలఁగ నెమ్మి నసంఖ్య బలాఢ్యు లీశ కో
దండము నా సభాస్థలికిఁ దత్పరతన్ గొనివచ్చి రంతటన్,

తే॥గీ॥ కొడుకు పెండిలికై కన్యఁ గోరుచున్న
పంక్తిరథునకు జనక భూపాలు దూత
యిష్ట సంబంధ మెఱిగింప నేఁగుదెంచె
క్షణమున ఫలించుగాదె సజ్జనుల కోర్కె.

కం॥ జనక పురోధసునకు న
జ్జనపతి సత్క్రియ యొనర్చి సందేశంబుల్
విని సైన్యోద్ధత రజమున
నినరశ్మి మొఱుంగ మిథిల కేతెంచె వడిన్.

కం॥ చతురంగ బల నిరుద్ధ
క్షితిరుహావన యాచు మిథిల చేర్పడ ధరణీ
పతి చేరె ; ప్రియ నిరోధము
సతివలె నప్పురియు సైచె సైన్యోద్ధతులన్.

మ॥ జనకక్ష్మాపతి సోదరానుగతుఁడై సంబంధిఁ బూజించి హ
ర్షనవోద్భిన్న హృదబ్జుఁడై నిలువ విశ్వామిత్రమౌనీంద్రుఁ డో
జననాథాగ్రణులార ; మీ యుభయవంశ స్నేహ సంబంధముల్
చను లోకోత్తర మంగళాకరములై సర్వాభికాంక్ష్యంబులై.

తే॥గీ॥ వీర్యశుల్కంబుచే రఘువీరుఁ డవని
తనయఁ బడసిన కైవడి తదనుజాత
నూర్మిళనుఁ బొందుగాక గుణోజ్జ్వలుండు
లక్ష్మణుండు పరాక్రమ లక్షణుండు.

చం॥ జనకనృపాలు తమ్ముఁడు కుశధ్వజుఁ డీతఁడు హ్రస్వరోమస
జ్జనపతిపుణ్య సత్ఫలము సజ్జన సంస్తుత శుభ్రకీర్తి ; యీ
తని సుతలైన మాండవి నుదారగుణన్ శ్రుతకీర్తిఁ గైకయీ
తనయుఁడు శత్రుహంతయు యథావిధిఁ బెండిలియాట మేలనన్.

క॥ మీ యాజ్ఞ మా కలంఘ్యము
మా యుభయాన్వయములకును మంగళకరముఁ
శ్రేయస్కర మని యా భూ
నాయకు లంట మెచ్చి మౌని నాయకు నల్లన్.

తే॥గీ॥ వరుణ వాసవులట్టు లా వసుమతీశు
లర్థి నాచార నిష్ఠులై యాత్మజాత
కన్యకోద్వాహములఁ గులగౌరవముల
కుచిత వైభవములఁ జేసి రుత్సవమున.

సీ॥ శ్రీరామచంద్రుండు సీతఁ బెండిలియయ్యె
నబ్ధిజాతను సరోజాక్షుఁ డట్లు;
లక్ష్మణుం డల యూర్మిళా కరం బూనెను
శచి కరంబూను వాసవుడు నాఁగ;
భరతుండు మాండవిన్ బరిణయం బయ్యెను
శైలసంజాతను శూలిమాడ్కి;
శత్రుఘ్నుఁడు వరించె సతి శ్రుతకీర్తిని
భారతి నంభోజభవుఁడుపోలె;

తే॥గీ॥ నవవధూప్రాప్తి కోసలనాథ పుత్త్రు
లలరి రిటు ఫలసిద్ధుల వెలయు చతురు
పాయములభాతి పూర్ణులై వసుధ సకల
జన మనోహ్లాదసంధానచతురు లగుచు.

తే॥గీ॥ పతుల గుణరూపవంతులఁ బడసి సతులు
సతుల ననుకూలమతుల భూపతికుమారు
లాత్మ సుకృతంబులం బొంది యలరి రెంతొ
పరమ సంప్రీతిఁ బ్రత్యయ ప్రకృతులట్లు.

తే॥గీ॥ ఎలమి నిటు పుత్త్రులకును బెండిలి యొనర్చి
బాంధవంబున వైదేహుఁ బ్రస్తుతించి
వీడుకొని పుత్త్రసహితుఁడై మూఁడు నాల్గు
పయనముల ఱేఁ డొనర్చెను స్వపురిఁ జేర.

## పరశురామ గర్వభంగము

సీ॥ ధ్వజవితానము గూల్చుఁ బ్రతికూలవాతముల్
తటయుగ్మ ముత్కూల పాటనిమాఁడ్చ,
పరివేష మొగిఁ జుట్టె భాస్కరబింబంబు
ఫణి మండలాకృతి మణిని బోలె,
సంధ్యాభ్రశోణ రజశ్ఛన్నలై దిశల్
చూపోపవయ్యెను సుదతులట్లు,
భాస్కరుదెసఁ జూచి పలవించు నక్కలు
భృగుపుత్త్రుఁ గలనికిఁ బిలుచుకరణి,

తే॥గీ॥ దుర్నిమిత్తంబులం గాంచి దోసఁగు వాయ
శాంతిక్రియఁ జేయ భూకాంతుఁ డాత్మ
కుల గురు వసిష్ఠుఁ బ్రార్థింపఁ దెలిపె నతఁడు
పోరితం బౌ శుభోదర్కముగ నటంచు.

తే॥గీ॥ సైన్య నివహాగ్రమునను దేజం బొకింత
దుర్నిరీక్ష్య మహాద్యుతితోడ నొప్పె
యల్లనల్లన పౌరుషం బెల్ల మాపు
దాల్చినట్టుల మానియై తనరె నంత.

సీ॥ మాతృకమ్మగు చాప మార్గణమ్ములతోడఁ
పిత్ర్యలక్ష్మి యజ్ఞోపవీత మూని
సర్ప వేష్టిత హరిచందన ద్రుమమట్లు
శాంత భీభత్స వేషంబుఁ దాల్చి,

జనకాజ్ఞ నెఱవేర్ప జనయిత్రి కంఠంబు
ఖండించి ఘృణను లోకముల గెల్చి,
క్రోధంబుమై క్షాత్రకోటి శోణితకోష్ణ
జలములం దర్పణాంజలులఁ దీర్చి,

తే॥గీ॥ నృపతికులములఁ దున్మి మున్యేమమార్గు
లెక్కచేయునట్లు ద్రిప్పుచు లీల మాల,
దుర్భరాతప సంతాప దుర్నిరీక్ష్య
చండ మార్తాండుఁడన భార్గవుండు దోఁచె.

తే॥గీ॥ క్షత్రవధామర్ష ఖిన్నుఁడై క్షితిపసంఘ
సర్వ సంహార ఘోర దీక్షను వహించు
పరశురాముని, స్వసమాప్తి పరమ వయసు
నెంచి బాల తమిఁ జూచె నృపతిసుతుఁడు.

తే॥గీ॥ రామనామంబు తనయ శాత్రవులకొప్ప
హృద్యమును భయదాయియు నృపతి కయ్యె
హారమున భోగిమస్తక మందు నొప్పు
తరళతరకాంతి నెల్గు రత్నంబుపోలె.

మ॥ అవనీనాథుఁడు భార్గవున్ దరిసి పాద్యం బర్ఘ్యముం గూర్చుచున్
వివిధ ప్రక్రియఁ బూజ సల్ప నదియున్ బిసంబు గైకొనె, రా
ఘువు క్షాత్త్రోజ్జ్వల వంశదావ దహనాకారోగ్ర దృగ్రాజిచే
నిప్పులుం జేయు క్రియన్ భృగూద్వహుఁడు నిర్ణిద్ర క్రుధన్ గాంచుచున్.

తే॥గీ॥ వింటి కొప్పున వాకేలు నెత్తి నిలిచి
సవ్యహస్తాంగుళులమధ్య శరము పూని
త్రిప్పుచట నిర్భయుం డయి తిరుగు రాము
నరసి వీక్షించి యిట్లు యుయుత్సఁ బలికె.

పూర్ణిమా చంద్రునిఁ బోలి రాఘవునందు
వింత తేజము నిండి వెల్గులీనె ;
సకల దృశ్యమ్ము లాశ్చర్యమ్ముతోఁ జూచు
పంక్తిరథాదు లబ్రమ్ము గనిరి ;

తే॥గీ॥ వాసరాంతమునను చంద్ర భానులట్లు
కాంతి నొందుచు బాయు నా ఘనులు మించి
రవనిపై నింటికొప్పాని దివిచి రాము
చంద్రుఁ డా కార్ముకంబు సజ్యం బొనర్చె.

తే॥గీ॥ శమిత తేజస్కుఁ డైన యా జామదగ్న్యుఁ
జాప గుణారోపితామోఘసాయకంబు,
కాంచి కరుణాప్రపూర్ణ హృత్కమలుఁ డగుచు
ననియె నవ్వుచు రాముఁ గన్నుమనికె నెమ్మి.

కం॥ మహితాత్మ ! చంపఁజాలను
మహిసురుఁడవు గాన నిన్ను నా కిచ్చితి నీ
వహితమహిఁ గోరి చేసినఁ
బ్రహారింతును బ్రహ్మహత్య పడయని యుండన్.

తే॥గీ॥ కడిఁది మత్సాయకంబమోఘంబు గాన
చేర్కొనుము లక్ష్యమెయ్యది విడువవలయు ?
పాదయుగళంబు ద్రుంతునో స్వర్గలోక
మార్గమునుఁ ద్రుంతునో యన భార్గవుండు.

చం॥ చెలువుగ నొప్పఁ బల్కె నిటు "చిన్మయరూప ! మహాత్మ ! నిన్ను నే
నెఱుఁగనె ? పుణ్యమూర్తి భుజగేంద్రశయానుఁ బురాణ పూరుషున్ ;
ధర నవతార మెత్తితివి ; తావక వైష్ణవ తేజ మారయన్
బరికుపితాత్ముఁ జేసితి ; కృపాపర ! మత్కృతమెల్ల సైఁపవే ?

తే॥గీ॥ భార్గవుం డను రాముండో ప్రథితకీర్తి!
మాతృక మ్మగు రాజసమతిం దొలంగి
పితృ కులాగత సాత్వికమతిని గనుట
భవదనిందిత సంగమ ఫలము గాదె!

కం॥ నిగ్రహ మీగతి నాకు న
నుగ్రహమ్మై తనరె లోకనుత! సురకృతి స
మ్యగ్రీతి నిర్వహింపవె
దిగ్రాజితకీర్తి! దివ్యతేజము వెలయన్.

కం॥ అని పల్కి సెలవుఁ గైకొని
మునిచంద్రుఁడు భార్గవుండు పోయె యథేచ్ఛన్;
ఘన వైష్ణవాంశ మీక్రియ
నిన వంశ్యుం జెందె దుర్నిరీక్షం బగుచున్.

మ॥ జమదగ్ని ప్రియపుత్త్రుఁ డట్లరుగ నైక్ష్వాకుండు శ్రీరాఘవున్
ప్రమదం బందుచు గ్రుచ్చియెత్తి శిర మాఘ్రాణించి స్వాంతంబునన్
దమిఁ జింతించు బునఃప్రసూతుఁ డనుచున్ దావాగ్నిసంతప్త వృ
క్షము కుంభామృతవృష్టిఁబోలెఁ బరితోషం బందుఁ బూర్ణంబుగాన్.

తే॥గీ॥ పయనములు గొన్ని యిట్లు భూవరుఁ డొనర్చి
మైథిలీదర్శనోత్సుక మానవతుల
నయన కువలయ మాలికానద్ధజాల
రాజితమ్మగు నాత్మపురమ్ముఁ జొచ్చె.

తే॥గీ॥ యంత్ర గాత్రంబులేక స్వరానుకూల
మేళనంబున శ్రుతి పేయ మృదుల మధుర
గానరస సుధ వెలిగొల్పుకరణి రామ
జనకతనయా సుమానుషోత్సవముఁ దనరు.

కం॥ అని యిట్లు కవలు రామా
యణమందలి బాలకాండ మంతయుఁ దెలుపన్
విని రామచంద్రుఁ డవ్వలి
తన చరిత మెఱుంగఁగోరెఁ దత్పరమతియై.

చం॥ జననుత సత్యవాక్చతుర! సారతరోజ్జ్వల సద్గుణాకరా!
యనితర లభ్య కీర్తిధన! యార్జన శోభిత సాధువర్తనా!
ఘనతర సత్క్రియాచరణ కౌశల లబ్ధ యశో విభూషణా!
సునిశిత ధర్మకర్మ పరిశుద్ధ హృదంతర! పుణ్యతత్పరా!

కం॥ కరుణా తరంగితాంతః
కరణా! గురు నిత్యధర్మ కార్యాచరణా!
చిరపుణ్య నిత్య! యాశ్రిత
భరణా! ఘన కీర్తి వైశ్య వంశాభరణా!

మాలిని॥ సరస సుగుణలోలా! సజ్జన స్తుత్య శీలా!
విరచిత మృదువేషా! విశ్వ విజ్ఞాన భూషా!
గురు బుధ జనగేయా! కోవిదాజ్ఞా విధేయా!
పరిజన శుభ కామా! భద్ర గీతాత్మనామా!

గద్య॥ ఇది శ్రీమత్కాశ్యపగోత్ర పవిత్ర సుబ్రహ్మణ్య పుత్ర
బుధజనవిధేయ వేంకట సుబ్రహ్మణ్య నామధేయ
ప్రణీతంబైన శ్రీ రఘురామ చరిత్రంబునందు
బాలకాండము.



చ॥ పురజనముఖ్యులం బిలిచి భూపతి తెల్పె జరాభిభూతి నా
జ్యరము వహింపజాలమి నుపాత్తగుణోత్తరు రామచంద్రు ను
స్థిరధరణీశు భరింప నభిషిక్తు నొనర్తు నటంచు; నెమ్మి భూ
వరు వచనామృతంబు చెవిసోకి ప్రహర్షము నొందిరా ప్రజల్.

తే॥గీ॥ కోమలోద్యాన తరువులు కుల్కి చిగిర్చి
తనివి నొందించు నాపు లయోధ్యాధినేత
పలుకు రామాభిషేకోక్తి పౌరజనుల
మానసంబుల సంతోష మూనజేసె.

సీ॥ కమ్మగొజ్జంగనీటు కలయంపులను జల్లి
ముత్తియంబుల వింత ముగ్గు లెట్టి,
కర్పూరరజమున గంధసారము గల్పి
గృహభిత్తికా పరిషిక్తలను నొనర్చి,
యగురుకంచును హరిద్రాది ద్రవంబుల
లీలం గైసేసి యల్లింపు భూమి,
నానాంశుకోపేత చిత్రకేతనరాజి
ప్రాసాద మందిరపాళి నిల్పి,

తే॥గీ॥ పసటిక కంబంబులను కదళ్ళలను గట్టి,
తలిరుటాకుల తోరణా లలవరించి,
రామచంద్రాభిషేక పర్వమును గోరి
పురము కైసేసి రెలమి నా పురిజనులు.

సీ॥ తనువుతోబాటు చిత్తము గూడ పవిత్రమై
బాహ్యాంతరంగైక్యభావ మొంద,
గుణ రూపముల బుద్ధికూడి కుబ్జత్వంబు
వడసి ముప్పిరిగొన్నపగిది వెలయ,

అన్యవైభవ దర్శనాసహిష్ణుతఁబోలె
కుటిలనేత్రంబు లాకుంచితములుగ,
కఠినచిత్తములోని కార్కశ్యమంతయు,
పలుకు నుల్కల వ్యక్తమగుచు నుండ,

తే॥గీ॥ కలుష విషపూర్ణ కాలాహి కన్యఁబోలె
భయమునుం గూర్చి మూపులు ప్రక్కఁ గొదుగ,
కైక మన్నించు సింటరిక్రాలుగంటి
మంథర యటన్న కుబ్జ విస్మయముఁ దోఁచె.

శా॥ ప్రాసాదాగ్రము నెక్కి తత్పురము సౌభాగ్యంబు వీక్షించి శో
భా సంపత్తికిఁ జిత్తసీమ యలరన్ బ్రహ్లాదించి తన్మాల్యముల్
దాసీమండలి తెల్ప, ఆచ్చవడి ఖేదం బంది యొక్కింతలో
మోసం బంచును కైకఁ జేరఁజనె వ్యాముక్తాస్త్రమానా నడిన్.

ఉ॥ రోషము నిల్లు వచ్చు బహురోషపరీతను ధాత్రి గాంచి యా
రాజకశాంకతుల్యముఖి ప్రస్ఫురదార్తిఁ గలంగి గాఢతం
ద్రాజసమూర్తిఁ బోఁడి మిహిరస్థితి నష్టసరోజమో యనం
గాఁ బలు వేది పల్కెఁ గలకంఠమనోహరకాకలీధ్వనిన్.

తే॥గీ॥ ఏమి మంథర! యింత యుగ్రత నేల!
పాటువచ్చితి వేలనే భద్రమగునె!
యస్మదార్యులకు సేమమగునె! కుబ్జ!
యనఁగఁ గైకకుఁ దల్పని ట్లాగ్రయాని.

తే॥గీ॥ భద్రమింకను నీ కసంభావ్య మగును;
మంగళంబంట కలలోని మాటయగును;
దాసి వౌదువు మావలెఁ దరుణి నీవు;
సవతికొడుకు కెల్లి రాజ్యవైభవము పూన.

మ॥ అరవిందాస్య! నృపాలచిత్తము త్వదాయత్తమ్ముగా నెంచెదే?
సరి పో! నేఁడు భవత్తనూజుని ప్రవాసంబంపి యాలోన నీ
వరయం జాలకయుండఁ గోసలధరారాజ్యాధిపత్యంబు ని
త్తెటో శ్రీరాముని కిచ్చు; నీ కొలఁదిగో తప్పింప నిమ్మోసమున్.

క॥ మెఱమెచ్చుల ధరణీశుఁడు
పరితుష్టిం జేయు నిన్ను; పాపము! నీ వా
సరపాలు నమ్మియుందువు;
తిరమగు వలపున్న నిట్లు తేఁకువ యగునే?

క॥ నామాటకేమి? దాసిని;
భామా! సుతుఁగోడ నీవు వరపుష్యమున శ్రీ
రాముని, సవతిని, గొలిచెద?
నా మది నిది కలఁచు బిట్టు నాటిన కఱ్ఱై.

తే॥గీ॥ కలదు దీనికి నొక ప్రతీకార మమ్మ!
శంబరాసుర సంగర సమయమందుఁ
బ్రాణవిభుచేఁ బ్రతిశ్రుతమయ్యె గాదె
వరయుగము; దాని దీర్పంగఁ దగిననేఁడె.

క॥ మందగజయాన! భరతుఁ
బొందింపుము రాజ్యమొకటఁ; బుచ్చుము శ్రీరా
ముఁ దీనతఁ ఘోరాటవు
లందుఁ గ్రుమ్మర చతుర్దశాబ్దము లొకటన్.

తే॥గీ॥ అనుచు విషమిశ్ర మధుర భక్ష్యంబుపోల్కి
హితకరోక్తుల మాడ్కి నహితము దెల్ప,
సుదతి మది కెంచె నది; ముమూర్షున కపథ్య
మించి పథ్యంబు వెగడునై యొసగినట్లు.

తే॥గీ॥ కలుష విషపూర్ణ మంథరా ఖలభుజంగి
కైక కర్ణైకమూలంబు గఱచి విడిన
హాలహాల ఘోర తద్విష జ్వాలలంటి
చిత్ర మిథ్యాభిమానము గాసిల్లు టరయ.

సీ॥ సకలేంద్రియాంతి సంధించు నెయ్యది
హితవాక్యముల విన నీయ దెద్ది
మనమున కెద్ది యున్మాదంబు నొసగూర్చు
స్వస్థ చిత్తత నెద్ది సమయఁ జేయు
పూజ్య పూజారతి పోరిపుచ్చు నెయ్యది
చూపు శక్తుల రూపుమాపు నెద్ది
మదమానదంభాదు లొదవించు నెయ్యది
యఖిల కిల్బిషమూల మరియ నెద్ది

తే॥గీ॥ ఔషధంబుల నెద్ది సాధ్యంబు గాదొ
మంత్ర మహిమల నెద్ది శమంబు గనదొ
యట్టి తను తాపకారి యీర్ష్యావిషంబు
గ్రమ్ముకొన కొంకక గడియలోఁ గైక మదిని.

మ॥ కలశాంభోనిధి సౌమ్యచిత్త యగు నా కైకేయికిన్ మంథరా
ఖల వాఙ్మంథన మూలకంబుగ మనఃకాలుష్య మేపార ను
జ్జ్వల హాలాహలమట్లు గ్రమ్ముకొన సాపత్న్యప్రభూతేర్ష్య ; యా
విలయై యుస్సను, నేడ్చు, హా యనుచు నుర్విం ద్రెళ్లు సాస్రాక్షియై.

కం॥ రామాభిషేకమునకై
భూమీశుం డానతిచ్చి ముదమునఁ గైకే
యీ మందిరమున కేఁగెను
సామంబునఁ దచ్ఛుభప్రసంగముఁ దెలుపన్.

సీ॥ నిస్తరంగ పయోధి నెఱిసాటి యన నొప్పు
నడఁబోటు సడలిన నగరితోడ,
విగతభర్తృక యైన వెలఁది వేసవిబోలు
సంస్కారశూన్య వేశ్మంబులతోడ,
కాలాంబుదచ్ఛన్న గగనభాగంబుల్లు
కళలేని మందిరాంగణములతోడ,
నిద్రితాంభోజ వనాసికంబుపోలిక
సద్దణంగిన చంద్రశాలలతోడ,

తే॥గీ॥ మలినమై శోకదేవతా మందిరంబు
కిరణి నెఱఁగొల్పు నట్టి యా నైకె
సడలు చిత్తంబుతోఁ జొచ్చె పురమునందు
కుపిత దర్వీకరాక్రాంత గుహనుబోలె.

తే॥గీ॥ కంటి సైఁగలతో మూడిగింపు సతులు
వెలుపు రయ్యాగృహంబు పృథ్వీవరుండు
వొచ్చి కాలభుజంగి నా సోలి వ్రాలి
యుస్సురని రోఁజు కైకేయి నొకటఁ గనియె.

కం॥ కని యట్లుంపుట కెంతయు
నెనలేని విచార మొంది యిట్లుంపంగన్
దనుగాత్రి! హేతు వెయ్యది ?
వినిపంపుము దీర్తు నొక్క వ్రేల్మిడి విదిగో !

సీ॥ దండశూకోదగ్ర దంష్ట్రి నాశగ్నించు
పోల్కి నిన్నలయించు మోఱ కెవఁడు,
ధనధాన్య వస్తువాహన సంపదలు నీకుఁ
బొచ్చెమా యిట్లు వాపోవ నేల ?

త్వత్కృపాయత్తమై తగుగాదె మజ్జీవ
ధనభాగ్య సౌఖ్యముల్ తరళనయన!
ప్రాజ్యసామ్రాజ్యంబుఁ బాలింపఁదలఁతేని
పట్టంబు గట్టనే వారిజాక్షి!

తే॥గీ॥ రాజబింబాస్య! నీకసంప్రాప్య మెద్ది?
ప్రాణములనైన సర్వసౌఖ్యములనైన
ప్రాణములకంటె నధికుఁడౌ రామునైన
నీవు గోరిన విడిచెద నీలవేణి!

తే॥గీ॥ అనఁగఁ దనమది కనుకూలమైన యట్టి
పల్కులకుఁ గొంత యలరి, యా వనజనయన
యెట్టకేలకుఁ దెలివొంది నృపతితోడఁ
బల్కె వెతదక్క మాటఁ గెంపాటు దోఁప.

చం॥ ఇనకులసంభవుల్ నృపతు లెన్నఁడు సత్యము తప్పఁ జూచిరే?
మును శిబి మేనొసంగఁడె కపోతము గావఁగ సత్యసంధుఁడై?
యనఘ! తదన్వయుండ వమరాధిపతుల్యుఁడ; వట్టి నీకుఁ బో
లునె తొలిబాసఁ దీర్పక విలుప్తముఁ జేయుట ధర్మపద్ధతిన్?

తే॥గీ॥ శంబరాసుర సంయుగ సమయమందు
రహిఁ బ్రతిశ్రుతమయ్యె వరద్వయమ్ము;
వాని నీవేళ నాకిచ్చి వసుమతీశ!
సత్యవాక్పాలనార్తి యశంబుఁ గొనుము.

కం॥ అను కైకపల్కులకుఁ ద
జ్జననాథుం డుల్లసిల్లి చానరో! నీకై
తనువైన నిత్తునంటిని
గొను సందియ మొందనేల? కుందఁగనేలా?

కం॥ రాముఁడు తనయులలో గజ
గామిని! నీ వంతిపురము కాంతలలోనన్
ప్రేమాధికు; లటు మాకై
కే మాయఁగరాదు? వేఁడు మెత్తైనఁ దీర్తున్.

చం॥ నరపతి యిట్లు పల్క మది నాఁటిన నెవ్వగ దక్క "రాఘవున్
దొఱఁగుము దండకాటవిఁ జతుర్దశ వత్సరముల్ వసింప; నా
భరతునిఁ గోసలావనికిఁ బట్టము గట్టు మటంచు కైకయున్
వరయుగ మల్ల కోరె జనవల్లభు నుల్లము తల్లడిల్లఁగాన్.

తే॥గీ॥ కైకపల్కు విషాక్త మార్గణముకరణి
తనమదిని నాట నృపతి చైతన్య మెడలి,
వజ్రపాతంబునం ద్రెళ్లు పాదపంబు
పోల్కి సంజ్ఞా విహీనుఁడై పుడమి వ్రాలి.

కం॥ తెలివొంది తలఁచె నిట్టులు
కలయో విభ్రాంతియొక్కొ కైకేయి యిటుల్
పలుకునె? రాఘవునెడ నె
గ్గులు తలఁచునె? భరతుకంటెఁ గూరుచు నెమ్మిన్.

చం॥ అనుచు వితాకుఁజెంది మదినల్లన ధైర్యము చిక్కఁబట్టి యా
జనపతి కైకతో ననియెఁ "జాణరో! పాడి దొఱంగి భూజనుల్
నను నిను దిట్ట దెప్పరమునన్ వరయుగ్మము కోరఁ జెల్లునే"
కొనుము జగమ్ము మెచ్చ ననుకూల నయోత్తర ధర్మగీతినాన్.

కం॥ పతి చిత్తము తన మదికిన్
ప్రతికూలంబైనఁ గైక పాయక విభునిన్
వెతఁబుచ్చి వరములందఁగ
నతి దుస్సహాభంగి పరుసు లాడఁ గడంగెన్.

సీ॥ వల దీయనని యొక్కపరి వచింపఁగ రాదె !
ప్రతికూల వచన వక్రత్వమేల ?
వాగ్దానములు శూన్యఫలములై మృషలైన
తద్దాన మేల మిథ్యాఫలంబు ?
సత్యసంగతి లేని జల్పితంబది యేల
నోటఁ గఱపిన తీపు నీటివ్రాలు ?
చిత్త కోర్కెలదీర్చు నిత్తఁ గుందించుట
పాడియా ? సత్యమా ? వసుమతీశ !

తే॥గీ॥ వలదు, నా కన్యమేదియు వలదు, వలదు
భరతు నభిషేకమును రామ వనగమంబు
దక్క ; పడయక యున్న నుద్బంధనమున
విష జలాగ్నుల నొక్కట విడుతు నుసురు.

ఉ॥ నావుడు విన్నఁబాటు వదనంబునఁ దోఁప నృపాలుఁ డిట్లనెన్
భూవలయాధిపత్యమును బుత్త్రునకిమ్మను మేటి పాడి, సు
శ్రీవిభవంబు రాఘవుని జెందదె ? జ్యేష్ఠుఁడు గానఁ జిత్తము ;
ఏవిధిఁ గోరఁ జెల్లునె ? గణింపవె రాచకొలమ్ము పాడియున్.

తే॥గీ॥ అనుచు నృపుఁ డుల్లలాడఁ గైక కనలు గదుర
వేఱుదెస మోము ద్రిప్పి భావించుకొనుచు,
శూన్య గగనంబునం దన చూపు నిల్పి,
ముక్త కంఠంబుతోడ వాపోవఁగడఁగె.

సీ॥ సత్యమా ! నీకిదే స్వస్తి తొలంగు మి
క్ష్వాకు వంశీయ సంశ్రయముఁ బాసి,
ధర్మమా ! తీర్థయాత్రకుఁ బొమ్ము రఘుకులా
వాసమ్ము నీ కసంభావ్య మింక,

పూర్వ సచ్చరితమా ! పొమ్ము దూరమ్ముగా
దశరథేశుని యందుఁ దగదు నిల్వ,
లోభమా ! సామ్రాజ్యలాభంబు నీకిదే ?
వసుధేశునెదలఁ బాదుకొనుము,

తే॥గీ॥ పాపమా ! నిలు నాలుగుపదము లూని
ధరణిధరమౌళి పంక్తిరథ ప్రభుండు
కింకరుం డయ్యె ; నీకింక శంకఁ దక్క
వసుధ నెలకొను మనపత్న వైభవమున.

తే॥గీ॥ అనెడి కైకేయి కెదురాడ నవవృగాక
భరత రాజ్యాభిషేకమ్ము సాయవనుచు
రామ వనవాసమైన మార్పంగఁగోరి
ఱేఁడు కైకేయి నిట్లు ప్రార్థింపఁగడఁగె.

సీ॥ పాడివీడి తనూజు వరబలంబున ధరా
పతిఁ జేయఁ గాంక్షింపవచ్చుఁగాక,
రాఘవారణ్య యాత్రా వరంబది యేల
కను బెట్టిదము లోక గర్హితంబు,
ఘోరాటవుల నెట్లు గ్రుమ్మరఁ బంపుదు
రమ్య సద్గుణసాంద్రు రామచంద్రు,
కౌసల్యకంటె నిక్క ఘనభక్తిఁ బచరించు
నీ సేవ లొనరించు నిన్నుఁగొలుచు,

తే॥గీ॥ కరుణ లే కట్టి గుణశాలి కఠినవిపిన
వాస మొనరింప నేరీతిఁ బంపవచ్చు ?
తద్వరంబైన విడిచి వాత్సల్య మొప్పఁ
గావు మిక్ష్వాకుకులవరుఁ గైక ! యనుచు.

కం॥ లోకోత్తర చరితుఁడు పతి
శోకవశుం డగుచు ధరణి సోలఁగఁబడె; జే
కొక నృపాలోక్తుల నా
రాకాసియు మార్చ దక్కరము వరములలోన్.

సీ॥ రామునికొఱకు భూరమణుండు వాపోవు
భరతునికై కైక పనవుచుండు,
కౌసల్యఁ దలఁచి భూకాంతుండు చింతించు
తన దుర్గతికిఁ గైక తలఁకుచుండు,
అడవికి రాఘవు నంపుటేలను వేఁడు
పనిచిన దోసఁగేమి యనును గైక,
కఠినాత్మురాలని కైకఁ దిట్టు నృపుండు
నృపతి శౌర్యము కైక నిందసేయు,

తే॥గీ॥ ఇట్లు కైకేయియును గోసలేశ్వరుండు
బహువిధంబుల వాదోపవాదములను
మగ్నులై యుండ నరుణాంశుమండలంబు
పొడమెఁ దూర్పున నృపతియు మూర్ఛనొందె.

కం॥ సూతుఁడు సుమంత్రుఁ డంత వి
భాతంబున నృపతి విజయవర్ధితుఁ జేయన్
బ్రాతిగ నేతెంచి కనెన్
క్ష్మాతలమునఁ నృపతి పడి విసంజ్ఞ శయింపన్.

కం॥ కారణ మారయఁ గైకయు
శ్రీరామునిఁ దలఁచి నృపతి చేడ్పడె రామున్
దేరఁ గొనిరమ్ము; కార్యము
తీరున్ వేబొమ్ము రాముఁ దెమ్మిట కనఁగాన్.

ఉ॥ స్నాన మొనర్చి రాఘవుఁడు జానకితో నుదయార్క భక్తిమై
పూని సుగంధపుష్పములఁ బూజ యొనర్చుచునుండ నంతలో
మానవనాథుఁ డిప్పు డాకమాఱు నినుం గనఁగోరె నంచుఁ బా
దానతుఁడై సుమంత్రుఁడు నృపాజ్ఞ వచించి యొనర్చి విన్నపమ్.

ఉ॥ రాముని దోడితెచ్చెను ; ధరాపతి యున్న తెఱంగు గాంచి సు
త్రామనిభుండు భూవిభుఁడు ధారుణి నీ క్రియఁ ద్రెళ్ళె నేమొకో !
నేమమె ? తల్లి ! యంచు రఘుశేఖరుఁ డాకులుఁ డౌచుఁ బల్క నా
భామిని "దవ్వ్నిమిత్తముసఁ బంక్తిరథుం డిటులయ్యె రాఘవా!"

కం॥ అని పల్కు కైక నుడువులు
తనచెవికిన్ వజ్రపాత దారుణములుగా
వినఁబోఁడి రఘుకులుం డిటు
లనియెన్ నయనాంబుజముల నశ్రువు లురులన్.

సీ॥ కామాంధ దృష్టినై కలనైనఁ బరకాంతఁ
గంటినో కడకంటఁ గడచి పాడి,
క్షత్రియ వంశోచిత శరణాగతత్రాణ
విధిఁ బాసితినో ప్రాణభీతి మసలి,
అలసుండనై జనకాంఘ్రియుగ్మంబులఁ
బరిచరింపనో పితృభక్తిఁ దప్పి,
పలుగాకినై కాఱు పదరి సత్యంబును
నిలుప నైతినో నీతి నెఱిఁ దొఱంగి,

తే॥గీ॥ సలిపియుంటినో గురుతిరస్కారమేని,
గడపియుందునో నిజ మాతృగణముసేవ
అనదలను జూడనో కరుణార్ద్ర దృష్టి
ఎగ్గు దలఁతునో యనుజుల కిసుఁ బూని.

తే॥గీ॥ ప్రాణములనైనఁ బ్రాణంబుప్రాణ మైన
జనకపుత్త్రిక నైన యశంబునైన
జనకు నానతిఁ దీర్ప నీ క్షణమునందె
విడుతు మమ్మాటికేని నమ్ము విడుతు ననుచు !

తే॥గీ॥ రాము డిటు పల్క కైకి వరద్వయంబు
దెల్పెఁ వన్వాంబు పెన్ని మేదిని బిలాంతి
రితమహాభీషణోరగద్వితయమట్లు
నృపతి తెలివొంది యార్తి కన్నీరు నింప.

ఉ॥ అల్లన లేఁతనవ్వు తొలుకాడ మొగంబున రాముఁ డిట్లనెన్
“తల్లి ! మహాప్రసాదము ; ముదం బొదఁగూర్చె వరద్వయమ్ము ; ని
యుల్లము పక్షపాతగతి నూనెను నాయెడఁ ; దమ్ముఁగూర్చి పైఁ
జల్లన రాజ్యభార మిడి, శాంతవనస్థితి నాకొసంగుటన్.

తే॥గీ॥ ధరణిపాలకుఁ డగునంట ! తమ్ముఁగూర్చి
సత్యసంగరుఁ డగునంట ! జనవిభుండు
తీరునఁట ! తల్లి కోరు మనోరథంబు
భాగ్యమింతేని నే తపఃపరుఁడ నగుట.

తే॥గీ॥ తండ్రియాన మదంబ ! ముదంబుతోడ,
నడవి కేఁగెద నేఁడె నీ యానసుమ్ము”
టంచు హర్షాశ్రువులు కన్నులందుఁ గ్రమ్మ
కైకిపాదమ్ము లంటె రాఘవుఁడు నెమ్మి,

తే॥గీ॥ క్షితివరుఁడు పిల్వ రాజ్యాభిషేకమునకు
గహనముల నిల్వఁ బొమ్మని కైక పనుప
రామముఖపద్మమునఁ గానరాక పోయె
స్వల్పతరమైన భావ విభ్రమముఁ దలఁప.

చం॥ నరపతి పల్కె రాముఁడు వనంబున కేఁగుట తప్పదేని నీ
పురజన మెల్ల బంధు జన పుత్త్ర కళత్ర ధనాళితోడ స
త్వరముగ రాము వెంట వనధాత్రికిఁ బోదగు ; సామ్రాజ్య మి
త్తరుణికిఁ గై వస మ్మగు వృథాశ్రమ మౌను వరప్రయాసముల్.

కం॥ అనవుడు మోసం బియ్యది
కనుఁడీ ! యీ పేని సత్యగౌరవ మిఁక లీ
జనములఁ గానకుఁ బుచ్చినఁ
బని యే మగు సామ్రాజ్యభరమున నాకున్.

కం॥ కాన్పైనఁ గొనక తాపసి
వేసంబున రాఘవుండు వెడలఁగవలయున్
మోసంబు దగునె ? ధర్మ
వ్యాసంగము వలదె సత్యపాలన ? కనినన్.

ఉ॥ రాముఁడు పల్కె నీక్రియ ధరాపతి నింద యొనర్పనేల ? నే
గ్రామములన్ బురంబులను గాల్మోపన నీ వనవాసకాలమం ;
దేమియుఁ గోంచుఁ బోవను ; మునీంద్రుల కై వడి సంచరింతు ; నం
బా ! మది నమ్ముమా ! యనుచు బాసయొనర్చె జనాళి మెచ్చఁగన్.

చం॥ జనకజఁ గానఁబోయి జనసన్నుతుఁ డాతఁడు కైక కోర్కెలన్
జనపతి దైన్యముం దెలిపి సాధ్వస మొందగఁజేసె మేఘ ని
స్వనము వినంగ నాసఁగొను వన్యమయూరి మహాధనుర్గుణ
ధ్వని వెఱపించు వ్యాధుని విధంబునఁ దా వని కేఁగఁ బూనుచున్.

కం॥ పతి వనగమనార్థవిని
శ్చితమతి యని తెలిసి సీత చేడ్పడి తానున్
పతి ననుగమింపఁదలఁచెను
గృతబుద్ధుల ననుగమించు కీర్తియుఁ బోలెన్.

కం॥ సుకుమారి జనక పుత్త్రిక
యకటా! వని నెట్లు నిల్చు నని చిత్తమునం
దొక యించుక శంకించుచు
ప్రకటంబుగ నంత రామభద్రుం డనియెన్.

సీ॥ ఫలపుష్ప శోభిత ప్రమదావనులు గావు
క్రూర సత్త్వాభీల ఘోరవనులు,
సంతతాలంకృత చంద్రశాలలు గావు
గహనభీషణ శైలకందరములు,
మృదుభాషణ మొనర్చు ప్రియవయస్యలు గారు
భీకరారవ దానవీగణంబు,
స్వాదుచతుర్విధ పక్వాన్నములు గావు
ఫలమూల కందాది భక్ష్యవితతి,

తే॥గీ॥ కష్ట బాహుళ్యంబు బహుళ దుఃఖప్రదంబు
వన నివాసంబు చేయంగ వశము నీకు,
నింట నుండుము పదునాలుగేండ్లు నొక్క-
దినము నింబోలెఁ జరియించి తిరిగివత్తు.

తే॥గీ॥ రాముఁ డిటు పల్క జానకీరమణి పల్కె
పతిని బెడఁబాయు నాతి యావనము వనము,
హారములు భారములు గృహోద్యానసీమ
హృదయ సంతాపకర ఘోర కదనసీమ.

సీ॥ ప్రాణనాయకు పాదపద్మముల్ సేవించు
సతికిఁ బాషాణముల్ చంద్రశిలలు,
హృదయేశ సత్కృపామృత వృష్టిఁ దోఁగిన
తరుణి కుద్యాన మ్ముదగ్ర వనము,

భర్తృవాల్లభ్య సంపద గొన్న రమణికి
వన్యభోజ్యము సుధాప్రాయ భుక్తి,
జీవితేశ్వరుతో వసించు పురంధ్రికి
వనరాజి వాసమ్ము స్వర్గవసతి,

తే॥గీ॥ నాథు నెడఁబాయకుండు టనంతసుఖము
పరుసవేదిని లోహంబుస్వర్ణమైన
పగిది ; పతియుండ నంతయు భద్రకమౌను
గాన నీ వెంట నే వత్తుఁ గాన కపుడు.

తే॥గీ॥ అనఁగ జానకి కోర్కె కాదనఁగలేక
సమ్మతించె రఘుపతి ; లక్ష్మణుఁడు దెలిసి
వింటి నెక్కిడి యతిరోషవివశుఁ డగుచుఁ
బల్కె రామునితో నిటు పరుషగతిని.

ఉ॥ కైక వరంబు గోరెనఁట ! కాదన కా నృపుఁ డిచ్చెనంట ! లో
కైక ధనుర్ధరుండ వీడు కానలసీమల కేగుదంట ! యే
లోకముధర్మ మిద్ది ? పెను లోభులతో మొగమోటమేల ? నే
నీ కడిదంపుఁజేతకు సహింపను దీర్చెదనొక్క వ్రేల్మిడిన్.

చం॥ భరతుని జంపెదన్ ; నృపుని బద్ధు నొనర్చెద ; కైకఁ జీల్చెదన్ ;
సరగున మానులట్లు నృప ! శాంతి వహించుట కార్యమౌనె ? మా
మరు లిటు ధీరచిత్తులను మందులుగాఁ దలపోయుచుండ్రు దె
ప్పరమున నీఱు పైకొనినపావకుఁ గాళులఁ గ్రుమ్మకుందురే ?

తే॥గీ॥ కంటికొనఁ దోచు కెంజాయ, వింటిమ్రోఁత
గఱుల మ్రోఁతలతోఁ బాఱు కఱకుటమ్ము
లంత మొందించుఁ గైకేయియవినయంబు
నన్న తగ దన కవింత మిన్న కున్న.

కం॥ అని తెంపొనర్చు లక్ష్మణు
మును వారణచేసి రామభూపతి పల్కెన్
ఘనతయె సోదరుఁ జంపుట
జనకుని బంధించి తల్లిఁ జక్కడఁచుటయున్.

సీ॥ తానైన నేమి సోదరుఁడైన నేమియౌ ?
నీసమంతైనను భేదమున్నె ?
భరతుండు రాజౌట వాంఛనీయము గాదె ?
దినమణివంశప్రతిష్ఠ గాదె ?
తల్లి కోరుట తప్పా ? తండ్రి యిచ్చుట తప్పా ?
మనము తీర్చుటతప్పా, యనుజ చెపుమ ?
వనరాజ మునులతో వసియించి తపము లా
చర్చుట పూర్వపుణ్యంబు గాదె ?

తే॥గీ॥ దీనికై యేల యీలీల తెంపుసేయ ?
శత్రు రాజన్యవేద్య భుజాబలంబు
స్వజన హననార్థ మౌట లజ్జాకరంబు ;
గురుజన ద్వేష మెక్కంత గూడ దన్న !

ఉ॥ నావుడు లక్ష్మణుండు వదనంబున విన్నదనంబు దోఁప, "నీ
తావర ! కోపవేగమున ధర్మము దప్ప దురుక్తు లాడితిన్
కావు" మటంచు మ్రొక్క బిగికౌఁగిట రాముడు గ్రుచ్చియెత్తె ; నె
త్తావున నల్కఁ గ్రమ్మినను దక్కదు రుత్తము లంతమాత్రలోన్.

చం॥ అనయము నేఁ దలంతు భవదంఘ్రియుగంబు భజించు చున్న మ
జ్జనికి ఫలం బటంచు ; నవిషహ్యము త్వత్పద దూరవృత్తి ; యొ
క్క నిముసమేనియుం దొలఁగఁ గాంచుట జీవ మసాధ్యమౌట, నే
ననుగమనం బొనర్చెద ; మదాగతి కాత్మ ననుగ్రహింపవే !

సీ॥ మునుముందు నడచుచు ములుముట్రఁ దొలఁగింతు
గమనానుకూల మార్గం బొనర్తు
చవులూరు ఫలమూలసమితి సంపాదింతు
సంవాహన మొనర్తు శ్రమముఁ బుత్తు
పర్ణశాల ఘటింతు వాససౌఖ్యము గూర్తు
తలిరుటాకుల సెజ్జఁ దగ రచింతు
ఆమోద బహుళ ఏకాంతసంప్రీతిఁ గూర్తు
గతనిద్ర సావిదల్లత భజింతు

తే॥గీ॥ కాంచి కనుఱెప్పకోలె నేకాంత భక్తి
పరిచరింతును త్వత్పాద వనరుహములఁ
గా దనక సన్ను నీతోడఁ గొని కరుగ
ననుమతింపు మటంచు లక్ష్మణుఁడు పలుక.

ఉ॥ కాదన కిట్లొసర్ప రఘుకాంతుఁడు తమ్ము ననుగ్రహించి ని
ర్వేదము నెల్లఁ గప్ప యతివిస్మయ మొప్పఁగఁ దల్లి చేరి పెం
పెద నరణ్యయానవిధి మెల్లను దెల్పి జలాభిలాషియౌ
పాదపమూర్ధమం దశనిపాతమునాఁగఁ గలంచె నాయమన్.

కం॥ కడలేని విచారము మదిఁ
గడలుకొనన్ బుత్త్రుఁ జూచి కన్నీ రొలుకన్
"కొడుకా! యిటు నా నుదుటన్
జెడు దైవము వ్రాసెనో కొ- సిలుగులు చెందన్.

సీ॥ కానక కన్న సంతానమ్ము పొలిపోయి
కానపాలైన నే గరత యోర్చు,
తొలిబాము నందలి దురితమ్ము ఫలమొకో!
కట్టెకుడిపె నిట్లు గడవఁ దరమె!

సవతిబిడ్డఁడు రాజ్యసంపద గొనఁగాక
వనవాస మేల నీ కనఘ ! చెప్పుమ ;
జ్యేష్ఠుండవై గుణశ్రేష్ఠుండ వౌటయుఁ
గొనఁగయ్యె నిటు ధర్మ దూష్యమయ్యె ?

తే॥గీ॥ పట్టి ! నాగర్భమునఁ బుట్టఁబట్టి నీకు
కటకటా ! యిట్టి యిక్కట్టు గలిగెఁగాదె ?
మాతృ పాపోపహతి భవన్మాన మిట్లె
రమ్య సద్గుణసాంద్ర శ్రీరామచంద్ర !

కం॥ పుత్త్రా ! నీతోడను సౌ
మిత్త్రియు జానకయు ననుగమింతురు గాదే !
మత్త్రాస ముడిపి కరుణా
పాత్త్రను నను గొంచుఁబొమ్ము భవ్యవిచారా !

మ॥ అని యాక్రోశ మొనర్పఁ దల్లి "యిటు లంబా ! ఏల వాపోవ, నే
వనులం గ్రుమ్మరి రానె యెల్లియటు, నీ పాదమ్ములం గొల్వనే,
జనకుం బూతచరిత్రు సత్యవచనుం సద్భక్తి సేవింపు ; ప్రా
క్తన కర్మానుభవంబు దప్పునె ? విధిం దప్పింప సాధ్యంబొకో ?

చం॥ పతి పరిచర్య చేయుటయె భాగ్యము నాఁతికి ; సర్వ సౌఖ్యదం
బతుల విభూతిహేతువు గుణాగుణచింత దొఱంగి యోర్మిమై
వితత సపర్యలం విభుని బ్రీతు నొనర్చుట సర్వ మంగళా
యతనము ; తల్లి ! నీ వెఱుఁగ నట్టి సతీహితచర్య యున్నదే ?

తే॥గీ॥ రాఘవుని తల్లి కోసలరాజపుత్త్రి
భవ్యచారిత్ర శుభ పతివ్రత యటంచు,
శాశ్వతఖ్యాతి నొందఁగా జనకుపాద
సేవ యొనరింపు మని రఘుశేఖరుండు.

తే॥గీ॥ తల్లి నోదార్చి, యిలు సేరి తన ధనంబు
అర్థుల కొసంగి సీతతో ననుజుతోడఁ
గూడి యరుదెంచె వర్షించి కుంభవృష్టి
స్తనిత సౌదామినీయుత ఘనము పోల్కి.

కం॥ మిత్రకులాగ్రణి లక్ష్మణ
ధాత్రీసుత లనుగమింపఁ దరలుటఁగని సౌ
మిత్రిం గౌఁగిటఁ గ్రుచ్చి సు
మిత్రయు బోధించె నెమ్మి మీఱఁగ హితవున్.

తే॥గీ॥ "సుఖముగాఁ బోయి రావన్న సుకృతశీల!
ఒక్కరూపున నడవి నయోధ్య గనుము;
రాము నన నెంచుమీ దశరథుని గాఁగ
మహిజ నమ్మయట్లు మది నెంచుమా యటంచు."

చం॥ జనని పదాంబుజద్వయికిఁ జాఁగిలి మ్రొక్కి యరణ్యయాత్రకై
వినతి ననుజ్ఞ వేడ, రఘువీరుని వల్కలకాంక్షఁ జెందియా
జనపతి కంట నశ్రువులు జారగ మ్రాన్పడియుండ, కైకయుం
దనిత యనుజ్ఞ నిచ్చె నవ వల్కలయుగ్మముఁ దాల్పఁజేయుమన్.

తే॥గీ॥ జిలుగు హారంబట్టుపుట్టంబు వెలికిఁ ద్రోసి
కైక యిచ్చిన ముదుగువల్కలము గట్టె
రాముఁ డలరారె పక్వ పర్ణముల నొప్పు
నిర్జరమహీజమున బు దర్శనీయుఁ డగుచు.

ఉ॥ కైక యొసంగ వల్కలము గట్టు టెఱుంగక బేల సీత దై
న్యాకులమూర్తియై విభుని యానన మల్లనఁ జూచుచుండ; ని
క్ష్వాకు పురోహితుండు మునివల్లభుఁడైన వసిష్ఠుఁ డంత ని
ర్వ్యాకలితంబుగన్ విభుని చక్కటిఁ గానకు నేఁగు గావునన్.

తే॥గీ॥ వల్కలంబుల ధరియింప వల దటంచుఁ
బాయఁ జేసెను ; నృపతియు హా యటంచు,
క్షౌమ పరిధాన రత్న భూషణము లెన్ని
యిచ్చె సీతకుఁ బదునాలుగేండ్ల లెక్క.

చం॥ జనకునకున్ నమస్కృతులు సల్పి సువర్ణ రథంబు నెక్కి ర
య్యనుమతి రామ లక్ష్మణ ధరాత్మజ లంత సరణ్యయాత్ర కై
జన నివహం బెఱింగి గుణసాగరు రాఘవుఁ బాయలేక నె
మ్మనములఁ బొంగునెవ్వగల గ్రమ్మంది తలంపఁ దొడంగె నీక్రియన్.

తే॥గీ॥ అనఘు రఘురామవాస పావనము వనము
పురము కాఁపురమును మించు పరమశోభ,
రాముఁ డెడ బీడు వీ డుండరానివీడు
భరము కాఁపుర మిచటి జీవనము వనము.

తే॥గీ॥ అనుచు నాగరు లాత్మ గేహములఁ బొఱఁగి
తరలఁ దొడఁగిరి రాము రథంబువెంట,
వత్సుఁ గ్రమ్మఱ నేఁ దెల్లి వచ్చినట్లు
తెగువ తగదని రాఘవుఁ డాగి వచింప.

తే॥గీ॥ కంట నశ్రువు లురల భూకాంతుఁ డనుపఁ
గైకఁ దిట్టుచు జను లనుగమన మూన
పట్టణమునిండ రోదన స్వనము నిండ
వనమునకుఁ బోవ రాముండు బయలువెడలె.

సీ॥ ఇందీవర శ్యామ సుందర దేహుండు
ధవళాబ్జ తుల్యనేత్రముల వాఁడు
కరికరోపమ దీర్ఘఘనబాహువుల వాఁడు
దరహాసరమ్య వక్త్రంబు వాఁడు

కలభసన్నిభ ధీరగమనంబు గలవాఁడు,
కరుణామయాంతరంగంబువాఁడు,
స్మిత పూర్వ సంభాషి సింహేంద్ర మధ్యుండు,
సత్య ధర్మ క్షమా సమయ వేది,

తే॥గీ॥ అఖిలవేదాళిఁగోడ బ్రహ్మాస్త్రమొఱఁగు
కృతము తలపోయు సైఁచు దుష్కృతము లెల్ల
సజ్జనోత్తముఁ డిటు ప్రవాసమున కేఁగు,
ననుచు పౌరులు తమలోనఁ బలవుచుండ.

ఉ॥ అంబుధరోపమాన సుభగాంగుఁడు రాముఁ డతండె; సీత త
ద్బింబఫలాధరోష్ఠి మెయిఁ దీవమెఱుంగులఁ బొల్చు తన్వి; ర
క్తాంబుజనేత్రుఁ డాతఁడె మహాత్ముఁడు లక్ష్మణుఁ డంచుఁ దత్పథా
గ్రంబునఁ బౌరకామినులు క్రందుగ నిల్చుచుఁ బల్కుచుండఁగన్.

కం॥ పితృభక్తియుఁ, బతిభక్తియు
వితతాగ్రజభక్తి, పురము విడిపోవుటకున్
తత పుణ్యమూర్తు లప్పురి
కతిభక్తి నమస్కరించి యరుగుచు దారిన్.

కం॥ క్రందుకొను పురజనంబుల
సందడి తెఱచైన నడక సాఁగక తమసన్
మందగతిఁ జేరి తత్తట
మందు వసించిరి ప్రదోష మౌటన్ నాఁటన్.

తే॥గీ॥ హంసతూలికా మృదుల పర్యంకమందు
జిలుగు పూసెజ్జ సుఖనిద్రఁ జెందు రాముఁ
డనుజుఁ డొనరించు చివురుపాన్పునఁ బరుండెఁ
గాలగతి యెట్టివారికిఁ గడవఁ దరమె?

సీ॥ కైకేయి పేరాస కడుబెట్టిదం బంచు
నరక నిందించెద రొక్కచోట,
వార్ధకమ్మున బుద్ధిపాటవ మ్మెడలెనో
యుర్వీశునకు నందు రొక్కచోట,
రాఘవుప్రోర్కి యారడికి మూలం బంచు
నొక్క పేర్కొందురిం కొక్కచోట,
న్యాయ తత్పరుల కిన్యాయశీలురనుండి
యిక్కట్టులా యందు రొక్కచోట,

తే॥గీ॥ కైవగతి మీఱ నేరికిఁ దర మె యనుచుఁ
బొక్కుచుందురు వనట నింకొక్కచోట
పౌరు లాయెడ రాఘవవననివాస
కష్టమున కోర్వలేక హృత్కంజములను.

ఉ॥ ఈగతి పౌరులెల్లరు మహీశుని కైకను నిందసేసి, ని
ద్రాగతచేష్టు లైన రఘురామునకై లేచి సుమంత్రు లేపి, పౌ
రాగతి కెంతయుఁ నగచి యాత్మకళత్ర గృహాది సౌఖ్యముల్
భోగము లెల్ల వీడి వనభూములఁ గ్రుమ్మర వచ్చి రయ్యయో!

తే॥గీ॥ తనుపరిత్యాగ మభిజనత్యాగమునకు
సాటిగా దట్టి పోట నీజానపదులు
మన్నిమిత్తంబు వెతలంది క్రుగ్గనేల?
మనము కన్నీరు సగరికి మరలిపోర?

చ॥ అరదము పూన్పు మల్ల జనకాత్మజతో ననుజన్ముతోడ నేఁ
బురి కపు డేఁగినట్లు వెనుబోఁకగఁ బోయి వనంబు చొత్తు; నా
గరులిట మేలుకాంచి మన కందు వెఱుంగక జాలి నిండ్లకుఁ
దరలుదు రాలసింపకుము తప్పును గార్య మటంచుఁ బల్కెన్.

క॥ అరదమ్ము నెక్కి లక్ష్మణ
ధరణీజాసహితుఁ డగుచుఁ దగ నప్పతి సా
త్పురపథముఁ బట్టి చనిచని
మరలెన్ వని కరుగుత్రోవ మాఱుపడంగన్.

క॥ అటఁ బౌరవరులు తమసా
తటమున మేల్కాంచి రాము దర్శింపక యా
రట మంది వెదకి వేసరి
పుటభేదన మల్లఁ జేరఁబోయిరి మరలన్.

సీ॥ ముగ్ధగోపాంగనాస్నిగ్ధ నేత్రోత్పల
మాలికాలంకృత మార్గ మరసి,
భద్రపూరుషు లట్లు ఫలభార నతములౌ
నతితరోన్నత వనస్పతుల గాంచి,
ధీరు లట్లవికంప్యసారంబులై యొప్పు
భూధరోన్నత సానుభూము లెన్ని,
సాధు చిత్తములట్లు చలువక్రేవల నించి
ప్రవహించు గిరినిర్ఝరముల గడచి.

తే॥గీ॥ కదలి బహుదూర మరిగి రాఘవుఁడు జహ్ను
కన్యకాతీరమున వేడ్కఁ గడలుకొనఁగ,
నిలిచె సాయాహ్నవేళ నిర్నిద్రుఁ డగుచు
లక్ష్మణుఁడు వేడ్క సేవిదల్లత భజింప.

గుహుఁడు శ్రీరాముని బూజించుట

క॥ గుహుఁడను నిషాదపతి ధీ
మహితుఁడు శ్రీరామసఖుఁడు మాన్యుం డాత్మన్
మహిజాధీశుని కరుణయె
స్వహితకరం బనుచుఁ దలఁచు భక్తివశుండై.

మ॥ ధరణీ రాజ్యముఁ బాసి రాఘవుఁడు సీతా లక్ష్మణోపేతుఁడై
యరుదెంచె న్వనసీమ కేఁగుచుఁ దివ్యస్రోతముల్ దాఁటఁగాఁ
దలఁకై వేఁచుచు నున్నవాఁ డనెడి వార్తల్ వీనులన్ సోక దు
ర్భర సంతాపము నొంది యర్ఘ్యయుతపాత్రం బూని సద్భక్తిమై.

తే॥గీ॥ రాము దర్శించి దండప్రణామ మెఱఁగి
యర్ఘ్య పాద్యాది పూజల నాచరించి,
భక్తివశుఁ డౌచు సంతోషభరము నింపి
వినయమున నిట్లు పల్కె సంప్రీతితోడ.

మ॥ కరుణాసాగర ! సత్యరక్షణపరా ! గాంభీర్య సారోజ్జ్వలా !
పరమ స్తుత్యచరిత్ర ! మిత్రకులభాస్వద్రత్న ! వీరోత్తమా !
చిరకీర్తిప్రియ ! సర్వసద్గుణ జయశ్రీనిత్యసంశోభితా !
ధరణీజానుగతుండ వై యిటు నితాంతప్రీతి విచ్చేసితే !

క॥ వనికిన్ బ్రవాస మంపెనె ?
వనరుహదళనేత్ర ! కైక వసుధాపతి కా
దన లేక మిన్న కుండెనె ?
వనవాస మ్మెట్లొనర్ప వలఁతివి ? దేవా !

తే॥గీ॥ జననిముచ్చటఁ దీర్ప రాజ్యం బొసంగి
వచ్చి తెంతయు నౌదార్యభరము మించ,
ప్రాజ్య మద్రాజ్యలక్ష్మీభరంబు పూని
బంటుగా నేలి నా సేవ పడయు మనఘ.

ఉ॥ నావుడు రామచంద్రుఁడు మనంబున మెచ్చి గుహున్ వచించె నీ
పావన చిత్తవృత్తికి నపార ముదం బెదఁ గొంటి ; నంబతో
నీవనవాస కాలమున నెన్నఁడుఁ బల్లెలఁ బట్టణంబులన్
నే వసియింప నంటి నవనీభర మేల ? వనీ నివాసికిన్.

మ॥ తరి నెట్టింపుము గంగ దాఁటుదఁ బ్రభాతంబందు సౌమిత్రితో
ధరణీపుత్త్రికతోడ నేఁపట భరద్వాజుం గనంబోదు ; నా
తెరఁగా లక్ష్మణమైత్రి నేఁకట నిషాదశ్రేష్ఠ యీజేయి యీ
సురకల్లోలినితీరమందు నిలుతున్ జూపట్టె సంధ్యాప్రభల్.

కం॥ అని పల్కి గాంగజలముల
జనవినుతుఁడు సంధ్యవార్చి సౌమిత్రి యొన
ర్చిన పల్లవ తల్పంబున
జనకజ చరణంబు లొత్త శయనించె వెసన్.

కం॥ నిద్రావశు రాఘవు ని
ర్నిద్రత లక్ష్మణుఁడు గుహుఁడు నెఱిఁ గాఁచిరి త
ద్భద్రగుణంబుల సంభ్రమ
ముద్రితులై చెప్పుకొనుచు ముదితాత్మకు లై.

శా॥ ప్రాతఃకాలమునందు రాఘవుఁడు నిద్రాముద్ర పోనాడి, తాఁ
జేతఃప్రీతి సుమంత్రుఁ జేరి రథముం జేకొంచుఁ బొమ్మంచుఁ దా
సీతాలక్ష్మణయుక్తుఁడై త్రిపథగన్ సేవించి తత్తీర సం
జాతారణ్యముఁ జొచ్చె నంచెఱిఁగుమా! సద్భక్త నామాలుగన్.

కం॥ మా మువ్వుర మెఱిఁగితి మని
వేమాఱు నమస్కరింపు విభునకుఁ గౌస
ల్యామాత కిలసుమిత్రకు
సేమం బడిగితి మటంచుఁ జెప్పుము సూతా!

కం॥ ఈ రీతిఁ బంచి ప్లక్ష
క్షీరంబున జడలు దాల్పఁ, జేవడి సూతుం
"హో రామ! కైక కోర్కెలు
పూరింపంబడెనె" యంచుఁ బురపుర పొక్కెన్.

ఉ॥ అంత నిషాదరాజు దివిజాపగ దాఁటఁగఁ దెప్పఁదెచ్చి భూ
కాంతుపదాబ్జము ల్గడిగి గాంగజలంబుల భక్తిమీఱ నో
క్కింత ధరాపరాగమును నెత్తిఁ బుచ్చుచు సోఁకె నొక యే
కాంతగ మాఱునోయనుచు గాఢభయాకులుఁడైన కైవడిన్.

తే॥గీ॥ జానకీ లక్ష్మణులతోడ జనవిభుండు
కలప మెక్కెను గుహుఁడు చుక్కానిఁ బూని
నడుపుచును నాత్మలీల గానంబు సేయఁ,
గ్రమ్మఱ కన్నిట సూతుండు రథముఁ ద్రిప్ప.

ఉ॥ అవ్వలి యొడ్డు సేరి ప్రణయంబున నావికు నిల్వఁ బంచి యా
మువ్వురు పాదచారు లయి మోదముతోడఁ గథా ప్రసంగముల్
ద్రవ్వుచు నల్లనల్లన బథశ్రమ మొందక హృష్టచిత్తులై
యవ్వనసీమఁ గ్రుమ్మరిరి యాశ్రమభూములశోభఁ గాంచుచున్.

### శ్రీరాముఁడు భరద్వాజుం గాంచుట

కం॥ రాజీవాక్షుఁడు రాముఁడు
భూజాతయు లక్ష్మణుండు మును జనుదేరన్
దాఁ జనె దర్శింప భర
ద్వాజున్ రవితేజు మౌనివర్గవిభ్రాజున్.

కం॥ రామాగమంబు మదిలోఁ
గామించుచు నున్న మౌనికాంతుం డతనిన్
బ్రేమంబునఁ బూజించియు
సేమం బారసి ముదంబుఁ జెందుచు ననియెన్.

ఉ॥ కైకవరంబుఁ గోరుటయుఁ, గాననసీమల సంచరింప సీ
తాకమలాక్షి లక్ష్మణుఁడు తత్పరులై వెనువెంట రాఁగ నీ
రాకఁ దలంచుచున్ మునిశరణ్యుఁడవై యవిజయ్యరాక్షసా
నీకముఁ ద్రుంతు వంచు నిటు నెమ్మిఁ బ్రతీక్షణ మే నొనర్చెదన్.

కం॥ ఫలమూల సమృద్ధంబై
కలకూజితవిహగ రమ్య కమలాకర మై
కలభఘటాకీర్ణంబై
యలరెడు నాచిత్రకూట మగు మీకిరవై.

తే॥గీ॥ అని భరద్వాజుఁ డానతీ ననుజ్ఞతోడ
భార్యతో రాఘవుఁడు కొన్ని పయనములను
జేసి యల్లన దర్శించెఁ జిత్రకూట
పర్వతమ్మును బహురమ్య పాదపమ్ము.

చ॥ అలసనమీరనర్తిత లతాంతమనోహరవృక్షవాటమున్
జలజమరందపాన వివశభ్రమరస్వనయుక్తటాకమున్
జలధరగర్జితశ్రవణజాత కుతూహలబర్హిఘాటమున్
కలభఘటాగ్రమాహోగ్ర కరకంపిత కూటము చిత్రకూటమున్.

తే॥గీ॥ పర్ణశాల యొనర్చి యప్పర్వతమున
జనకజా లక్ష్మణులతోడ మనుకులుండు
ధర్మమటు రూపుఁ దాల్చి శ్రద్ధావిధులను
గూడి మునివృత్తి నున్నట్టి జాడ నుండె.

## ⇐ సుమంత్రుఁ డయోధ్యఁ జేరుట ⇒

సీ॥ కమలాప్తుఁ డెడలిన గగనంబుపోలిక
దీప్తిఁ దొలంగిన తేరితోడ,
హేషారవము వీడి యీడ్పుగాళులతోడఁ
బురమార్గమునుబట్టు హరులతోడ,
రాముపాదము లంటి రాక వెన్దవిలిన
మనసుఁ దొఱంగిన తనువుతోడ,
నృపదండనార్థ మానీతదోషియొ నాఁగ
సాధ్వసనమ్రశీర్షంబుతోడ,

తే॥గీ॥ పురముఁ జేరె సుమంత్రుండు పురము జనులు
కాన కేఁగుట మాని రాఘవులు సీత
మఱలి వచ్చిరో యని యాశఁ దెఱలఁ జూచి
తద్ద యాశోపహతి విషాదంబు నొందఁ.

సీ॥ "శూన్య రథంబుతోఁ జొచ్చితి పుర మేల ?
ఆ మువ్వు రే"రని యడుగువారు,
"భద్రుఁడా ! శ్రీరామభద్రుండు కుశలియే ?
యెట నిల్చె ?" ననుచుఁ బ్రశ్నించువారు,
"వనముల నెటు చరింపఁగఁ జాలుచున్నదో
భూకాంత ?", యని జాలిఁ బొందువారు,
"అగ్రజు సేవింప నడవి కేఁగిన ధన్యుఁ
డెట్లుండె ?" నని ప్రశంసించువారు,

తే॥గీ॥ నైన జనులకుఁ దలవంపు నశ్రువారి
మౌనముద్రయుఁ దగు సమాధానములుగ
నలసగతితోడ నగరి కక్ష్యాంతరములు
దాఁటి యల్లన రాజసౌధంబుఁ జేరె.

ఉ॥ శూన్యరథంబుతోడ నొకసూతుఁడు వచ్చుట నేఁడు గాంచి సా
మాన్యజనంబులట్లు జనమాన్యులు కాల్నడ నేగిరొక్కొ ! త
ద్వన్య ఫలాశుల న్మెసవి వర్తిలనేర్తురె ? సౌకుమార్య సౌ
జన్య నిధాను లెంతటి విషాదముఁ జెందెద రొక్కొ దైవమా !

కం॥ ఏగతి వనమున నిలిచిరొ ?
యేగతి నను గ్రూరుఁ డనుచు నెగ్గాడిరొ ? సూ
తా ! గహనాంత స్థలి సీ
తాగజగామిని మెలంగు దైన్యమున నెటుల్ ?

కం॥ అను నృపతికి గంగా తట
మున రాముఁడు జడలు దాల్చి మునిరూపున భూ
తనయాసౌమిత్రులతో
ప్రణమిల్లి వచించినట్టి పల్కులు దెల్పన్.

శా॥ ఆకర్ణించి సదస్యు లెల్లరును హాహాకారపూర్వంబుగా
శోకింబూనిరి; కోసలాత్మజ మనఃక్షోభంబుతో భూపతిన్
గైకేయిం గను లెఱ్ఱవారఁ గనుచు లుల్కాగ్రహణాగ్రశుచ్యుల్లతిన్
సికన్ సొచ్చి మహీతలముం దొలఁగు దివ్వెల్లాఁగఁ గాఁ బట్టఁగన్.

చం॥ కలఁగుమనంబులన్ వగపు గాఁదగునట్లు నిల్వఁగరాక కన్నులన్
దొలఁగెడి యశ్రుబిందువులఁ దోఁగి వివర్ణము లైనమోములన్
పొలుపగు తెల్లఁ దేహలుల పొల్పు దొలంగి హిమార్త పద్మసం
కులముల పోలి చెప్పనటుఁ గూయిడఁ జొచ్చిరి సౌధబోంట్లు నాన్.

కం॥ కోసల ధరణీపతిసుత
యాసునఁ దపియించి కోసలేశున కనియెన్
చేసితిఁ జేసి వగవం
గా సరిదో కన్ను పొడిచి కరుణించినటుల్.

ఉ॥ శ్రీవశవర్తివై రఘుపతిన్ వనవాస మొనర్పఁ బంపి యిం
కే విధిఁ గుందెదేల? హృదయేశ్వరితో ననపత్నిసర్వ సౌ
ఖ్యావళిఁ దేలరాద? రుచిరాస్యుఁ దనూజుఁ దొలంగి నిల్వ నా
జీవ మదెంత బెట్టిదమొ? చేసితిఁ గిల్బిషమెంతయో మున్ననన్.

శా॥ భూకాంతాంతను గోసలాత్మజను "నే మున్నొక్కనాఁ డో వేఁటకై
యేకాంతంబునఁ బొంచి యేటికడఁ జాయన్ బాణహస్తుండనై
యాకర్ణించితి కుంభపూరణసమాయాతస్వనం, బంతలో
నాకర్ణాంత వికృష్ట మార్గణము వేయన్, బృంహితభ్రాంతినై.

కం॥ చచ్చితిఁ దండ్రీ యని వా
క్రుచ్చుట వినవచ్చె ; మదిని స్రుక్కుచుఁ జని నే
నచ్చోట నేలఁ గూలిన
సచ్చరితు మునీంద్రపుత్త్రు సాధువుఁ గంటిన్.

శా॥ హా ! దైవంబ ! మదేకపుత్త్రులు పిపాసార్తుల్ జరాబాధితుల్
పేదల్ చీఁకులు తల్లిదండ్రు లెటులో ; పేరమ్ముగ్రమై నిల్లు న
న్నే మర్త్యాధముఁడు కూలనేసెనొ ? విధీ ! యిట్లాన నీలీల ? యీ
మీఁదన్ వృద్ధుల కేది దిక్కు ? కృపణో మేలెల్లు చేకూర్తునో.

తే॥గీ॥ అనుచు విలపించు మునిపుత్త్రు నరసి యంటి
పాతకుఁడ నేసితిని గజభ్రాంతితోడ ;
దయను గాపాడు మనుచుఁ బాదములఁ బడితి ;
కరుణ నమ్మునిపుత్త్రుఁ డిక్కరణిఁ బల్కె.

తే॥గీ॥ తెలియక శరమ్ము నేసితి తలఁక నేల ?
వృద్ధులంధులు మత్పితల్ తృషితు లగుచు
వేచియుందురు నాకొఱకె ; వేగఁ బోయి
పలుకకియ యల్ల జల మిమ్ము ; భవ్యచరిత !

మ॥ జలముం గ్రోలి పిపాసఁ బాసినఁ గృపాస్వాంతంబునన్ నాకథన్
గలయం జెప్పి భవత్కుమారుఁడు నమస్కారం బొనర్చెన్ ధరా
తలము న్వీడి దివంబుఁ జేరు చని తత్పాదాబ్జముల్ సోఁకుమీ
యలుగుం బుచ్చుము బాధ కోర్వ ధరణీశా! యంచుఁ దాఁ గుయ్యిడన్.

కం॥ శరమును బెఱికితి ; మౌనియుఁ
బరమపద మ్మందె ; జలముఁ బట్టి తదుక్తిన్
దరిఁ జేరితిఁ దత్పితరులఁ
గరుణాపాత్రులఁ గుమారగతమానసులన్.

చ॥ పదములపద్మఁ బట్టి తమపట్టి మెలంగుట కాఁ దలంచి "యో
సదయ! కుమార! మారసదృశ స్తవనీయ శుభాంగ! తెచ్చితే
యుదకము; దప్పి కిద్వడి ముహూర్తము దేఁకగ నేచియుంటి; మే
యది?" యన నీర మిచ్చితిఁ; దృషార్తులు గ్రోలిరి దప్పి దీరఁగన్.

క॥ "తనయా! వినయ ఘనాంఢవు
ననయుండవు నెమ్మి భక్తి నల్పుదు మాకున్
నిను బిల్వ మాఱుపల్కవు
కన లూనితివో కొ- నేఁడు గణనీయగుణా!

చ॥ ఆముసు నెలుంగు రాల్పఁగ నల్లనఁ బల్కితి "గోసలేశ్వరుం
డను; మృగయారతిన్ శరశరాసనముల్ గొని కాఁచియుంటి ని
న్ననుమున, కేయి యున్నది భవత్ప్రియసూనుఁడు నీరు పట్టఁగన్
ననకరి బృంహితం బనుచు భ్రాంతిని మార్గణ మేసి కూల్చితిన్.

తే॥గీ॥ పుత్త్రఘాతుకుఁడను దయఁ బ్రోవుఁ డనుచుఁ
పాదముల వ్రాలితిని శోకవశుఁడ నగుచు;
పిడుగు తలఁ బడ్డయట్లు లావృద్ధు లొకట
నిలువు నొరగిరి సంజ్ఞావిహీను లగుచు.

తే॥గీ॥ కొంతవడికి తెల్వి మేల్కాంచి కొడుకుఁ దలఁచి
తద్గుణంబుల నెన్నుచుఁ దల్లడిలుచు
పుత్త్రశోకార్తిఁ గుంది వాపోయి రంత
కఠిన పాషాణములకైనఁ గరుణ పొడము.

సీ॥ తల్లిదండ్రుల భక్తి తత్పరతను గొల్చు
కరుణాళుఁడవు నీవు గావె? తనయ!
శమదమార్జవ సత్య శౌచ ధర్మంబులు
గలుగు సాధువ వీవుగావె? తనయ!

మాతృభావన నన్య మహిళామణులఁ గాంచు
కమఠధర్మరతి వీవు గావె ? తనయ !
సర్వభూతము లాత్మ సమములంచుఁ దలంచు
ఘనకృపామతి వీవు గావె ? తనయ !

తే॥గీ॥ పట్టి! మార్గణహతి నెంత బాధపడితొ ?
ఎట్లు విలపించితో నన్ను నెంచికొనుచు ?
సద్గుణోత్తర! యిట్లు చావనయ్యె ?
ధర్మసంభవర్థి కిదియకో దగుఫలమ్ము.

తే॥గీ॥ మాకు దిక్కెవ్వ రింక నోమానవేశ!
కొడుకుఁ గోల్పోఁ జచ్చెద లగ్గ కూర్పు చితిని
అనుచుఁ బతిఁ గొచ్చి నెఱముని నగ్నిఁ దెచ్చి
దలక్కొనం జేసెని మది కరఁగుచుండ.

మ॥ చితిపై కెక్కి "మహీశ! మా కడుపునం జిచ్చిగతిన్ బెట్టితే
సుతశోకంబున జావనయ్యె నకటా! కన్సేశ! ఘనార్తిని దు
ష్కృతి మాపాలిక నిప్పు చత్తు"వని యా వృద్ధుల్ శపింపంగ, స
న్మతి హాస్త్రాశ్రులు జాలువార నతిమోదంబొంద నేఁ బల్కితిన్.

చ॥ వరముగఁ దోఁచె నిద్ది; సుతభాగ్యము గల్గదటంచు నిస్పృహన్
గరము తపింతు నిత్యమును; గల్గుదు రాత్మజులంచు దోఁచె దు
స్తర సుతశోకభారమునఁ జావ శపించుట; శాప మీ క్రియన్
వరముగ మారెఁబో! గరళపాన మదౌషధమై నపోలికన్.

క॥ అని తత్పదముల నంటితి
వనితా! తచ్ఛాప ఫలము ప్రాప్తించె నిదే
తనయుల నల్వురలోనన్
గను మొక్కండైన నిచటఁ గలుగఁడు గానన్.

తే॥గీ॥ రామ భరతుల కిటు వన రాజ్యదాన
ఫలము లొసఁగిన కైకేయి వరయుగమున
కైకయును నెల్లశుద్ధాంతకాంత లైచ్చి
కానుషంగిక వైధవ్య మంది రనుచు.

ఉ॥ అంతిపురంబునం గలుగు నంగనలెల్లరు గూయిపెట్టఁగాఁ
జింతలఁ దోఁగి మంత్రులు వసిష్ఠుని బిల్చి తదుక్తి నుర్వరా
కాంతుని మేను తైలఘట గర్భమునం బదిలంబొనర్చి భూ
కాంతుని కౌర్ధ్వదైహికముఖంబు లొనర్ప సుతుం గను లేమిచేఁ.

చం॥ భరతునిఁ దేరఁ గేకయ నృపాలునిపాలికిఁ దూతఁ బుచ్చినన్
బురములు గ్రామముల్ నదులు భూధరపంక్తులు నుత్తరించి స
త్వరమునఁ గేకయాధిపుని పట్టణసీమను జేరి కేకయే
శ్వరుఁ గని మంత్రిసత్తములు పంచిన వైనముఁ జెప్పె నిమ్ములన్.

సీ॥ సౌమిత్రి ధరణిజా సహితుండై రాముండు
పురి వీడి యడవికిఁ బోయినట్లు,
రక్తస్రగంబర ప్రావృతాంగుండై పంక్తి
రథుఁడు మద్యమ్మును ద్రావినట్లు,
చేతుల దంష్ట్రాగ్రల కుటిల కాఁపు యొక్కరు
దశరథుఁ దలఁబట్టి తివిచినట్లు,
వేణుభరంబులు పిడ్వడ దశరథు
తరుణు లేడ్చుచు నేల దొరలినట్లు,

తే॥గీ॥ స్వప్నమునఁ గాంచి భరతుండు భయముగదిరి
లేచి శత్రుఘ్నుతో స్వప్నలీలఁ దెల్పి
యడలుచుండంగ వినిచి దూతాగమంబు
మాతులుండు పోవఁబంచె సాకేతపురికి.

తే॥గీ॥ మొదలఁజూచిన దుస్స్వప్న భూరుహమున
నలరుపువ్వుఁ బోల్కెఁ దోఁప దూతాగమంబు,
నడలు చిత్తముతో నల్ల నరద మెక్కి
భరతుఁ డనుజన్ముతోడను బయనమయ్యె.

ఉ॥ హారిమరుచ్చల ధ్వజపటాంగలచంచల మైన మేనితోఁ
గారెడివారువంబుల జవంబున మించుమనఃప్రవృత్తితోఁ
దేరఁ భ్రమించుకండ్లవలెఁ దేఁకువమ్మై సుడిగొన్న తాల్మితో
వీటిడిదైయు హుటాహుటిఁ విశీర్ణతఁ గలంగు నయోధ్యఁ జేరఁగన్.

సీ॥ తను జూచి వెనువెంటఁ దలవంచి విన్ననై
యోరచూపుల మిన్నకుండువారు,
నీఁడెపో మూల మీవెత కంచు నొరులకు
సాపవాదంబుగఁ జూపువారు,
రాజ్యలోభమున శ్రీరాముఁ గానకుఁ బుచ్చు
చెడిపె కొడుకని మోము ముడుచువారు,
సౌమ్యరూపచ్ఛాయ సౌశీల్య మెఱిఁగించు
కలుషహీనుఁ డటంచుఁ బలుకువారు,

తే॥గీ॥ నైన పౌరులవృత్తమ్ము లరయలేక
పురము కళఁ బాయుటకు హేతు వరయలేక
అనద నాదీనగతి నుండ నరయలేక
చింతఁ గలఁగుచుఁ దలఁకుచుఁ జేరె నగరు.

చం॥ కనుఁగవ నశ్రుపూరముగఁ గాంత యొకర్తుక మోము వంచె; హా
యనుచు మఱొక్కనాఁతి తను నారసి కూయిడఁ జొచ్చె; కైకయీ
తనయుఁడు దానిమూలమును దెల్ప సమర్థుఁడు గాక కుంది తా
జననిని జూడఁ డెల్ల మగు సర్వమటంచును కైక మేడకున్.

క॥ చనియెన్, కైకయుఁ దనయున్
గని యాదర ముట్టిపడఁగ గారాబముతోఁ
బెనవైచి మెడను భుజలత
లనియెను గుశలమ్ము తండ్రి! యట నన వగతోన్.

ఉ॥ "నాయన నిన్ను బాసి యొకనాఁడును నొంటిగ నుండఁ జూడ ; నీ
వీమెడ నొంటినుంటి విదియేల? మహీవరుఁ డెందుఁ బోయె ; భ
ద్రాయితమూర్తి రాఘవుఁడు దమ్ముఁడు దానును సీతతో సుఖ
శ్రీయుతుఁ డై చు నుండునె? వచింపు మదంబ! ముదంబెసంగ" నన్.

మ॥ దరహాసం బొనరించి కైకి యనెఁ "బుత్త్రా! నిను మేల్గోరి నే
వరయుగ్మంబును గోరికొంటి ; ధరణీభారంబు నీకిచ్చి రా
జ్యరమాశోభితుఁ జేసి సర్వ శుభ సౌఖ్యశ్రీలఁ గైసేయ, శ్రీ
కరు రాముఁ బదునాలుగేండ్లు వనులన్ గారించుచున్ నిల్పఁగాన్.

తే॥గీ॥ జానకీలక్ష్మణులతోడఁ జనెను రామ
చంద్రుఁ డడవికి ; నిటులు రాజ్యంబు నీకుఁ
గైవస మ్మయ్యె ; దశరథ క్ష్మావరుండు
పుత్త్రశోకార్తి నుసురుఁ గోల్పోయె" ననుచు.

క॥ జనయిత్రి తెల్ప భరతుఁడు
వినవోపక మూర్ఛ గ్రమ్మి పృథివిం బడియెన్
వనవాసం బన్నకు జీ
వననాశము తండ్రి కొసఁగ పాపం బగుటన్.

చ॥ ఆసయము దేఱి తల్లి గని "హా! కులనాశిని రాజ్యలుబ్ధవై
మునిజనవంద్యు రాఘవుని బుచ్చితె కానకుఁ, గోసలేశు జీ
వనము హరించితే యకట! పాపము! నీకొడుకంట! రామ సే
వనమును మించునే? ధరణిభారము దాల్చుట దుఃఖదూరమే?

తే॥గీ॥ పుష్పమాలికగా నెంచి భుజగకన్య
గళమునం దాల్చుమోఱకుకరణిఁ దండ్రి
యుసురుఁ దొలఁగెను నీకునై; యువతిరూప
మృత్యుదేవత వైతివా! నృపుని త్రుంచఁగ.

ఉ॥ రాముని సీతతోడ వనరాజి జరింపఁగఁ బుచ్చితేల? నీ
కేమి ఫలించె దాన? ధరణీశుని ప్రాణముఁ గొంటి విల్లు; శ్రీ
రామ పదాబ్జసేవనమె బ్రహ్మపదం బని యెంతు; జానకీ
రాములు లేని యీపురి యరణ్యము గాక పురంబె? చెప్పుమా!

తే॥గీ॥ అగ్రజన్ముని నెమ్మిమై ననుగమించు
లక్ష్మణుం డొక్కఁడే శుభలక్షణుండు;
ప్రాప్తమాత్మీయపాపంబుఁబట్టి నీకుఁ
బట్టినైతిని చెప్పుకోఁ బుట్టు సిగ్గు.

సీ॥ భువనవంద్యుండు రాఘవుఁడు కానలకేగెఁ
        గైక నీవరములకతనఁ గాదె?
దినకరకులసతి వనుల గ్రుమ్మరు సీత
        కైక నీవరములకతనఁ గాదె?
కౌసల్య సుతవియోగక్లేశహత యయ్యెఁ
        గైక నీవరముల కతనఁగాదె?
సత్యవాఙ్నిరతుండు జనకుఁ డసురువాసెఁ
        గైక నీవరములకతనఁ గాదె?

తే॥గీ॥ పరమపాపాత్ముఁ డని నన్ను బౌరులెల్ల
కడఁక దూఱుట కైక నీకతనఁ గాదె?
భానువంశప్రశస్తియు భంగపడుట
కైక నీకోరువరములకతనఁ గాదె?

తే॥గీ॥ పాలమున్నీటఁ బోలు నిక్ష్వాకుకులము
కైక నీచేత ఘోరసంకటము నొందె
పావకునిచేత సంశ్రితపాదపంబు
భస్మమొనరింపఁబడి రూపుఁ బాసినట్లు.

సీ॥ కాన కేగెడువేళ ఘనుఁడు రాఘవుఁడు, న
న్నేగతి మదిని నిందించెనొక్కొ!
అరుగుచో వని కసూర్యంపశ్య జానకి
యెంతగా నన్ను శపించెనొక్కొ!
రామప్రవాసమ్ము సౌమిత్రి గనలేక
యెట్లు నాయెడలఁ గోపించెనొక్కొ!
పుత్త్రవియోగార్తిఁ బొక్కి కోసలరాజ
పుత్త్రి యేగతి వాపోయెనొక్కొ!

తే॥గీ॥ ఎంత కుందిరో శుద్ధాంతకాంతలెల్ల?
ఏవిధి తపించెనో సుమిత్రావధూటి?
పౌరు లేరీతిఁ దమలోన వగచిరొక్కొ!
యెట్లు మదిలోనఁ దండ్రి దుఃఖించెనొక్కొ!

చం॥ దురితమొనర్చు నొక్కరుఁడు దూషణమొందు నొకండు దాన; న
క్కరణి దురాత్మురాల! యిటు గల్గెను ద్వత్కృతి నాకు నింద; యే
వెరవునఁ బాపికొందు? రఘువీరుఁడి కెట్లు ప్రసన్నుఁడౌను? దు
స్తర పరివాదవార్ధి నెటు దాఁటగ జాలుదునొక్కొ! దైవమా!"

కం॥ అని కైక దూఱి, కోసల
తనయున్ దర్శింప నేఁగి తత్పదములకున్
బ్రణమిల్లి దుఃఖితుఁ డయి
తనదోషము లేమిఁ దెల్పె దైన్యముఁ దోఁపన్.

కం॥ కులగురు వసిష్టుఁ గని భూ
తలపతికిఁ శాస్త్రదృష్ట ధర్మంబున న
వ్వలఁ బ్రేతకృత్య మొనరిచి
విలపించుచునుండె; దుఃఖవివశుం డగుచున్.

చం॥ కొలువఁగవచ్చిరంత గురుకోవిదమంత్రిసుహృద్ద్విజోత్తముల్
బలసినతత్సభన్ జతురవాక్యఘనుండు వసిష్టుఁ డిట్లనెన్
"లలితగుణా! గ్రహించి స్వకులక్రమసంగతరాజ్యభారమున్
జలధిచతుష్కవేష్టితవిశాలధరిత్రి భరింపు నెమ్మమై.

తే॥గీ॥ పాలకుఁడు లేమి రాజ్యంబు పాడువాఱు;
పాఁడిపంటలు తలఁగును బాడి దప్పు;
నతిథి పత్రృదేవపూజన మంతరించు;
నవదలకు రక్షయొదవ"దటంచుఁ బల్క.

తే॥గీ॥ గురునిపల్కుల నతఁడు చేకొక పల్కె
"జ్యేష్ఠుఁడే రాజగున్ గుణశ్రేష్ఠుఁ డగుటఁ;
గులమునం దన్నఁడెనియుఁ గల్గె నొకొ
పాడిదొలఁగి కనిష్ఠుండు వసుధ గొనుట.

కం॥ దురితంబు గాదె యగ్రజుఁ
దురుకాననభూమి నుండ నుర్వీపతి నై
సిరినొంది సుఖము లొందుట
పరివేత్తృతఁ బోలి నీతిబాహ్యము గాదే!

కం॥ ఇది లోకనీతిబాహ్యం
బిది మానవధర్మదూర మిది తలఁపఁగరా
దిది యుభయలోకనాశక
మిది యెటొర్వఁగ వచ్చునెట్లు కృతబుద్ధులకున్?

చం॥ వనమున కేఁగి రాఘవుని బ్రార్థనచేసి ధరిత్రిఁ బ్రోవఁగా
వినయముతోడఁ దెత్తుఁ బృథివీభర మాతఁడు దక్క నన్యుఁ డే
యనువునఁ బూననేర్చు? ధరకౌనె సుఖం; బిదె యెల్లి వేఁకువన్
జనియెద మాత్యమంత్రిగురుసైన్యజనావళిఁ గూడి కాననున్.

కం॥ దయఁ బూనుఁ డనిన గురు వి
స్మయమూనిరి ప్రకృతు; లతఁడు జనులంతోడన్
నయ మొప్పఁ జెప్పి వేఁకువఁ
బయన మ్మొనరించె నాప్త పౌరావళితోన్.

సీ॥ కడలు గ్రక్కదలఁగా నడగొండలను బోలు
కరులతో విజితదిక్కరులతోడ,
పవనజవస్పర్థి బాహ్లీకహరులతో
హరిదశ్వహయజవాహరులతోడ,
గంధర్వనగర సంకాశ సౌవర్ణ ర
థములతో గతదిక్పథములతోడ,
సమరానివర్తన శౌర్య సన్నుత వీర
భటులతో జితకాలభటులతోడ,

తే॥గీ॥ సమధిగత వేదవేదాంతసారులైన
బుధులతోడను విజితవిబుధులతోడఁ
గదలె భరతుఁడు శ్రీరాము పదము లరయఁ
దలఁపు లురియాడ మనమునఁ దాల్మి వీడ.

చం॥ అడవికి రాము నంపిన దురాత్ముఁడు వీనిని గన్న పాపమున్
గడవఁ దరంబు గాదనుచు గాఢభయంబున నాత్మశీర్షముల్
బుడమికి వంచినట్లు ఫలపూర్ణభరానతశాలిమంజరుల్
వెడ నునుసిగ్గునం గనుచు విహ్వాలుఁ బైఁ జనుచుండె దీనతన్.

సీ॥ ఆచంద్రతారార్కమైన భగీరథ
ధరణీశు కీర్తిపతాక యనఁగ,
కపిల కోపజ్వాలికాదగ్ధసాగర
త్రిదివాధిరోహణ నిశ్రేణి యనఁగ
కాలకంఠ పిశంగకాంతి రమ్యకపర్ద
దర్శనీయసితావతంస మనఁగ,
దుగ్ధపాథోరాశి ముగ్ధశుద్ధాంత ని
తంబినీమణిహార తరళ మనఁగ,

తే॥గీ॥ పాతకుల పాపపాశముల్ వాయఁజేయ
విశ్వనిర్మాత నిల్పు లవిత్ర మనఁగ,
త్రికరణోద్భూత దోషముల్ వికలపఱచు
గంగఁ బొడఁగాంచె భరతుండు కలుషభంగ.

సీ॥ శౌరిచక్రపుజోడ తీరె నిచ్చోటను
దినమణికులుఁ డిట దిగఁగఁబోలు,
పద్మరేఖలు గల్గు పదపద్మములజోడ
లివె విభుండిట సంచరింపఁబోలు,
ఆమ్లాన మృదుపల్లవాస్తరణం బిద్ది
యినవంశ్యుఁ డిటఁ బవ్వళింపఁబోలు,
ప్లక్షవృక్షక్షీరభాజనం బియ్యది
యిట ఱేఁడు జడలు ధరింపఁబోలు,

తే॥గీ॥ కష్టము లెఱుంగఁ దగనియాఘనుఁడు రాముఁ
డవనిసుతతోడ నిటు బన్నమందెనొక్కొ ?
కటకటా ! యెట్టిదుర్గతి గలిగెనొక్కొ ?
పండెఁ గాఁబోలు మత్పాపభార మిట్లు.

కం॥ అని వెత నొందుచుఁ గుందుచు
జననులతోఁ జెప్పికొనుచు జనముఖ్యులతో
వినుతించుచు శ్రీరాముని
జనసంస్తుతుఁ డచట నిల్చె జాహ్నవి దాఁటన్.

కం॥ గంగాతటమున నిల్వఁ దు
రంగద్విపరథభటాళి రాముని మైమై
భంగింప నేఁగునటు భర
తుం గని యనె గుహుఁడు క్రోధదుర్వారుండై.

తే॥గీ॥ తల్లి రాముని వని కంపఁ దనివిసనక
చంపు తెంపూని వచ్చితే జనవరేణ్యా!
తల్లి మించిన కొడు కంట తగును నిన్ను
ముందు కడుగిడఁబోకుము పొమ్ము మరలి.

కం॥ నామేన నుసురు నిల్వఁగ
నీమేరయె గంగ దాఁట? నిలు మిచ్చటనే,
రామార్థ మేల యరిగెదు?
భూమిం జేకొంటి! తృప్తిఁ బొందఁగరాదే?

ఉ॥ నావుడు మంత్రు లిట్లని రనారతరాఘవపాదపద్మసం
సేవయ గోరుధన్యుఁడు విశిష్టగుణోత్తరుఁ డాత్మమాత్ర దు
ర్భావనకోర్వ కగ్రజుని గ్రమ్మరఁ దెచ్చి మహీశుఁ జేయఁగాఁ
బోవుచునున్నవాఁడు కులపుత్త్రుఁడు పాప మెఱుంగఁ డన్న దోన్.

తే॥గీ॥ భక్తివశుఁడౌచు మ్రొక్కెను భరతు పాద
జలరుహంబుల కంత నిషాదరాజు;
పరమపావనరఘురామపాదభక్తి
పూజ్యతను గొల్వఁగాడె యపూర్వరీతి.

తే॥గీ॥ గంగ దాఁటించి తత్పురోగామి యగుచు,
గుహుఁడు కొనిపోయె సేనతోఁగూడ భరతు,
పరమపావన మౌ భరద్వాజమౌని
యాశ్రమోపాంతమునకు సాయాహ్నవేళ.

ఉ॥ వాజి గజాదికంబుల నుపాంతమునన్ నిలువంగఁజేసి, వి
భ్రాజితయోగ్యవేషమున బంధుసుహృద్గురుయుక్తుఁడై భర
ద్వాజుని జూడఁబోయె, మునివర్యుఁడు ప్రేమమనస్కుఁడై "నృపా
లా! జనకోటి గొల్వ నిటు లాశ్రమభూముల కేల వచ్చితే?

తే॥గీ॥ రాజ్యము లభింప సత్ప్రజారంజకముగఁ
బాలనమొనర్ప కీగతి వచ్చుటేల?
అడవి నియమములు గుడుచుచు బడుగుబాటి
రాముఁ డుండఁగఁ జూ పోవరాదో కాక."

కం॥ అన భరతుం డవిదితముగ
జననీకృతఘోరదురితసమభాగిని న
జ్జననాథుఁ డుసురు వాసెను
నని కేఁగెద నన్నుఁదెచ్చి పట్టము గట్టన్.

ఉ॥ నాయెడ దోషలేశము కనం దగ దన్న మునీంద్రుఁ డిట్లనున్
"నీ యనఘు ప్రవర్తనము నీ రఘురామ పదాబ్జ భక్తియున్
నీ యసమాననీతియును నిచ్చలు వీర! లెఱుంగఁ గోరియే
పాయక యిట్లు పల్కితి భవత్సుగుణంబుల నే నెఱుంగనే?

తే॥గీ॥ కామధేనువు పనిగొన్నకరణి నీకు
విందొనర్తును సేనతో నిందు నిలువు;
మిష్ట మృష్టాన్నకలన సంతృప్తిఁబొంది
యరిగెదవుగాక చిత్రకూటాద్రి కెల్లి."

తే॥గీ॥ అనెడు మునిపల్కులకు నెదురాడనోడి
భరతుఁ డట నిల్చె సేనతో భక్తి నెఱఁగి;
అగ్నిసన్నిధిఁ జేరి సంయమివరుండు
ప్రార్థనముసేయఁ దత్తపోబలముకలిమి.

సీ॥ ఫలపుష్పకోరక పల్లవంబులతోడ
ద్రుమము లన్నియు సురద్రుమములయ్యె,
కలనాదభరిత కలహంసకలముతోఁ
గుల్య లన్నియు దివ్యకుల్యలయ్యె,
దధిఘృతక్షీరఁ గమ్మతావు లీనుచుఁ బక్వ
షడ్రసోపేత భోజ్యములు దనరె,
గంధర్వకామినీ గానరవంబుతో
నప్సరోనాట్యంబు లత్తమిల్లె,

తే॥గీ॥ చలువకలువపడములు ఫలిదప్పరసాలు
విమల శయ్యాసనంబులు వెలసె నొకట,
భరతుఁ డాపయి సేనతో వైభవములఁ
గనిసి చేఁకొన మాని వీక్షించుచుఁ గదలె.

చ॥ లలిత రఘూద్వహాసితవలాహకసంశ్రితసానుదేశముఁ
జల దవసీసుతాతటిదజస్ర విశోభిత శృంగభాగముఁ
విలసిత లక్ష్మణాశని గభీరవినాదిత దిక్కటాహముఁ
జలధరరమ్యకూట ముపశాంతనిశాటము చిత్రకూటముఁ.

తే॥గీ॥ కాంచి శత్రుఘ్నుతో హర్షకలితుఁ డగుచుఁ
బల్కె నీవనభూములు పావనములు
మునిజనావాసములు ధర్మపోషణములు
నిద్దపుంజాయ నిచ్చు వనీరుహములు.

ఉ॥ అల్లగ నల్ల మెఘరాముసు సజానప్ప్లు నటుసర్గి, జానక
సల్లభు పోషఁ దెల్ప మనవంకకుఁ బర్విడుచట్లుఁ దోఁచు ; ను
త్పుల్ల సరోరుహాక్షుఁ డిట భ్రాతసయానుజయుక్తుఁ డౌచు రం
జిల్లుచు నుండఁబోలు నిట నేసల నిల్పుగు గ్రందువాయఁగన్.

తే॥గీ॥ భీతి నొందక పాఱక వెఱఁదకన్ను
గవల విప్పార్చి మృగములు కలయఁ గనుఁ,
గాలి తెలపుల గోవలు గానవచ్చు
నిరితిమి యాశ్రమోపాంతసీమ సనుజ !.

చ॥ అని యటఁ సైన్యమున్ నిలిపి యల్లపుఁ జారుఁ మహామునుఖ్యులన్
జనుల వెంటఁగొంచు జనసంస్తుతుఁ డాతఁడు నేగఁ గాంచె నా
ఘనముని వేషు రాఘవుని, భాగ్యవిధున్ ధరిత్రిసూనుజా
చ్చని ముదురాత్రమాలఁ దలియాయలకొరిక మున్న చాడ్పునన్.

కం॥ సౌమిత్రి తెలియఁ జెప్పను
రాముసకున్ భరతురాక ; రాముఁడు పంతిన్
సేమం బరయుచు భరతు న
ఘామయనయనాబ్జలోకితర్పితుఁ జేసెన్.

శా॥ అన్నా ! యంచును గైకయీసుతుఁడు పాదాగ్రంబునన్ వ్రాలె ; లే
వన్నా ! కీనతయేల ? తండ్రి సుఖియే యంచున్ గరాగ్రంబులన్
సన్నాహంబునఁ గ్రుచ్చియెత్తె రఘువంశస్వామి తత్సోదరున్ ;
గన్నీటన్ భరతుండు రామపదయుగ్మం బోలలార్చెన్ వెసన్.

కం॥ తమ్ముని దైన్యము చూడఁగఁ
గ్రిమ్మెన్ గన్నీరు రాముకనుఁగవ ; నిలలో
నిమ్మగ నాప్తులకడ దుః
ఖమ్మొప్పంగను భరింపఁగాని విధంబై .

చం॥ కరికరదీర్ఘ బాహువులఁ గౌఁగిఁట జేరిచి తమ్ముఁగుఱ్ఱఁ, ద
చ్ఛిరమును ముద్దుగొంచు రఘుశేఖరుఁ డీగె వియోగజాతదు
ర్భరహృదయార్తి ; పుణ్యపరిపాకము చేఁబడినట్లు బంధులన్
గురువుల మంత్రులం గనెను గోర్కెలు కెవ్వనఁ గ్రేళ్లువాఱఁగన్.

తే॥గీ॥ తేఱి సోదరు లుచితోపచార విధులఁ
బూజ యొనరించి రిమ్ములఁ బూజ్యపదుల ;
వర్ష ఝంఝానిలాది నివర్తనమున
వసుధ సక్రమవర్తనఁ బరగుగాదె !

కం॥ అల్లన భరతుఁడు కోసల
వల్లభు మృతిఁ దెల్పె ; రామభద్రుఁడు సీతా
పల్లవపాణియు లక్ష్మణుఁ
డుల్లంబుల నధిక శోక మొందిరి యొకటన్.

తే॥గీ॥ కలఁతఁ బోనాడి సెలయేట జలకమాడి
దశరథేశుని దన్పిరి తర్పణముల ;
ఇంగుదీఫల పిణ్యాక మేర్పరించి
పంక్తిరథునకుఁ దీర్చిరి పైతృకముల.

ఉ॥ మాతృజనమ్ముతో ననుజమండలితో గురుపౌరరాజితో
భూతనుజాతతో విబుధపుంగవుపోలికఁ గొల్వుతీరి, వి
ఖ్యాత యశస్కుఁడౌ రఘువరాన్వయుఁ డాశ్రమభూమి నిల్వ, సం
ప్రీతి వసిష్టుఁ డిట్లు రఘువీరునితో ననె ధర్మపద్ధతిన్.

కం॥ రామా ! యభినవ జలద
శ్యామా ! సుగుణాభిరామ ! జననుతనామా !
శ్రీమహితదివ్యధామా !
మా మనవిని జిత్తగించి మముఁ గృపఁగనుమా !

సీ॥ కౌసల్య దశరథక్ష్మానేత్రు భార్యలం
దగ్రపత్నీత్వంబు నందెఁగాన;
దత్తనూజుండవు ధర్మాత్మ! సామ్రాజ్య
పట్టంబు గైకొన వలెఁతి వీవు;
పట్టాభిషేకంబు భంగంబు గానగ్చెను
గైక నిన్నడవికిఁ గడఁక నంపి,
పుత్త్రార్తి మృతిఁబొందె భూకాంతుఁ; డుర్వర
పరిపాలకుఁడు లేక పాడువాఱె;

తే॥గీ॥ భ్రాతృదాయమ్ము గొను టది పాప మనుచు,
వసుధఁ బాలింప నొల్లక భరతుఁ డిట్లు
నిన్ను బ్రార్థించి రాజుగా నిలుపఁ గోరి
వచ్చె సైన్యంబుతోఁ బౌరవరులతోడ.

కం॥ కైకయుఁ బశ్చాత్తాపము
చేకొని నిను వేడవచ్చె; స్థిరసంప్రీతిన్
సాకేతపురికి రమ్మి
క్ష్వాకుకులాచార మిద్ది సదమలచరితా!

ఉ॥ నావుడు లేఁతనవ్వు వదనంబున వింతమెఱుంగు లీన సీ
తావిభుఁ డిట్లు పల్కు "భరతా! జనపాలుఁడు నీకు మేదినిన్
బావనకాననావనిని నాకు విభాగ మొనర్చి యిచ్చె; ధా
త్రీవిభవంబు చేకొని భరింపుము నే నిటు కాన నిల్చెదన్."

తే॥గీ॥ దాని కిట్లనె భరతుఁ డుదారగుణశాలి
"తల్లి కతమున నే నటు గ్రుళ్లియుంటి
నచ్చి పోనాడ నేల? నీ కచ్చమైన
భక్తి పచరింతుఁ గొమ్ము భూభాగ మార్య!

మ॥ కలుషం బించుక లేదు నాయెడల నైక్ష్వాకేశ ! నే రాజ్యముల్
గలనైనన్ మదిగోర, ఘోరవని భూకన్యాసమేతంబుగా
నిలువన్ నిన్నిటఁ బుచ్చి ; భక్తిఁ గొలుచుటన్ నీ పాదముల్ గొల్వఁగాఁ
గలనే ? ధర్మవిరుద్ధవర్తనము లీకాలత్రయంబునన్.

తే॥గీ॥ తల్లి పేరాసదోసఁ గింత దాపురించె :
క్షమ యొనర్పుము ; కృపఁ బూని కదలి రమ్ము
ప్రకృతివర్గ మ్మొనర్పు నీప్రార్థనమ్ము
గొమ్ము ; కోసలధరణి చేకొమ్ము నాదు !”

తే॥గీ॥ అనవు డిట్లను రఘురాముఁ డనుజుతోడ
తీరమును దప్పనియెడ లేదు భరత !
కైక నిచ్చెడునాఁడు గోరెఁ గేకయేశుఁ
డాత్మ దౌహిత్రునకు రాజ్య మవనిపతిని.

తే॥గీ॥ దాని కౌనని మనతండ్రి దశరథుండు
దానినే కోరెఁ గైక సత్యంబు నమ్ము !
జనకు సత్యోక్తి నిల్పుట చనదె మనకు
సత్యమును మించుధర్మంబు జగతిఁ గలదె ?

ఉ॥ బాసయొనర్చితిన్ “తపసినై ఖరిణోడఁ జతుర్దశాబ్దముల్
వాసమొనర్తుఁ గాన ; జనవాసము లెయ్యెడ మెట్ట”నంచు ; వి
శ్వాస గురుత్వముల్ ప్రకృతివర్గము నిల్పునెఁ బాసఁ దప్ప ; నీ
వే సకలోర్విఁ గావుము మహీపతి శాసన మెన్ని తమ్ముఁడా !

కం॥ పదునాలుగేండ్లు వనముల
సదమలమతి సంచరించి చనుదెంచి ధరన్
ముదమునఁ బూనెద నిశ్చయ
మిది ; యాప్తులతోడఁ బురికి నేఁగుము వత్సా !

ఉ॥ నావుడు కైకయీసుతుఁ డనంతశుభంకరుఁడై వదించె సీ
తావర! రాజ్యభారమును దాల్ప సమర్థుఁడఁ గాను; నెమ్మిమైఁ
దావక పాదయుగ్మకము ముదంబునఁ గొల్చుచు నుందు నిందు నా
సేవలఁ గొమ్ము లక్ష్మణుని సేవలఁబోల్కి నటన్న నవ్వుచున్.

తే॥గీ॥ తండ్రియాన యలంఘ్యమ్ము; దానిమీఁద
మామకాజ్ఞయుఁ గల దిఁక మాన నగునె?
సత్యధర్మానుశాసన మయపాశ
బద్ధులము గాదె? వత్స! మా గ్వేలుగ కెట్లు?

తే॥గీ॥ అనఁగ శ్రీరామునకు నెమ రాడనోడి
బాలిశుఁడ రాజ్య మానంగఁ జాలఁ గాన
సర్వలోకైకరక్షణక్షమ భవత్ప
దద్వయీస్పృత పాదుకాద్వయము నిమ్ము.

ఉ॥ పాదుకలన్ ధరావలయభారవహమ్ములుగా నొనర్చి నే
సాదరబుద్ధితోఁ బరిచర్య లొనర్చుచుఁ గింకరుండనై
మోదముతోఁ భవదాగమనమున్ మదిఁ గోరుచు న్యాసభూత మా
భూదయితన్ భరింతు వని భూసుత లక్ష్మణుఁ జూచునట్లుగన్.

తే॥గీ॥ అవధి యెడసిన నుసులపై నాసవీడి
వీతిహోత్రముఖంబున వేల్తు నాదు
దేహ మనిపల్క నెల్ల రుదీర్ణ సౌమ్య
వాక్కులను మెచ్చి రా ధర్మపరునిభక్తి.

సీ॥ కలశాబ్ధికన్యకాకరపద్మసంగుప్త
పద్మరాగాఖ్యసేవధు లనంగ,
మాని హృద్గోపురమధ్యవిద్యోతిత
పావనరత్నదీపంబు లనఁగ

అభ్రగంగాప్రవాహప్రభవాయత
రత్నభూధర శిఖరమ్ము లనఁగ,
భక్తిమానసతమఃపటల నివారణ
తరుణార్క మండల ద్వంద్వ మనఁగ,

తే॥గీ॥ పరఁగు నిజపాదపద్మముల్ పట్టితొడుగఁ
బరమపావనమూర్తు లై వరలు నాత్మ
పాదుకాద్వయ మిచ్చె నిక్ష్వాకుకులుఁడు
భరతుఁ డాదలఁ దాల్ప నపారభక్తి.

ఉ॥ ఎన్నిధి చేతఁబడ్డ నిఱుపేద విధంబున మోదమంది యో
యన్న! మహాప్రసాదము త్వదంఘ్రిధృతామలరత్నపాదుకల్
గ్రన్ననఁ దాల్పఁ గాల్పడితి; గల్గె ననుత్తమపుణ్యలాభ మా
పన్నశరణ్య! యింద్రపదవై భవ మైనను గీనిసాటియే?

కం॥ అని భక్తిపరవశుండై
కనులన్ హర్షాశ్రులహరి గాల్వలుగట్టన్
జనవినుతుఁ డాడఁ దోడఁగెఁ
దనతలఁ దత్పాదుకలను ధరియించి వెసన్.

ఉ॥ "తమ్ముఁడ సంతసం బలరెఁ దాల్చుము మేదిని నాకు మాఱు ని
త్యమ్ముగ నీదురాజ్యమున నవ్యయసంపద నిల్చుఁగాక పో
పొమ్మిఁక శాంతచిత్తమునఁ బూన్చుము రాజ్యము పాదుకాద్వయిన్
గ్రమ్మఱ వత్తు నేనచిరకాలములో జనకాజ్ఞ తీఱఁగన్."

క॥ అని రాముఁ డనుప జననీ
మునిగణములతోడఁ బౌరముఖ్యులతోడన్
చని సైన్యభరముతోడన్
గనుఁగవ నానందజాశ్రుకణములు దొరలన్.

కం॥ చనిచని నందిగ్రామం
బున నిల్చి వసిష్ఠమహామునిముఖ్యులతోడన్
జననుతుఁడు పల్కె వినులన్
మునివృత్తిని నిల్చు రామభూవిభుఁ డెటులా !

ఉ॥ పాపము గాదె యగ్రజుఁడు వన్యఫలంబుల మేనునిల్పుచున్
దాపసవృత్తి నుండ నృపవైభవ మొందుట నాకు ; నే నయో
ధ్యాపురి నిల్వనోపను ; జటాజినముల్ ధరియించి పాదుకా
రోపితరాజ్యభారము భవత్ప్రముఖుల్ గొనియాడఁ దాల్చుచున్.

కం॥ నందిగ్రామంబున నే
నుందున్ ; బురికేఁగుఁ డనుచు నుర్విజనులన్
గొండల మంచుచు వీడ్కొని
యందే వసియించె నగ్రజానుకృతిచన్.

ఉ॥ కాంచనసింహపీఠ రఘుకాంతునిపాదుక లుంచి వాహిని
సంచితవారిరాజ సదృశం బభిషేకమొనర్చి యల్లని
ష్కించల భక్తిఁ గోశబలసంపదలం దలియంగఁ జెప్పుచున్
గ్రాంచితధర్మతత్పరత రాజ్య మొనర్చుచు బంటుపోలికన్.

తే॥గీ॥ కందమూలంబులఁ దినుచు నల్ప లపుగట్టి
చేలలు దాలిచి స్థండిలశాయి యగుచు
నాత్మపాపోపశాంతి కమందఘోర
తపము సల్పెడునట్టు లా ధన్యుఁ డలరు.

కం॥ అనుచు నయోధ్యాకాండము
వినిపింపఁగఁ గవలు రామవిభుఁ డామీఁదన్
ముని యెట్లుపల్కె రామా
యణవృత్తం బెఱుఁగఁ జెప్పుఁడా ! యని యడుగన్.

ఉ॥ సారగభీరవాగ్విభవ! సర్వజగన్నుతఘూర్ణ సత్కృపాగుణా
హారివిశేషసద్గుణసమార్జితపావనకీర్తిభాస్వరా!
చారుకృపాంతరంగ! బుధసంశ్రయశోభితనిత్యవైభవా!
ధీరజనాభినందితసుధీవిభవా! భవపాదభావనా!

కం॥ అనఘాత్మ! సత్యనిరతా!
యనవద్యపవిత్రచరిత! యకలుషవేషా!
వినయవివేకనిధానా!
జనసన్నుతపుణ్యకీర్తి! సదమలమూర్తీ!

స్రగ్విణి॥ మానసీయార్థిసన్మాన నిత్యోత్సవా!
దానధర్మక్రియాసక్తసద్వైభవా!
శ్రీ నృసింహాంఘ్రి సంసేవనాత్తోదయా!
మానవిత్తోజ్జ్వలా! మాతృదేశప్రియా!

గద్య॥ ఇది శ్రీమత్కాశ్యపగోత్రపవిత్ర సుబ్రహ్మణ్యశాస్త్రి
బుధజనవిధేయ వేంకటసుబ్రహ్మణ్యనామధేయ
ప్రణీతంబైన శ్రీరఘురామచరిత్రంబునందు
అయోధ్యాకాండము.



శ్రీః

శ్రీ శారదాంబాయై నమః.

# శ్రీ రఘురామ చరిత్రము

## అరణ్యకాండము

కం॥ శ్రీ చంద్రమాంబికాసుత
యాచకజన కల్పశాఖి ; యమలాత్మక ! నీ
రోచితభవ్యచరిత్రా !
నాచంయమితుల్య ! స్వామిబాబు ! నయజ్ఞా !

తే॥గీ॥ ఆపదఘరింపుము కుశలవు లనలికి తను
బలుకఁ గోపఁగిరి యిటు రామభద్రుం డొగి
మంత్రి సామంత మునిజన మాన్యులెల్ల
హర్షపరవశులై తన్మయత్వ మంది.

ఉ॥ సానుజుఁడై రఘూద్వహుఁడు జానకితోఁ జిత్రకూటాచలమ్ముఁ దా
కాననభూమిఁ గ్రుమ్మరుచుఁ గానుకిడ్డు ఫలమూలమ్ము లిడ్డు
మానవవంశవల్లభులు మాన్యులు వార్ధకమందు దాంతులై
పూనెడుతాపసవ్రతముపోల్కి వహించెను యావనంబునన్.

మ॥ ఒకనాఁ డామనువంశవర్ధనుఁడు సీతోరుస్థలీన్యస్త మ
స్తకుఁడై యాశ్రమభూమి భూరుహతలచ్ఛాయన్ నిదాఘార్తి మో
చకరిత్నం బన నిద్రనొందఁగఁ దురాషాడ్జాతికాకమ్ము జా
నకి బాహ్వంతరసీమ తుండమున సందారించె ముగ్ధాత్మమై.

ఉ॥ మేల్కొని రాముఁ డాగ్రహము మీఱి నిషీకమునేయ, నెయ్యెడన్
గాల్కొనసిక వెద్దవిలి కాకము నాకులపాటు వెట్టఁగా
నాల్కొనుభీతి వాయసము నొచ్చుచు రాముని కేకనేత్రమున్
శుల్కముగా నొసంగి నృపుశూరత మెచ్చుచుఁ బోయె నిచ్చమై.

సీ॥ పృతనాగజేంద్రసంపాదితంబులు వన
స్పతులు జన్యంబున సైన్యమట్లు,
సైన్యాశ్వఖురపుటీసంచూర్ణితము వసీ
తలము దుష్టాత్ముచే ధర్మమట్లు,
రథచక్రచంక్రమక్రమనాశితము వనా
హారమ్ము వ్యసనిచే యశసునట్లు,
కారీషదుర్గంధకలుషిత మ్మగుగాలి
లోలాత్ముచే భద్రశీలమట్లు.

తే॥గీ॥ పౌరముఖ్యులు తమనిల్చుపట్టు లెఱింగి
రాకపోకల నిచ్చలు రాయిడింతు
రనుచుఁ దచ్చిత్రకూటంబు నవల నిడిచె
రాముఁ డనుజునితో ధరాప్రభవతోడ.

తే॥గీ॥ వార్షికమ్మైన కార్తెంబరగు నినఁడు
సాఁటియగు నప దక్షిణాయనము జరించె;
నాశ్రమమునుండి వేఱొక్క యాశ్రమంబుఁ
జొచ్చి తద్వన్యభూముల శోభఁ గనుచు.

కం॥ కాకుత్స్థువెంటఁ జనుసీ
తాకమలాక్షియుఁ దనర్చెఁ దగనూహింపన్
గైకేయి నిషేధాజ్ఞలఁ
జేకొకయు రాజ్యలక్ష్మి సేవించు నటుల్.

సీ॥ మెయిఁదీవజిగి గ్రమ్మ మేదినీభాగమ్ము
స్వర్ణభూధరసాను సామ్య మొంద,
అడుగుఁదమ్ములకాంతి సడరినధర మెల్లఁ
గురువిందమణిభూమిగరిమ దాల్ప,

క్రీఁగంటికళుక్కులు క్రేవఁ గ్రమ్మినఁ దోఁప
హరినీలమణివేదికరణి మెఱయ,
చిఱునవ్వువెన్నెలతరఁగ లూనినతావు
ముత్యాలశాలులనురువు సూపఁ,

తే॥గీ॥ గరతలమ్ముల నునుఁగాంతి పరఁగుధరణి
విద్రుమలతానికుంజంబువిధము దోఁపఁ,
గాననమునకుఁ గ్రొంగ్రొత్త కలిమి గూర్చి
సంచరించును సిరిఁబోలె జనకజాత.

సీ॥ కసఁకమై నడరెడుకార్చిచ్చు తనయంత
జేడి వెట్టకయమున్న శాంతినొందెఁ,
జెడి మోడులై యున్నతరుగుల్మాఁకులుగూడఁ
గను పండువొనరింప ననలఁ దాల్చె,
నిలువెల్లఁ బుష్పించి యళికులమ్ములు గ్రమ్మఁ
దరులతాళి సుగంధభరము నించె,
ఫలసంపదల వనస్పతులు పూర్ణంబులై
ద్విజకులాశ్రయములై పెంపుగొల్పె,

తే॥గీ॥ అధిక సత్త్వంబు లలఁతుల నలఁచవయ్యె
వినయసౌహార్ద్రశాంతముల్ విస్తరిల్లె
జానకీలక్ష్మణులతోడ జనవిభుండు
కడఁగి చొచ్చినమాత్ర నక్కాననమున.

ఉ॥ అత్రి మహామునీశ్వరుని యాశ్రమభూమిని జేరె తేఁడు సౌ
మిత్రి ధరాసుతల్ ముదముమీఱఁగఁ దోఁ జనుదేఱ, సోఁగలా
నేత్రము లార్చి నిల్చి హరిణీకుల మాయతచాపులై ననే
మాత్రముభీతి లేకరయ మంజులసౌమ్యశుభాత్మరూపముల్.

ఉ॥ ఆదరపూర్వకమ్ముగ మహాముని స్వాగతమిచ్చి యర్ఘ్యపా
ద్యాదులఁ బూజసల్పి జనకాత్మజ కాత్మమృగాక్షిఁ జూపి "స
మ్మోదముతోడ నాస్థవిర పుణ్యపతివ్రతఁ జూడఁ బొమ్ము ని
త్యోదయ మంగళం బగు ననుత్తమభాగ్యము గల్గు" నావుడున్.

సీ॥ భాగీరథీవారిఁ బాపదూర నొసర్చి
పరిపూతఁ జేసిన భవ్యచరిత,
ద్వాదశవార్షి కావగ్రహంబు శమింప
గంగఁ గల్పించినగరితమిన్న,
ముజ్జగంబులకెల్ల మొదటివేల్పులఁ బసి
పాపలఁ జేయు ప్రపంచమాత,
సాధ్వీమతల్లి కాశాపోపహత మైన
భువనంబుఁ గాచినపుణ్యశీల,

తే॥గీ॥ శారదాభార్గవీశైలజాత లెల్ల
వేడఁ బతిభిక్ష వెట్టినవినుతసుగుణ
సర్వలోకాభినందితాపూర్వమహిమ
గేయ ననసూయ సీత వీక్షించె భక్తి.

కం॥ అనసూయాసతి ధరణీ
తనయన్ మన్నించి నెమ్మి తల్కొత్తంగాఁ
గనుపాలుసంగరాగము
వినుతదుకూలద్వయమ్ముఁ బ్రీతి నొసంగెన్.

తే॥గీ॥ సహజసుందరగాత్రి యాజనకపుత్రి
చెన్నుగాంచెఁ బతివ్రతాశ్రీఁ దనర్చి,
అత్రిమునిపత్ని యిచ్చినయంగరాగ
మహిమఁ దద్గాత్రశోభ వేమడుగు లెచ్చె.

తే॥గీ॥ అత్రిముని కడ సెలవంది యానృపుండు
జలదమాలికఁ జొచ్చెడి చంద్రుఁడనఁగ
దండకారణ్యభూములఁ గరియఁ జొచ్చె
మేదినిపుత్త్రికతోడ సౌమిత్త్రితోడ.

మత్తకోకిలము॥ కంటిరెప్పలు గాచుకైవడి క్షత్త్రియోత్తము లర్థి వా
ల్గంటి నేమరుపాటునొందకఁ గాచు చన్వనిఁ గ్రుమ్మరన్
మింటఁ గప్పెడి కాఱుమబ్బున మేనికాంతిఁ దలిర్చుచున్
గంటకాయితుఁడైన దైత్యుఁడు గానవచ్చె నభంబునన్.

ఉ॥ వాసవవజ్రపాతముల భంగ మెఱుంగని శైలమట్లు సం
ధ్యాసమయాభ్రమట్లు కపిశాకృతిఁ బొల్చి విరాధదానవుం
డా సురమాయఁ జూపి, సుగుణాఢ్యుల మోసమొనర్చి, జానకిన్
గాసిలఁజేసి చెంగలువ గంధగజంబటు కొంచుఁబోవఁగన్.

ఉ॥ శూరవరేణ్యు లానృపతిసూనులు రాక్షసుబాహుయుగ్మమున్
దారుణ ఖడ్గధారలవిదారితముం బొనరించి మూర్ధమున్
గ్రూరశరంబులం దునిమి కొల్లలఁ గూల్చిరి; సర్వదైత్యసం
హారకథావిధానమున కద్ది వినాయకపూజయో యనన్.

కం॥ మనుజాశుఁ జంపి యాక్రియ
వనితానుజయుక్తుఁడౌచు వసుధావరుఁడున్
వనభూములందుఁ దిరుగుచుఁ
గనె నొక్క సరోవరంబుఁ గమనీయంబున్.

కం॥ వీణామృదంగరవయుత
గానామృత మాతటాకగర్భోద్గత మై
వీనుల విందుగ వినవా
దానికిఁ గారణము మునులు తగఁ దెల్పిరిటుల్.

ఉ॥ "మున్ను మెకంబులం గలసి గ్రాసమెసంగుచు మాండకర్ణి సం
పన్నతపం బొనర్ప, సురవల్లభుఁ డెత్తినభీతి నప్సరః
సన్నతగాత్రలం బనిచె సంయమభంగ మొనర్ప, వారి యా
యున్నులమిన్నలన్ వలచి యాత్మకళత్రములం బొనర్చుచున్.

తే॥గీ॥ పరిణతాత్మీయసత్తపోబలముకలిమి
సౌధపంక్తుల నిర్మించి సరసిలోన
వేల్పుజవరాండ్రఁ గూడి యావేళ నుండు;
సురవధూగానరవ మిద్ది తరళనయన!

కం॥ పంచాప్సర మను కొలని
యంచితగుణ! చిత్తగింపు" మన హర్షరసో
దంచిత హృదయాంబుజుఁ డై
కాంచుచుఁ నమ్మునికి మ్రొక్కె గడచె వినీతిన్.

కం॥ శరభంగాశ్రమమున కా
సురభంగవిధానదక్షశుభగుణు లగుచా
శరధులు ధరణీతనయా
పరివృతు లై యరుగ దానిపార్శ్వమునందున్.

సీ॥ బాలాతపప్రభాభాసమానం బైన
రమణీయసౌవర్ణరథముతోడ,
శుకపక్షగర్భభాసురహరిత్తనుకాంతి
పరిపూర్ణవరచిత్రహరులతోడ,
మొగుడువాఱని తమ్మిపూరేకులను బోలు
ననిమేష మౌ వేయికనులతోడ,
దానవీగర్భవిద్రావణోజ్జ్వలవజ్ర
ధారణోదార హస్తమ్ముతోడ,

తే॥గీ॥ అనని యంతకు యాకసమందు నిల్చి
దేవవిభుఁ డామునిం గాంచి దివ్యలోక
మునకు విచ్చేయఁ బ్రార్థించి యనకు లేశు
నాగమనముఁ దెల్పి సెలవంది యరిగె దివికి.

ఉ॥ రాముని లక్ష్మణున్ జనకరాజసుతన్ ముని పూజసల్పి సు
త్రాముని రాకఁ దెల్పి కృతరామసపర్యకు మూట ధన్య మా
స్వాము లగాత్రియష్టి హుతహవ్యనహంబున వేల్చి దివ్యతే
జోమహనీయమూర్తి యయి వొచ్చె దినంబు విమానచారి యై.

కం॥ అవ్వేళను జూచి రాముఁడు
డిచ్ఛామాయిం జనకు సంతానవిరాగ్రములఁ గన్నాన్
నిచ్చలు నతాయుతుల నైత
పొచ్చములే కయ్యయోధ్యఁ బోలెఁ జరింపన్.

సీ॥ సప్తార్ణవమండలసన్నిబద్ధకాగ్రి
సృష్టి వర్తించు నేఋషి చరుండు,
జ్వలితపావకచతుష్కమధ్యమున నుండి
తపము సాధించు నేషట్కర్మనర్తి,
భూమరాంగనామంది హసాంబకులకు
గెలువ దేవ్వనిధైర్యకంచుకంబు,
లేతకై మానుషములోప్రటునొప్పలఁ బాపు
నే నైష్ఠికుఁడు మూలఁ బూనుకేల,

తే॥గీ॥ అట్టి యమివర్యుఁ గనె సుతీక్ష్ణాభిధానుఁ,
బడఁతితోఁ దమ్మునితో రామభద్రుఁ డరిగి;
జానకీజాని సుచితోపచారవిధులఁ
బూజయొనరించె సంత సమ్మునఁ బరుండు.

తే॥గీ॥ దండకావాసు లౌతపోధనులు చేరి,
దైత్య సంజాతబాధ లంతంతఁ జెప్పి,
ప్రార్థనముఁ జేయ నవ్వానిఁ బాయఁ జేయ
మునులఁ గావంగ రాముండు పూనెఁ బ్రతిన.

క॥ అమ్ముని వీడ్కొని రాముఁడు
తమ్మునితో సీతతోడఁ దగ నవ్వనులన్
గ్రుమ్మరుచుఁ దరులతానిచ
యమ్ములఁ గనుపండు వొప్ప నరియును నొకటన్.

సీ॥ వాతాపితనుసమిద్భారంబు దహియింప
నవవహ్ని యౌతపోధనుని జఠరము,
సప్తసాగరరాశి జలసముచ్చయము నా
చమనించు నేమునీశ్వరుముఖమ్ము,
నాకేశతాదృప్తనహుషభంజక మేమ
హోగ్రతపోధను హుంకృతంబు,
వినువీధి మునుముట్టు వింధ్యశృంగంబుల
నవనిఁ బట్టించు నేయఘనాజ్ఞ,

తే॥గీ॥ ఆవిలీభూతసర్వజలౌఘములను
దేర్చుకతకఫలంబో యేదీప్తరూపు,
పరమదుర్దాంతతేజుఁడు బ్రహ్మనిష్ఠు
నతితరస్తుత్యు దర్శించె నయ్యగస్త్యు.

తే॥గీ॥ రాఘవులరాక మెచ్చి యర్ఘ్యం బొసంగి
దివిజసన్నుతకీర్తి నాతిథ్య మిచ్చి
జనకపుత్త్రిక నుచితోపచారవిధులఁ
దనుప నాత్మకళత్రంబుఁ బనిచె మౌని.

కం॥ భూపతి యనుజ్ఞఁ గొని యా
భూపుత్రి తపఃకృశాంగిఁ బుణ్యసముద్రన్
లోపాముద్రన్ గాంచె స
మాపన్నపతివ్రతామహత్త్వసముద్రన్.

తే॥గీ॥ కమలబాంధవుతో నుషాకాంత కోలె
భర్తవెనువెంట నెమ్మిమై వనికి నచ్చు
ధరణిజాతకుఁ గులసతీధర్మములను
దెలిపి పూజించె మునిపత్ని చెలిమికలిమి.

శా॥ పాతివ్రత్య మహాప్రభావఖని లోపాముద్ర పూజింపఁ ద
త్ప్రీతా సాధ్వి పతివ్రతామహిమ పెంచెన్ విష్ణుపాదాబ్జసం
జాతస్వర్ధుని శైవశీర్షతలవాసం బంది లోకత్రయీ
పూతం బైనటు పావనత్వమును సంపూజ్యత్వమున్ మించఁగన్.

తే॥గీ॥ పంచవటి నిల్వఁదగు నని పంచి రాము
నైంద్రచాపం బొసంగ వింధ్యాద్రిదమనుఁ
డనుజుతో సీతతోఁగూడి యచటి కేఁగి
పర్ణశాల వసించె నిక్ష్వాకుకులుఁడు.

సీ॥ జలకేళి సవరించుచెలువు గాంతురు కొంత
గోదావరీసరిత్కూలములను,
పుష్పాపచయములఁ బ్రొద్దుపుత్తురు గొంత
పంచవటీవనప్రాంతములను,
ఆతపబాధల నపనయింతురు గొంత
సంస్నిగ్ధ పాదపచ్ఛాయలందు
అలసటమెయి నిద్ర లోలయుదు రొకకొంత
పక్వపర్ణోటజాభ్యంతరముల,

తే॥గీ॥ అద్రిసానువులందు వయాళివెడలి
కేళి సల్పుదు రొకకొంత లీలమెఱయ,
జానకీరాము లటఁ బరస్పరముగూడి
దివ్యసౌఖ్యాబ్ధితరఁగలఁ దేలియాడి.

తే॥గీ॥ పరమపావన సన్మునీశ్వరులగోష్ఠి
నతిథిసత్కారములు దేవతార్చనములు
పూర్ణహర్షమ్ముతోఁ జేసి ప్రొద్దుపుచ్చ
నేఁగె వనవాసకాల మొక్కింత దక్క.

⇐ శూర్పణఖాభంగము ⇒

సీ॥ సంకల్పసంభవచాపవల్లి యనంగఁ
మెలిబంగరుకాంతి మేనితోడ,
సమదపుష్పంధయసముదయంబులఁ బోలు
కటికచాయ నిమాసోఁగకురులతోడ,
చెంగావి చివురుల జిగిసొంపుఁ దులకించు
పాణిపాదాంబుజద్వయముతోడ,
కలహంసకులములగతుల వంకల దిద్దు
కమనీయవిభ్రమగతులతోడ,

తే॥గీ॥ అఖిలజగముల గెలువంగ నసమశరుఁడు
సంతరించిన యాఱవశరము నాఁగ
పరమసుందరదివ్యరూపంబుదాల్చి
శూర్పణఖవచ్చె నెలమి నవ్వేటికొకట.

చం॥ మనసిజతుల్యరూపు మధుమాధవదర్పను రాముఁ జూచి, రా
వణుచెలియల్ మనోజశరబాధిత యై ధృతిదూలిచేరి శూ
ర్పణఖ పరిగ్రహింపు మని ప్రార్థనచేసె విలజ్జ జానకీ
వనరుహనేత్ర సన్నిధిని; వాముఁడు కాముఁడు లజ్జ నిల్పునే ?

తే॥గీ॥ దానవాంగన మదనాగ్నితప్త యగుచు
రామశుభదీర్ఘభుజయుగాశ్రయముఁ గోరె
మండువేసఁగియెండల మఱిఁగి చిలువ
చెలువ చల్లనిగందంపుఁజెట్టునట్లు.

తే॥గీ॥ మాతృభావనతో నన్యమానవతులఁ
గాంచుపూతచరిత్రుఁ డాఘనుఁడు రాముఁ
డసురకాంతాభిలాషోపహాతి యెసంగ
సరసగతిఁ బల్కె మృదులహాసంబుతోడ.

క౦॥ దారసహితుండ నబలా!
తారాపతితుల్యముఖుఁడు తమ్ముఁడువాఁడో!
సారసనేత్ర! వరింపుము
తారుణ్యఫలంబుఁ గాంచఁ దగు నీ కచటన్.

ఉ॥ నావుడుఁ జుప్పనాతి మదనప్రతిబాధిత గాన లక్ష్మణున్
భూవిభునాజ్ఞఁ జేరి తనపోడిమి తెల్పి వరింపఁ గోరె; నీ
తావిభుఁ గోరుకాంత తనతల్లియకా మది నెంచి యాతఁ డీ
రావణుచెల్లెలిఁగనఁడు; రాఘవు లెన్నఁడుఁ బాడిఁ దప్పిరే.

తే॥గీ॥ ఉభయకూలంబు లిటునటు నొరసి పాఱు
నిమ్నగను బోలి రాక్షసి నియతిలేక
రామలక్ష్మణులను గోరి రాయిడించు
మదననిర్భిన్నయై లజ్జ మాఱువడఁగ.

ఉ॥ కామవశాత్మ యాదనుజకామినిఁ జూచి హసించె సీత; త
త్కోమలహాసమాత్రమునఁ గోపముఁ జెందెను జుప్పనాతి; శాం
తామలవారిరాశి యమృతాంశుకరాళిఁగలంగినట్టు; లే
భామ సమానలందు నగుఁబాటున కోర్చును మానహీన యై.

తే॥గీ॥ ఇంతయెల్లిద మైతినే? యేను మగువ!
యచిరమునఁ గాంచెదవు మందహాసఫలము;
హరిణి శార్దూలి నల్లన మాఁడి నెమ్మి
నుసుఱు నిల్పంగనోపునే యుర్వి నెందు?"

చం॥ అని తనపేరికిం దగుభయంకరరూపము దాల్చ, కంఠ ని
స్వనమును జంబుకారవముభాతిగ మారెను భీతిఁ గొల్పుచుచ్; 
వనజదళాక్షి యిట్లసురభామగ మాఱుట గాంచి యెంతయుచ్
మనమున విస్మయంపడిరి మాన్యులు భానుకులప్రదీపకల్.

తే॥గీ॥ అడలుచిత్తంబుతో సీత యాత్మవిభుని
కౌఁగిటం జేరి సురిగెను గనులు మోడ్చి,
జానకీగాత్రదృఢపరిష్వంగ సుఖముఁ
జూజగోని మోడ్చెఁగనుదోయి చొక్కి యతఁడు.

ఉ॥ జానకిఁ బట్టనయ్యెడ నిశాచరి యుద్యతహస్త యైన రా
మానుజుఁ డాత్మఖడ్గమున నమ్మనుజాశనికర్ణనాసముల్
లూనమొనర్చెఁ; దొల్లి జనలోచనభీషణరూప కయ్యెడల్
మే నతిభీషణం బగుచు మించె వికర్ణవినాసభీమ మై.

తే॥గీ॥ రాగభంగంబుఁ గోపాగ్ని రగులఁజేయ
జ్వలిత మయ్యెను దత్క్రోధవహ్ని కర్ణ
నాసికాచ్ఛేదపరిభవనవ్యదుఃఖ
కలన, వ్రణమున ఖారంబు చిలికినట్లు.

తే॥గీ॥ వంశపర్వోపమిత పర్వభాగములను
వక్రనఖముల నంకుశభ్రాంతిఁ గొలుపు
చటులహస్తాంగుళమునఁ దర్జన మొనర్చె
నసురభామిని యంబరమందు నిల్చి.

ఉ॥ నాసయుఁ గ్రోధమేఁపఁగ ననంతజనంబున నేఁగి తజ్జన
స్థాననివాసు లై నఖరదానవముఖ్యుల కెల్ల రాఘవా
నూనసమాత్తతత్పరిభవోదిత యాతనదైత్యధిక్కృతిన్
దానవి తెల్పె వెక్కుచును దక్కుచె ముక్కిఁడిపల్కుదోఁపఁగన్.

## ఖరదూషణాది సంహారము

కం॥ శూర్పణఖా వికృతాకృతిఁ
గార్పణ్యము పరిభవంపుగాథయుఁ దెలియన్
సర్పి ర్హుతాగ్నులట్టులు
దర్పోద్ధతి మండి రెంతొ తత్స్థానపులున్.

తే॥గీ॥ ఆ నిశాచరి పురికొల్ప నతిరయమున
దనుజసైన్యాధిపులు చతుర్దశసహస్ర
సంఖ్యరక్షోబలంబుతోఁ జనిరి రామ
చంద్రు నుక్కడఁగింపఁగాఁ జేలము పూని.

మ॥ వికృతాకారను మున్ను పెట్టుకొని యుర్వీనాథుపై కేఁగు నే
సకలోర్వీస్థలిభావి రాత్రిచరనాశ మ్మెల్ల రూపించు దు
శ్శకునంబయ్యెను ; వారి కయ్యెడ వినాసత్వం బకర్ణత్వమున్
వికలాంఘ్రిత్వ మబాహుకంఠతయు భావిన్ బ్రాజ్ఞసంభావ్యమై.

తే॥గీ॥ ఉద్యతాయుధు లై దైత్యయోధవరులు
తన్ను గవియుటఁ దెలిసి భూదయితుఁ డల్ల
సజ్జితాయతచాపలక్ష్మణులయందు
జయరమావనిదుహితృరక్షణము నిల్పె॥

ఉ॥ పెక్కురు శస్త్రపాణు లతిభీకరదైత్యులు రాము నొక్కనిన్
గ్రక్కునఁ జుట్టుముట్టి బహుకార్ముకముక్తశరాళిఁ గప్పినన్
దక్కక లక్ష్యశుద్ధి లఘుతాయుతమార్గణరాజి నింపి తా
నెక్కటి యయ్యు నిల్చె నృపుఁ డేడ్తెఱ నందఱ కన్నిరూపు లై.

తే॥గీ॥ దుర్జనుఁ డొనర్చు నాత్మసందూషణమ్ము
సజ్జనుఁడు సైఁపనట్టు లిక్ష్వాకుకులుఁడు
రణదురాసదు మత్తు దూషణుని సైఁప
కుజ్జ్వలాశుగముల గప్పి యోర్చిచంపె.

తే॥గీ॥ కార్ముకత్యక్తసందీప్తఖరతరాశు
గములపా లొనరించి యాఖరుని జంపి
శరపరంపరఁ బరపి యాజనవిభుండు
త్రిశిరు విశిరస్కు నొనరించె గీర్తి మెఱయ.

సీ॥ తూణీరముననుండి బాణంబు చేకొంట
తివిరి చాపమున సంధించుకొనుట
కర్ణాంతముగ గుణాకర్షం బొనర్చుట
కడునిశ్చలముగ లక్ష్యంబు గనుట,
గుడుసువారుట విల్లు బెడిదంపుటడిదముల్
వజ్రనిస్వనముతోఁ బాఱుచుంట,
క్షతదేహు లై రాత్రిచరులు కొండలఁ బోలి
వికృతరూపంబులఁ బృథివిఁ బడుట,

తే॥గీ॥ క్రమముగా జరిగిన నొక్కకాలమందె
జరిగినట్టులుదోఁచెఁ గౌశలముపేర్మి
యాతుధానుల ప్రాణమ్ము లాశుగములు
కంకగృధ్రాదు లెల్ల రక్తంబుఁ గ్రోల.

కం॥ ఆ మనుజాశనసైన్యము
రామశరోత్కృత్త కంధరం బగుకతనన్
భూమిన్ గబంధములు ద
క్కేమియు నిలువంగనోప దీక్షింపంగన్.

తే॥గీ॥ బాణవర్షంబు పఱపు నైక్ష్వాకుసతను
యుద్ధమొనరింపఁ జేసి యాయోధనమున
రాత్రిచరసేన నిద్రించె గ్రద్దఱెక్క-
నీడ నతిదీర్ఘ శాశ్వతనిద్ర గూరి.

క॥ ఖరదూషణాదు లెల్లరు
నరవరు బాణాగ్నిశిఖల నశియింప నిశా
చరి చుప్పనాతి యొక్కతె
సురవైరికి వేగువెట్టఁబోవ్వాన మిగిలెన్.

ఉ॥ లంకకుఁ బాఱి కొల్వునఁ జలంబున రావణు నిందఁజేసి "ని
శ్శంక ఖరాదిదైత్యుల నజయ్యుల రాముఁడు కూలనేసి నన్
గొంకక కర్ణనాసములు గోసి విరూప నొనర్చి రాక్షసా
తంక మొనర్చె; నిద్ది కదుపైన్యాయము గాదొకో యన్న చూడుమా!

సీ॥ మల్లిమొగ్గలచాలు మఱపింపఁగాఁ జాలు
కొనలుదేఱిన దంతకుట్మలములు,
కెంగేయచివురులఁ గేలిసేయఁ గడంగు
నాతామ్రపక్వబింబాధరంబు
కల్కిబిత్తఱిలేఁడిగమిచూపులకు నొజ్జ
గాఁబోలునన దోఁచుకల్కిచూపు,
కలహంసలకు గతిగారవం బెఱిఁగించు
మదనాగసమసీరమందగతులు,

తే॥గీ॥ నేఁటిఱెక్కలనునుచాయ నీర్ఘవేణి
కనకకాంతులఁ దులకించుగాత్రియష్టి,
గల్గి మదనాస్త్రమన నొప్పుకలికిమిన్న
తద్రఘూత్తముభామ సౌందర్యసీమ.

తే॥గీ॥ సకలభువనైకసార మాజలజనయనఁ,
బత్నిగాఁ గొన్నవానిదే భాగ్య మన్న,
దాని తేఁ బూని నీ కిది తగు నటంచు
భంగమొందితి ని''ట్లని పల్కెఁ గల్ల.

చం॥ మొఱకుఁదనంబు తొల్లి పెను మోహము మీఁదను సర్వదిగ్జయ
స్ఫురితపరాక్రమం బవల సోదరిపొందిన భంగపాటు, దు
ర్భర ఖరదూషణాదివధ, గ్రమ్మి మనంబుఁ గలంపఁగా నిశా
చరపతి కోపవేగమున జ్ఞానవిహీనత నొందెఁ గ్రక్కునన్.

తే॥గీ॥ జనపతి యొనర్చునాజనస్థానవధను,
ననుఁగుఁజెలియలినిగ్రహం బరసి యాసుర
త్రిజగతీ జయాశోభితాత్మీయమూర్ధ
దశక మరిపాదహతి వట్లు దలఁచె నాత్మ.

ఉ॥ ఏఁచినరోషవహ్ని మతిహీను నొనర్ప మదాంధవృత్తి మా
రీచుని జేరి జానకి హరింపఁగఁ దోడ్పడఁ గోరె నెమ్మి; దం
ష్ట్రాచయభీషణోరగఫణామణికై చెయి చాఁచునట్లు దో
షాచరకాళరాత్రి మహిజాత నెఱుంగఁడు మృత్యుకన్యగా.

కం॥ మారీచుఁ డనియెఁ "పౌల
స్త్యా! రాముఁడు గాధిపట్టి జన్నముగావన్
బోరన్ జవిచూచితిఁ ద
ద్వీరత్వము వజ్రసారభయద ముర్విన్.

తే॥గీ॥ తప్పచను పాశిపాశంబు, దండధరుని
దండమును, వజ్రివజ్రంబు, దప్ప దెపుడు
రామబాణం బమోఘంబు ప్రాణవాయు
వుల గ్రసించు విషాభీలభుజగమట్లు.

ఉ॥ లీలఁగ నేసె రాముఁడు శిలీముఖ మొక్కటి తొల్లి దాన నేఁ
దూలితి దూదిపోల్కి బహుదూరము నిల్వఁగలేక ; వార్ధిలో
హేలఁగ ముంచియెత్తె ; ధరణీశుని గెల్వఁగఁ జాలు టెట్లు ? నేఁ
గాలుని ప్రోలికేఁగు కడగండ్లను గాంచి నివృత్తి నొందితిన్.

కం॥ అదిమొదలుగ రేఫాదిక
పదములు కర్ణములఁ బడ్డ భయవిహ్వలతన్
గుదురొందదు నా చిత్తము
మొద లియ్యది మానివృత్తిఁ బూనుట కనఘా !

కం॥ ఒక్కముహూర్తములోపల
నెక్కటికయ్యంబునం జనేశ్వరుఁ డొకటన్
జక్కడచె యాతుధానుల
నుక్కునఁ బదునాల్గువేల యోధాగ్రణులన్.

మ॥ తరమే మర్త్యుల కిట్లు మూర్తమున దైత్యవ్రాతముం ద్రుంప ? శ్రీ
హరియే రాక్షసవీరులం దునుమ రామాకారుఁ డై పుట్టి యే
డ్తెఱ నీరీతి నుపక్రమించె; మహీపుత్రిం దెచ్చి తత్క్రోధవ
హ్ని రగుల్పం దగ దెల్లరక్కసులకుం జే టౌను లంకేశ్వరా !

చం॥ అనవుడు పంక్తికంధరుఁ డహా ! యిదియేటివిభీతి ? రామునిం
గన వెఱపేల యేఁ గలుగ ? గానమె వీరుల మున్ను ? దండకా
వనిఁ జొఱఁబాఱి సోదరి నవాచ్యవిధంబున భంగపుచ్చి దూ
షణముఖదైత్యులం దునుమఁ జాలమి దోఁపఁగ మిన్నకుందునే ?

శా॥ కాంతాసన్నిధి మత్సహోదరిని న్యక్కారింప నెట్లోర్తుఁ ? ద
త్కాంతం దెచ్చి పరాభవింతు నిదియే కార్యమ్ము ; లె మ్మిమ్మగతిన్
స్వాంతంబందును నిశ్చయించితి ; వికల్పంబేల ? దేవేంద్రు దు
ర్దాంతప్రక్రియఁ గిడుపుచ్చితిమి శ్రీరామున్ నిరోధింపమే ?

కం॥ మన మూరకున్న దనుజులఁ
దునుముట దొలఁగునె యతండు? దుర్బలుఁ డైనన్
జనునే యొప్పరికింపన్
ఋుణ రోగ విరోధిబలము వృద్ధింబొందన్.

చం॥ ఎదురుగనిల్చి జన్యమున నేర్తెఱ నొంప ననాధ్యమేని యీ
బెదరుట యేల? హేమమృగవేషముఁ బూని చరింపు జానకీ
మదవతి యగ్రభూమి; సతిమాటల వెన్కను బట్టి రాముఁ; డీ
వదె యిదె చిక్కినట్లు విపినాంతరమం దలయింపు మాయచేన్.

తే॥గీ॥ అంతట జనకపుత్త్రిక నపహరించి
లంకకుం దెత్తు; జానకీపంకజాక్షిఁ
బాసి రాముండు కృశియించు బహుళపక్ష
మందు రోహిణిఁ బాయు శశాంకునట్లు.

కం॥ ఈగతి వైరముఁ దీర్తుఁ
రాగదె యన నియ్యకొనియె; రథగతులై వా
రేఁగిరి పంచవటీవన
భాగమ్మున కఖిలభూతభయహేతువు లై.

కం॥ పంచవటీ ప్రాంతంబున
వంచన మారీచుఁ డొక్క స్వర్ణమృగం బై
పొంచుచు దాఁటుచు నటునిటుఁ
గాంచుచు సీతేశుసమ్ముఖమునకు వచ్చెన్.

సీ॥ తమ్మికెంపులతీరు తలిరుటాకులసౌరు
పగడంపుజిగిసొంపు పదము లలర,
పసుపునిగ్గులఁ దేఱు పసిడితళ్కుల మీఱు
మెయిదీవ క్రొమ్మించుమెఱుఁగు లీన,

మగజాలపై నీల మొగి నమర్చిన లీల
వెడఁదకన్నులదోయి బెడఁగు సూప,
పచ్చతాగమి గూర్చి పట్టునట్టిలు పొల్చు
చిఱుపచ్చనునుఁదోఁక చెదరుచుండ,

తే॥గీ॥ కలికిబిత్తరిలేఁడి యై పొలుపుఁ జూపి
పూరి మూర్కొని యత్తెత్తి పాఱఁజూచి
బెగ్గడిలి చౌకళించుచుఁ బిఱిఁదిఁగనుచు
పుడిమిపుట్టువు నలరించెఁ బొలసుఁదిండి.

ఉ॥ బంగరులేఁడి గాంచి నవపద్మదళాయతనేత్ర సీత, రా
ముం గని దీనిఁబట్టుఁడు ప్రమోదము నొందును కేకయీసుతుం
డుం గడు మెత్తు రత్తలు, కుడుంగములం జొఱబాఱకుండ సా
రంగముఁ దెం డయోధ్యకును గ్రమ్మఱిపోద మొకేఁడు నిండఁగన్.

తే॥గీ॥ అనెడు ప్రేయసికోర్కె కాదనఁగలేక
ధనువు తూణీరమును దాల్చి ధరణివిభుఁడు
లేఁడి వెన్నంటి చనె; విధిలీల గాదె
మాయ దాఁటించుపరుఁ డిటు మాయఁ బడుట.

సీ॥ పులుమేసి నెమరుచుఁ బూఁబొదరిండ్లలో
నలసట వాయంగ నిలిచినట్లు;
కాలి తడిసి నేలఁ గలుగు గమ్మనితావి
మూర్కొని కను లఱమోడ్చినట్లు,
బెగడుగుడిచి నిండువెలుఁ గ్రేగ్లువాఱుచు
నెడ నిల్చి పిఱిది కీక్షించినట్లు,
దవ్వుదవ్వుల నిల్చి తనమేనికండూతిఁ
గొనకొమ్ములను గోకికొన్నయట్లు,

తే॥గీ॥ చెంగటమెలంగునట్టులు చేయిదప్పి
పాఱినట్టులు నేమరుపాటఁ బట్ట
ననువు దొఱకొన్నయట్టులు ననువుదప్పి
చన్నయటుపోవు బంగరువన్నె మెకము.

క॥ ఈరీతిగ నలయించుచు
మారీచుఁడు ద్రోహచింత మాయానటనన్
దూరం బాకర్షించుచుఁ
గాఱించె వనాంతరమునఁ గాకుత్థ్సకులున్.

తే॥గీ॥ మృగముఁ బ్రాణంబుతోఁబట్టుమెలపు దొఱఁగి
తూపు గురిచూచి వడినేయఁ దొరలి పుడమి
నుసురు వాయుచుఁ గూ యిడె నసుర "హా! ధ
రాతనూజాత! లక్ష్మణ! రారె" యనుచు.

క॥ మెక మిట్టు లుసురు వాయుచు
వికృతాసురరూప మొంది బిగ్గఱ సీతా
సుకుమారగాత్రి లక్ష్మణు
నోకటన్ జేర్కొనఁగ రాముఁ డోడుచు నుండన్.

క॥ డాక స్నదరుచు వరళుల
కేకలతోఁ గూడి కలుగు కీ డెఱిఁగింపన్
గాకుత్థ్సకులుఁడు తనమది
వ్రేకనఁగా మరలుచుండె వివశతనుండై.

## — సీతాపహరణము —

శా॥ మారీచుం డటు రామబాణనిహతిం బ్రాణంబులం బాయుచున్
శ్రీరామార్తరవంబుగాఁగఁ బిలువన్ సీతన్ సుమిత్రాత్మజున్,
నారీరత్నము సీత లక్ష్మణుని "నన్నా! సోదరుం డార్తుఁడై
నీరాకన్ మదిఁగోరి కుయ్యిడెడిఁ గంటే! వేగఁ దోడ్పావవే!

ఉ॥ ఎన్నఁడు నిట్టిదైన్యమున నేరిని గావఁగ నెల్లు వెట్టఁ డా
పన్నశరణ్యుఁ డీవిధిని వంతలఁ గుందుట కేమిహేతువో
యన్న ! త్వదగ్రజాతునిభయం బెడలింపఁగఁ దోడుసూపి, నా
మన్నన లంది, కాఱడవి మ్రగ్గుటకున్ ఫల మొందు మియ్యెడన్.

కం॥ అనవుడు లక్ష్మణుఁ డి ట్లను
విను మంబా ! పదియునాల్గువేవురు దనుజుల్
క్షణమాత్రనిహతు లై రే
ఘనుచే నమ్మేటి కెదురు గలదే పోరన్.

ఉ॥ నమ్మము రాముఁ డాజి పదునాల్గుజగంబులు నొక్కమొత్తమై
గ్రమ్మిన గెల్వనోపు ; మునికంటకుఁ డా దనుజుం డెవండో తా
నిమ్మెయిఁ గూయివెట్టి నిను నీక్రియ నెవ్వగఁ గూర్పనెంచె ; శో
కమ్మును బొంద నేల ? రఘుకాంతుఁడు ప్రాకృతమర్త్యమాత్రుఁడే.

కం॥ అన సీతావనితామణి,
కనలూని సుమిత్రపట్టిఁ గాఱులు పదరెన్
వనితలు యుక్తాయుక్తముఁ
గననేర్తురె ? కోపశోకకలుషిత లైనన్.

కం॥ బలునారసంపుములుకుల
వలనుగఁ జెవి నాటుపోటుపల్కుల కోపన్
దల గాక లక్ష్మణుం డట
నిలువం జాలకయుఁ బోవ నేరక యంతన్.

సీ॥ రామాజ్ఞ తలఁదాల్చి రక్షకై యటనిల్వ
ధరణిజ మదిఁ దప్పుఁ దలఁచు నేమొ ?
రమణి నెక్కటి వీడి రామరక్షణకేగ
నవమతి గా నాతఁ డరయు నేమొ ?

ఒంటిమై వని నీడ నుర్వీజఁ దొలిపగ
తెంచి దానవులు బాధింతురేమొ ?
తనయాజ్ఞ పెడఁద్రోసి తరలి వచ్చుట కాత్మ
నినకులేశుండు గోపించు నేమొ ?

తే॥గీ॥ యనుచు నుయ్యెల లూఁగెడిమనముతోడ,
నరుగఁ జాలక యట నిల్వ ననువుఁ గాక,
తడఁబడుచు నెట్టకేలకు ధరణిపుత్రి
వీడి సౌమిత్రి చనె రఘువీరుఁ గనఁగ.

సీ॥ అంసదేశంబున నజినోత్తరీయంబు
కటితటంబునఁ గావికచ్ఛడంబు,
అపసవ్యకరమున నాషాఢదండంబు
స్ఫటికాక్షమాలిక సవ్యపాణి
పల్లవారుణజటాపటలమ్ము లౌఁదల
గొడుగు పావలజోడునడుగుదోయి
బడుగుదేహంబున భస్మానులేపంబు
శ్రవణంబులను రుదురాకపోగు

తే॥గీ॥ లలర యతిరూప మూని దైత్యాధిపుండు
రామలక్ష్మణవిరహితాశ్రమముఁ జొచ్చె
గోముఖవ్యాఘ్రు మనుచు నికుంజభూమి
డాఁగి వనదేవతలు భీతిఁ దొఁగి చూడ.

సీ॥ స్వాగతసత్క్రియాచరణం బొనర్చుచో
సౌమ్యేతరాకారసరణిఁ దోఁచె
పాద్యోపచారంబు పచరింపఁ బోవుచోఁ
గుహనాస్వరూపంబు గోచరించె

అర్హణీయత నెంచి యర్ఘ్యంబొసంగుచోఁ
జటుల నైకాగ్రహస్తత యెలర్చె
సదమలాచమనోపచారం బొనర్చుచోఁ
దశముఖాభీలగాత్రంబుఁ దోఁచె

తే॥గీ॥ దైత్యుఁ డీతఁడు యతి గాఁడు దరికిఁ జేరఁ
దగ దనుచు నల్ల నిజమన స్తస్తత్త్వ మొకట
దెల్పఁ దొడఁగెను; నైన సందేహ ముడిగి
యతిథిఁ దన్పుట విధిగాన నవనిజాత.

మ॥ యతికిన్ బోలె తపోధనోచితసపర్యల్ చేయఁ బూనంగ, దు
ర్మతి యాదైత్యుఁడు దేవమందిరలసన్మందారదామంబు నిం
దితపూయామిషబుద్ధి వేఁపి గొనుభాతిం బల్మిఁ గొంపోయె భూ
సుత నాత్మీయ బలాభిధానకులతేజోవీర్యముల్ దెల్పుచున్.

సీ॥ సురగాలి వడిఁ దాకి సుడిసి మింటికిఁ బోయి
తివిరి కంపించు లేఁదీవమాడ్కి,
క్రోల్పులి పైకొన్నఁ గుట్టూర్పుమై నాస
వీడి కొందల మందులేఁడికరణి,
విహగేంద్రుచేఁ జిక్కి వినువీథిఁ జీరాడి
చెలువేదుచిలువనెచ్చెలి విధమున
కాఱుమబ్బులు గ్రమ్మఁ కాంతిరేఖ దొఱంగి
సొబగుబాసిన తళుక్కుఁజుక్కపోల్కి

తే॥గీ॥ రక్కసులఱేనిచేత ధరాతనూజ
చిక్కి తను గాఁచువెఱ వెల్లఁ దక్కి వగపు
పెల్లుఁ బైకొన భ్రమాన్పడి వివశ యగుచుఁ
గొంతవడి కల్లఁ దెలివొంది వంతఁ గుందు.

ఉ॥ భీరువు, రాచపట్టి, యతిభీషణకాననసీమ, భీతి యే
పారఁగనొంటినుండుట, నృపాత్మజులిర్వురు దూరవర్తు లా
టా,రయ దుర్నిమిత్తచయ, మవ్వల భీకరదైత్యరాజు, సీ
తారమణీమనస్స్థితి నెదం దలపోయఁ దరంబె యేరికిన్.

చం॥ తగ దను, ముట్ట రా దనును, ద ప్పిది యంచును దెల్పుఁ ; గ్రుద్ధ యై
తెగడును, దుర్మదాంధ్య మని తిట్టును, బ్రార్థన సేయు దీనతన్,
బెగడుచుఁ జూచు నల్దెసను, బీరము కా దని మందలించు, నె
వ్వగ దురపిల్లుఁ, దుంటరులపా టను, నింద యొనర్చు దైవమున్.

ఉ॥ ఏకరణిం దొలంగు దితిజేశునిబారి యటంచు నెంచు, న
మ్మా ! కృపఁ గావవే యనునుఁ, గావఁగఁ జీరును దండ్రి ; దీన యై
కైకమనోరథం బిటులు కాంచెను బూర్ణత నంచు నేడ్చు; ని
క్ష్వాకుకులంబుపెంపునకు గల్గెను మచ్చ యటంచుఁ జింతిలున్.

ఉ॥ ఏల మృగంబు వచ్చె ? హృదయేశుని బుచ్చితి నేల దానికై ?
బేలతనాన లక్ష్మణుని బిట్టు దురుక్తుల నంటి నేల ? యీ
జాలి దొలంగ రక్కసుని జంపఁడె చూచెనయేని నాథుఁ డీ
లీల లిఖించెనే విధి ? మలీమస మాఁగద శీల మీశ్వరా !

కం॥ అని దురపిల్లుచుఁ బెల్లుగ
వనమెల్లం గలయఁ గనుచుఁ బ్రాణేశునికై
దనుజుం డంబరమార్గం
బునఁ బోవన్ ముక్తకంఠమున బి ట్టేడ్చెన్.

సీ॥ కావవే నను నాథ ! రావణుం దెగటార్చి
భవదనన్యమనస్కఁ బత్నిఁ గరుణ,
కాపాడవే నను భూపాల ! యీ దైత్యుఁ
బొలియించి కులసతి లలనఁ జెలిమి,

రక్షింపవే నను బ్రాణనాయక! పుల
స్త్యాత్మజప్రతిరుద్ధ నబల దయను,
అభయ మీఁగదె నాకు నసురనాయకు నోర్చి
వనవాససహచరి వనిత కెలమి,

తే॥గీ॥ దయిత! నను బ్రోవవే నిజధర్మపత్ని
రమణ! విడిపింపు నను నిజరమణిఁ గృపను
ఆపదలఁబాప రాఁగదే యార్తరక్ష!
దనుజు మడియింపఁ బోలదే దైత్యదమన!

కం॥ ఈగతి మొఱ యిడి తనలో
నేగతి విభుఁ డుండె నొక్కొ? యెఱిఁగిన నన్నుఁ
దాఁ గావ రాఁడె? మఱందియు
నాఁగఁడె యియ్యసురఁ బోర ననుముఁ దలంచెన్.

సీ॥ నాపాటు శ్రీరఘునాథు బోధింపరే!
దరులార! మి న్నంటుతరువులార!
నాపోవునిరవు నానాథుతోఁ దెల్పరే!
క్రొందీవగములార! కొలఁకులార!
నాయార్తి మనువంశ్యునకు నెఱిఁగింపరే!
కరులార! వనవిహంగంబులార!
నన్ను గొంపోవుకోణపుమనికిఁ దెల్పరే
మృగశాబకములార! యిఱ్ఱులార!

తే॥గీ॥ దైత్యు భంగించి నిజబాహుదర్పగరిమ
భయముఁ బాపరె! దండకావాసులార?
జనకపుత్త్రిక శ్రీరామునను(గుభార్య
దశరథేశునికోడల ధరణిసుతను.

క॥ అని పంటపొలఁతికన్నియ
పనవుడుఁ దోడ్తో జటాయుపక్షీంద్రుఁడు రా
వణు నాఁచె దశరథేశుని
తన మునునెయ్యంబు తీర్పఁ దఱి యది యనుచున్.

శా॥ "ఓరీ! రావణ! రామలక్ష్మణుల నెట్లో దవ్వుగావించి సీ
తారామామణిఁ గొంచుఁ బోదువె? ఖలా! త్రైలోక్యనిర్జేతవో?
వీరత్వం బిది యొక్కొ? యాదశరథోర్వీనాథజుల్ చూచినన్
నారాచంబులఁబా లొనర్పరె నినున్ బాపాత్మ! జన్యస్థలిన్.

తే॥గీ॥ వసుమతీసుత యర్థించె భయముఁబాప
దండకావాసులను గాన దర్ప మొప్ప
జన్యమున నిన్ను నిర్జించి జనకపుత్రిఁ
జంద్రు రోహిణిగతి రామచంద్రుఁ గూర్తు."

మ॥ అని దైత్యేంద్రు రథంబుపై నురికి వాహవ్రాతముం జంపి తీ
క్ష్ణనఖాగ్రంబుల సారథిం గెడపి చక్రంబుల్ యుగంబుల్ నొగల్
ఘనపక్షాహతి వజ్రతుండహతి వ్రక్కల్సేసి పౌలస్త్య శీ
ర్ష నికాయంబులఁ గాలఁ దన్ని కలఁచెన్ రామప్రియన్ గావఁగాన్.

తే॥గీ॥ విఘ్నమిటు సంఘటించిన బిరుతివియక
చంద్రహాసంబునం బక్షిచంద్రుపక్ష
యుగము ఖండించి జయమున నుబ్బి యసుర
మింటఁ గొంపోవుచుండె వాల్గంటి; సీత.

క॥ పక్షీంద్రుం డీ క్రియను వి
పక్షహతుం డగుట మోక్షపథ మెఱుఁగక తా
ఋక్షాధిపు సుగ్రీవున్
వీక్షించెన్ మంత్రిముఖ్యవృతు ఋశ్యాద్రిన్.

మ॥ కర పా దోదర కర్ణ కంఠ ముఖ వక్షస్కంధ భూషావళుల్
పరిధానాంశుకఖండభాగమున నల్లం గట్టి యమ్మేటి వా
నరుఁ డా భూపతి కియ్యఁ జాలెడు నభిజ్ఞానంబుగా నంచుఁ ద
ద్ధరినాథాగ్రణిముందు వైచెఁ గపు లంతన్ నివ్వెఱన్ జూడఁగన్.

సీ॥ అభ్రంకషంబు లై యతిదుర్గమము లైన
శైలశృంగంబుల సరణి దాఁటి,
రత్నగర్భాకంఠరత్నహారము లట్లు
ప్రవహించుగిరినిర్ఘరములఁ గడచి,
వసుమతీధృతనీలపరిధానచీనాంశు
కముఁ బోలు బహుళకాననముల మెట్టి,
సగరపుత్రోత్ఖాతశతయోజనాయత
జలధివాఃపూరంబు సంతరించి,

తే॥గీ॥ లంక కేతెంచి నిశ్శంకఁ బంకజాక్షి
సొబగు లీనెడిపుష్పితాశోకవనిక
బలిమి వనదేవతను బోలి నిలువరించి
రాక్షసస్త్రీలఁ గాపుంచె రావణుండు.

తే॥గీ॥ భీకరోదధివేష్టితద్వీపమధ్య
వనమునను రాక్షసీమధ్యభాగమందు
నిలిచి యేకాగ్రదృష్టి నిర్నిద్ర యగుచు
రామనామంబు జపియించు రాజవదన.

## ⇐ శ్రీరాముఁడు మరలివచ్చుట ⇒

సీ॥ భ్రాతృవత్సలుఁ డైన భరతుఁ డయోధ్యనే
కరణిఁ జింతలఁ జిక్కి కలఁగు నొక్కొ ?
వత్సోత్సుకము లైన పాఁడిగోవులఁ బోలు
తల్లు లేవనటలఁ దవిలి రొక్కొ ?

ఐచ్ఛికమ్ముగ నరణ్యావాస మూను సౌ
మిత్రి యేక్రియ వని మెలఁగు నొక్కొ ?
ఎండక న్నెఱుఁగనియింతి జానకి సాధ్వి
గోల యేయిక్కట్లు గుడుచు నొక్కొ ?

తే॥గీ॥ అనుచుఁ దలఁచుచు రఘురాముఁ డాశ్రమమ్ము
తెఱవునం బడి త్వరితుఁ డై మఱలుచుండ,
విన్నఁబోయినమోమున నన్నఁ జూడ
లక్ష్మణుం డేఁగుదెంచెఁ గలంగ మనము.

చం॥ అనుజని జూచి మానసమునందలినివ్వెఱ వేమడింపఁ గా
జనపతి చింత నొంది "యనుజా! యిటు లెక్కటి వచ్చితేల ? యా
జనకజ నొంటి వీడితె ? నిశాచరు లేమి యొనర్తు రొక్కొ ? దూ
షణముఖు లైత్యవీరులను జంపినవైరమి తీర్పఁ బూనరే ?

తే॥గీ॥ హేమమృగ మనుచింత నే నింతదవ్వు
వచ్చితి మృగంబు చిక్కక పాఱుచుండ
శరము నేసితి; నసురయై చచ్చుచుండి
పేరుకొనె మిమ్ము నే నార్తిఁ జీరినట్లు.

ఉ॥ వంచన దీనఁ గల్గు నని పర్విడి వచ్చుచునుండ లక్ష్మణా!
యెంచక పంకజాక్షి విడి యీక్రియ వచ్చితె ? బద్ధవైర న
క్తంచరకోటి పన్ని నిటు గాఱియవెట్టఁగ నెంచి; యొంటి నా
చంచలనేత్ర యేక్రియ నిశాచరబాధలఁ జిక్కి స్రుక్కునో!

చం॥ అళికులనీలకుంతలసమంచిత మై తెలిదమ్మిరేకులన్
దలకడవంగనొప్పుకనుదమ్ముల నెయ్యముఁ గ్రుమ్మరించుచున్
వెలి చిఱునవ్వుకాంతి నటవీస్థలి వెన్నెలఁ బర్వఁ జేయుచున్
గలకల లాడుజానకిమొగంబును గాంతునొ గాంచఁ జాలనో ?

తే॥గీ॥ అనుచు లక్ష్మణుతోఁ గూడి యవనివిభుఁడు
చేరి తమయాశ్రమం బట సీత గాన
కధిక సంభ్రమమున వెఱఁగంది వెదకు
దాఁచినధనంబుఁ గోల్పడి తడవునట్లు.

తే॥గీ॥ పర్ణశాలాంతరముల నుపాంతభూమిఁ
గేళివనులందుఁ గౌతమీకూలములను
నద్రిసానువులందుఁ గుంజాంతరములఁ
జొచ్చి చూచినచోటనే చొచ్చి వెదకు.

శా॥ ఆ కల్లార్వకి యుండె వృక్షతతి సీతాహారాశ్రునిష్యందియై;
మూకీభూతము లై యడంగె విహగంబుల్ గూండ్లలో; లేళ్లు శ్యా
మాకాంకూరము లైన మూతి గొనక రోమంథంబులన్ వీడె; దుః
ఖైకవ్యాపృత మయ్యెఁ బంచవటి చింతాకీర్ణ మైనట్లుగన్.

సీ॥ అన్న లక్ష్మణ! సీత నరయుమా! యీ కొండ
కోనలందును గాఱుకానలందు,
తమ్ముఁడా! యరయుమా! ధరణిజ నీ యేటి
దరులందు శైలకందరములందు,
సౌమిత్రి! యరయుమా! జనకరాజాత్మజ
పొదరు టిండ్లుల నంచపదువులందు,
అనుజ! వీక్షింపుమా! యవనిసంజాతను
జేదలందు గేదంగిపొదలయందు,

తే॥గీ॥ నెమ్మికొదమకు నాటల నేర్పు నొక్కొ?
చిలుకమొకరికి పలుకులు తెలుపు నొక్కొ?
కలికియంచకు నడసౌరు గఱపు నొక్కొ?
యరయుమా! యన్న! జానకి నరయు మనుచు.

కం॥ సౌమిత్రి పంచి యీక్రియ
రాముఁడు ధరణీసుతావిరహాభరమున ను
ద్దామమనోవ్యథఁ గుందుచుఁ
బామరుఁ డన వగచె దుఃఖభారవివశుఁ డై.

ఉ॥ జానకి యెందుదాగితివె? చాలును గౌతుక మింక రాఁ గదే!
కాననసీమ డాఁగి యిటు కాఱియవెట్టఁగనౌనె భామినీ!
నీనగుమోము చూడమి వనీస్థలి కొందల మందఁజేయు; చం
ద్రానన! యీప్రతిక్షణమహాయుగముల్ గమియింతు నేక్రియన్.

ఉ॥ ఎన్నఁడు దాగియుండ విటు లెన్నఁడు జాగు నొనర్ప వీక్రియన్
సన్నుతగాత్రి! యొంటి నొకచక్కని నిల్వవు; లేఁడి తేఱఁగా
నన్నటు పుచ్చి డాఁగఁగ మనం బెటు లొర్చె లతాంగి నీకు; నా
విన్నదనంబు జూడఁ దగవే? యని వాకొని చింతఁదోఁగుచున్.

ఉ॥ హా! యను; నెచ్చునూర్చు; జనకాత్మజఁ జీరును బేరెలుంగుతో;
నీయటవీప్రదేశమున నేవగఁ జెందెనొ యంచు భీతిలున్
దాయలు డైత్యు లేకతమ దక్కినజానకి నాహరించిరో!
హా! యెటు గాంతు జాయ ననుజా యను; నివ్వెఱఁ బొందుఁ గుందుచున్.

చం॥ నెనరు దలిర్ప సంతసము నింపుచు బాల్యముదొట్టి గోముగన్
బెనిచిన చిల్కబోద కనువేదుఱు పైకొనజాలుడేగపా
లొనరిచినట్లు జానకి నవోదితపూర్ణశశాంకవక్త్రి నీ
వనములపా లొనర్చితి నపాంసుల మాంసలదేహ లక్ష్మణా.

సీ॥ ఎఱిగింపరే సీత యెట నున్నదో కృపా
పరు లౌచుఁ గాననతరువులార!
బోధింపరే మహీపుత్రి పోయినదారి
కొనలార్చుచిఱులతకూనలార!

సూచింపరే ధరాసూతి నిల్చినతావు
కలకంఠముఖవిహంగంబులార !
తెలియఁ జూపరె సీత కలఁగి డాఁగినదిక్కు
కరుణ పైకొన మృగీగణములార !

తే॥గీ॥ అనుచు శోకార్తుఁ డై దైన్యమున నృపుండు
చేతనాచేతనము లనుచింత వీడి
వేడె జనకజకై దీనవీక్షణములఁ
బ్రకృతి కృపణులుగద యార్తి పడయువారు.

సీ॥ వలిగాలిఁ గదలినమొలఁదీవ పరికించి
కనకాంగిమెయిదీవగా భ్రమించు,
నెమ్మిబోదలకల్కినిడుదవాల్పురిఁ జూచి
యలివేణివేనలి యని భ్రమించు,
కలికిబిత్తరిలేఁటికందోయి నీక్షించి
హరిణాక్షికన్గవ యని భ్రమించు,
తలిరుటాకులఁ జూచి లలితపల్లవపాణి
కంపించుకెంగేలు గా భ్రమించుఁ,

తే॥గీ॥ జిలుగు సెలయేటివాఁగులతరఁగ లరసి
సుభ్రూకన్బొమతళ్కులు గా భ్రమించు
నిండుపున్నమచందురు నెటియఁ గాంచి
చంద్రబింబాస్యమోము గా సంభ్రమించు.

సీ॥ వనదేవతలు కంటఁబరికింపనేరక
నిర్నిమేషత్వంబు నింద సేయఁ,
పాషాణములు కృపాపరవశత్వ మ్మూని
ప్రాలేయశిలలయార్ద్రిత వహింప,

ప్రబలశోకావేగభారంబు సైఁపక
వజ్రహృద్గ్రంథులు పగులువాఱ,
ఉద్వేలకరుణారసోజ్జృంభణంబునఁ
బ్రకృతి ప్రమాన్పడి ఱిచ్చవాటు నొంద,

తే॥గీ॥ వలపు, ప్రేముడి, నెయ్యంబు, బాంధవంబు,
కడిఁదిమక్కువ, నెమ్మియుఁ, గరుణ, జాలి,
ప్రీతి, యనురాగమును, నెఱిపెరిమ, నెంచి
విభుఁడు జనకజకై మొఱ వెట్టుచుండె.

సీ॥ చద లంటుప్రమాఁకులు కదలె వాల్గొమ్మల
సురవైరి చనుదిక్కు చూపునట్లు,
వాడుచివురులతల్ ప్రాకెఁ నంతకుదెస
కింద్రారిఱెంకి సూచించునట్లు,
ఈరెలుంగులఁ బుల్గు లెగిరిపాఱెను దైత్యు
నెలవు చూపింపఁగాఁ దలచినట్లు,
కడకంట నశ్రువుల్ గార్చుచు మృగములు
చనె లంకదెసకుఁ జేరఁ్గొనినయట్లు,

తే॥గీ॥ రఘుకులేశ్వరుఁ డర్థించు ప్రార్థనమ్మ
ఫలము పొందినగతి ; ఘనప్రార్థనమ్మ
సఫల మాఁగాదె యత్యల్పసమయమందు ;
అధికగుణయాచనమ్మ వమ్మాట యరిది.

కం॥ అది గురుతు గఁ దమ్మునితోఁ
గదలి శిలోచ్చయగుహాళిగహనాంతరముల్
నదులు నికుంజంబులు తా
వెదకుచు దక్షిణపుదెసకు వెడలఁగఁ జొచ్చెఁ

ఉ॥ కొండొకదూరమేఁగి యటఁ గూలినవాజులు చచ్చి నేలపైఁ
బండినసూతుఁడున్ దొరలుభగ్నరథంబు శతాంగభాగముల్
ఖండితదీర్ఘచాపమును గాంచి తదంతికమందు నెత్తుటన్
నిండినపుల్గుఁజేని గనె నిర్ఝరవేష్టితశైలమట్లుగన్.

కం॥ కని రక్కసుఁ డనుతలఁపునఁ
గనలూని శరాసనమ్ముఁ గరమునఁ బూనన్
గనుదోయి నీరు నించుచు
ననియెన్ బక్షీంద్రుఁ డార్తి నాత్మ కలంగన్.

చం॥ పరుఁడను గాను దాశరథి! పంక్తిరథేశునికూర్మినెయ్యుఁడన్
ధరణిజఁ గొంచు మింట నిటు దైత్యకులేశుఁడు పంక్తికంధరుం
డరదముతోడఁ బోవ మిథిలాధిపపుత్త్రికఁ గావ వేడ్కఁగా
దురమొనరించి రావణునితోడ విపక్షుఁడనైతి నం చొగిన్.

తే॥గీ॥ జానకీవృత్తమును బౌరుషంబువిధము
పలుకులను మేనివ్రణములఁ దెలియఁజెప్పి
దశరథేశుని ఋణమును దనువుతోడ
పీఁగెఁ గ్రొన్నెత్తురులు నోట వెడలఁ గ్రక్క.

కం॥ పితృనిర్విశేషుఁ డగుఖగ
పతిమృతిఁ బితృమరణదుఃఖభారము నవమై
వెతఁగొల్ప, నౌర్ధ్వదైహిక
కృతు లొనరిచి రల్ల కోసలేశ్వరునకటులన్.

తే॥గీ॥ పంక్తిరథుతోడ మిత్త్రసంపదను బొంది
యవనిజారక్షణార్థమై ప్రాణ మొడసి
రాఘవునిచేతఁ బ్రేతకార్యంబుఁ గన్న
భవ్యుఁడు జటాయువే రామబంధు వగును.

## — కబంధ వృత్తాంతము —

తే॥గీ॥ అచటు వెల్వడి జనకజ నరయుపొంటె
గలయ వెదకుచు నొండ లెల్లఁ గన్నులు గను
దండకాటవిఁ దిరుగుచు దక్షిణంపు
దెసకుఁ బయనించి రల్ల నాదిత్యకులులు.

సీ॥ అట్టెత్తిచూడ నిజాగ్రముల్ గనరాక
యాకసంబొరయు మహాద్రుమాళి,
నడయాడ నేర్చిన బెడిదంపుఁగొండల
క్రైన వన్యమత్తేభకులము,
హరినీలసోపానసరణిఁ బోలుకెరళ్ల
నింపు గొల్పెడిసెలయేటిగములు,
గుఱుపెట్టి పొదరిండ్లఁ గూర్కుదోఁగియు భీతి
దోఁపించు క్రూరశార్దూలచయము,

తే॥గీ॥ గనుచు, నచ్చెరు వందుచుఁ, గానయెల్ల
కలయ వెదకుచు, జనకజఁ గానలేక
దుఃఖవశులౌచు నుత్సాహదూరు లగుచు
శూన్యచిత్తంబులను నొకచోట నిల్వ.

మ॥ జనకాపత్యగవేషణైకపరు లాకాకుత్స్థు లక్కాన యో
జనవిస్తారభుజద్వయాంతరమునన్ సంసక్తులై యొక్కచో
ఘనశైలోన్నతశృంగదేశనిభవక్షస్స్థాస్యు రక్షోధిపున్
దనుసంభూతుఁ గబంధుఁ గాంచిరి భుజాదర్పప్రభావోన్నతున్.

శా॥ కింకర్తవ్యవిమూఢులై యినకులుల్ ఖిన్నాత్ములై యంతలో
శంకాసంతమసం బణంచి నిజతేజఃప్రాప్తిఁ దద్దైత్యదు
ష్పంకంబున్ గరహేతిసంహతి నశింపం జేయఁ దద్దోర్యుగా
తంకంబున్ బెడఁబాసి దివ్యపురుషత్వం బందె నాదైత్యుఁడున్.

కం॥ శతమన్యుమన్యుహేతుక
వితతాత్మతనూవికార విధమును సీతా
సతివృత్తాంతము లంకా
పతిబలదర్పమ్ము తెలియఁ బల్కె నతం డై.

ఉ॥ దేవ! కపిప్రవీరుఁ డతిధీయుతుఁ డర్కసుతుండు మీకు సు
గ్రీవుఁడు తోడు చూపు సమఖేదయుతుండు భవత్సహాయుఁ డై
రావణు గెల్వనోపుఁ; గపిరాజ్యము నొంద హరీశు గెల్వ మీ
చేవయు, లావు, పౌరుషముఁ జేకొను బ్రత్యుపకారబుద్ధి మై.

తే॥గీ॥ ఆత్మసమదుఃఖు బలవంతుఁ బ్రాజ్ఞు సత్య
నిరతు ధర్మాత్ము వర్ధిష్ణు నెయ్యుఁ బడసి
జయము గాంచును విజిగీషు వయిననృపతి
దర్పితోన్నతుతో మైత్రి తగులఁ జనదు.

మ॥ పరఁగుఁ బద్మసరం బదూరమునఁ బంపానామకం బా సరో
వరతీరంబున సిద్ధతాపసి, తపఃపారీణ, మాతంగ పా
దరజఃపూతశరీర యా శబరి మాతంగోపదేశంబునన్
దటి వేచున్ మిముఁ గొల్వ స్వాదుఫలసంతానమ్ముఁ జేకూర్చుచున్.

తే॥గీ॥ అచటఁ జేరువ ఋశ్యమూకాద్రి యుండుఁ
దచ్ఛిరోభాగమున నిల్చుఁ దపనపుత్త్రుఁ
డాప్తయుతుఁ డౌచు, మీకు సహాయుఁ డగును
బొమ్ము సెల వి మ్మటంచును బోయె దివికి.

ఆ॥వె॥ ఆకబంధు పల్కు లాలించి యారాజ
తనయు లచటు గదలి దక్షిణంపు
దెసకు రుచిరవన్యదృశ్యమ్ము లరయుచు
పఱచి చేరి రల్ల పద్మసరసి.

## శబరీ సత్కారము

సీ॥ చిఱుగాలి నెఱి సోఁకి విరిసి లేనవ్వుల
వెలలార్చు తెలిఁదమ్మివిరులసిరులు,
అరవిచ్చునెత్తమ్మివిరులకమ్మనితావి
కొల్లవెట్టుచు వీఁచుపిల్లగాలి,
విరితేనె లానుచు వినువెంట సుడియుచు
తీపు లొల్కఁగ మ్రోయుతేంట్లపాట,
తమ్మితూఁడుల మెక్కి తరఁగయుయ్యాల లెక్కి
మించునెయ్యామిఁ బొల్చునంచకవలు.

తే॥గీ॥ అరుణసరసిజగర్భశయ్యలఁ దొఱంగి
జలములం దేలు ఫూఁదేనెచంద్రకములు
గలిగి జలరాశికరణి నగాధ మౌచు
నలరుఁ బంపాభిధానపద్మాకరంబు.

తే॥గీ॥ పాద్యసత్క్రియఁ జేయునాపద్మసరసి
పృషతసేకంబులం దేల్చి నృపతిసుతుల
కుశలసంప్రశ్న మొనరించి కూర్చునెమ్మి
విహగకలకూజితమ్ములఁ బ్రియముదోఁప.

తే॥గీ॥ ధరణిజావిప్రయోగప్రతప్తరామ
చంద్రు నల్లాసపఱుపంగఁ జాల దకట!
విమలపంపాసరోవీచివిపృషతశిశిర
గంధవాహప్రవాహసంబంధ మైన.

సీ॥ తమ్మిలేఁదూఁడుల నెమ్మిదోఁపగఁ దెచ్చి
యతివతో మెసవురాయంచకొదమ,
పువుదొన్నెలోఁ గమ్మచవు లూరుననఁదేనె
బోటితోఁ గ్రోలు లేఁదేఁటిమొకరి,

నునుతొక్కసురటులఁ దనలేమ వీచి మ
 క్కువ నింఢ నెఱపు జక్కవబొజుంగు,
తెల్లఁదామరపూవు వెల్లగొడుగుఁ బట్టి
 యిల్లాలి వెన్నంటు నేన్గుగున్న,

తే॥గీ॥ జానకీదర్శనోత్సుకస్వాంతుఁ డగుచు
సప్ప్రహంబున నీక్షించె జనవిభుండు
తనివి నెనయనినిడువాలుఁగన్నుదోయి
నశ్రుకణమాక్తికంబు లంతంత రాల.

కం॥ చిరకాలతపశ్చర్యలఁ
గరఁగి కృశీభూత మైనగాత్రమున నిరం
తరదివ్యశాంత తేజః
పరివేషము వెలుగ శబరి భద్రాశయయై.

ఉ॥ తమ్మునిఁగూడి రాముఁ గనుఁదమ్ములపండువుదోఁపఁ జూచి చి
త్త మ్మలరంగఁ బుష్పమధుధారలఁ బాద్యమొసంగి భక్తి నె
త్తమ్ములఁ బూజచేసి బలితమ్ముగఁ దీయనిపండ్లఁ దన్పి ప్రే
మమ్మునఁ గొల్చె నిల్చి మృదుమంజులవీజనసేవ చేయుచున్.

తే॥గీ॥ యాజకులులేకయును మండునగ్నులున్న
యాత్మసద్గురునాశ్రమ మ్మల్లఁ జూపి
బహువిధప్రాప్తపుణ్యాతపఃకృశాంగి
యగ్నిలో వేల్చి సద్గతి నందె శబరి.

తే॥గీ॥ పరమపావన తత్తపోవైభవమునఁ
బ్రభవ మొందెను శబరి నాఁబరగునొక్క
దివ్యవాహిని స్వజలావతీర్ణ మర్త్య
పాపభారాపహారిణి పావనకరి.

కం॥ అనుచును నరణ్యకాండము
వినిపింపఁగఁ గవలు రామవిభుఁ డామీఁదన్
మునియెట్లు పల్కె రామా
యణవృత్తం బెఱుఁగఁ జెప్పఁడా యని యడుగన్.

ఉ॥ నీరజనాభినందితసునీవిభవా! భవపాదపద్మపూ
జారత! ధార్మికప్రవర! సంచిత నిర్మలకీర్తి! శాశ్వతో
దారవిశేషదానపరితర్పితకోవిదశేఖరా! శుభా
కార! సమస్తలోకశుభకామ! గుణోజ్జ్వల! వైశ్యవల్లభా!

కం॥ సత్యోచితవాగ్వినయా!
నిత్యైశ్వర్యప్రభూత నిజసత్కీర్తీ!
అత్యంతధీరలోక
స్తుత్యగుణోదార! ధర్మశోభితమూర్తీ!

భుజంగప్రయాతము॥ సదాచారనిత్యా! లసద్ధర్మకృత్యా!
ఉదారాత్మమూర్తీ! చిరోపాత్తకీర్తీ!
సదాక్రాంతచిత్తా! ప్రభూతాత్మవిత్తా!
అదంభైకభాషా! కృపాయత్తవేషా!

గద్య॥ ఇది శ్రీమత్కాశ్యపగోత్ర పవిత్ర సుబ్రహ్మణ్యపుత్త్ర
బుధజనవిధేయ వేంకటసుబ్రహ్మణ్యనామధేయ
ప్రణీతం బైన శ్రీరఘురామచరిత్రంబునందు
అరణ్యకాండము.



శ్రీః

శ్రీ శారదాంబాయై నమః.

# శ్రీ రఘురామ చరిత్రము

## కిష్కింధాకాండము

కం॥ శ్రీ గడ్డెయార్యతనయా !
రాగద్వేషాదిదూర ! రమణీయగుణా !
భోగీంద్రతుల్యనిర్మల
వాగార్త్తయశస్క ! స్వామిబాబు ! నయజ్ఞా !

తే॥గీ॥ అవధరింపుము కుశలవు లవలికధను
బల్కఁ దొడఁగిరి యిటు రామభద్రుతోడ
మంత్రి సామంత మునిజన మాన్యు లెల్ల
హర్ష పరవశు లై యాత్మలందు మెచ్చ.

సీ॥ పండుటాకుల జీర్ణపరిధానమటు ద్రోసి,
చెంగావిచీర నాఁ జివురు దొడిగి,
నిడుదవేసలిదువ్వి నెఱిఁ గుస్తరించిన
భాతిఁ గాఱాకుజొంపములు దాల్చి,
మేలి రత్నపుసొమ్ము మెయిఁదాల్చినట్టుల
కలికివన్నెల మొగ్గగమి వెలార్చి,
చిరునవ్వు వెన్నెలతఱఁగ లూనినపోల్కి
నరవిచ్చు కమ్మనివిరుల నొప్పి,

తే॥గీ॥ వనరమాదేవి పులకించువలపుతోడ
మాధవసమాగమాపేక్ష మది జనింప
లలితనై పథ్య రచన నుల్లసిలినట్లు
మధుర మై క్రమ్మె మహి మధుమాసశోభ.

సీ॥ అసమేషుతూణాయితాశోకతరువులఁ
ప్రత్యగ్రకిసలయబాణపంక్తి,
సంకల్పసంభవజ్యాఘోషమును బోలు
నళికులధ్వని చూతకళికలందు,
మారవీరార్ధేందుమార్గణమ్ములఁ బోలు
కోరకాళి పలాశభూరుహములఁ,
బంచసాయకసార్వభౌమసంస్తుతిఁ బోలు
పరభృతాలాపమ్ము వనములందుఁ,

తే॥గీ॥ గెలుకొనఁజేసి జగముల గెల్వ నెంచి
యసమశరు సైన్యసన్నాహ మనువు పఱచి,
చైత్రయాత్రను జాటించెఁ జైత్రమంత్రి
చదలు మార్మోగ్రియ శృంగారజలధిపొంగ.

ఉ॥ కమ్మనితీపువిల్లు, పువుగాటపుఁ గోలలు, మీను టెక్కెమున్
దుమ్మెద నారి, కోయిలలదుందుడుకుల్ బలుచిల్క తేజియుఁ
దెమ్మెరగెల్పుతేరు, చనుదేర ననంగమహీశురాశ వే
గమ్మునఁ దోఁచె ముజ్జగము కామవిలాసవశంవదమ్ము గాఁ.

సీ॥ దర్పకాజ్ఞల మీఱుతపసి బృందంబుల
నెఱకంట జంకించుఁ బరభృతంబు,
మదనావిధేయసంయమిసంఘములఁ గాంచి
పండ్లు గొఱుకు గాఱుపదురుచిల్క,
కందర్పహితమతిఁ గడదాఁటుమానులఁ
జీకాకు వఱచును సోఁకుగాలి,
విషమేషుతంత్రానపేక్షు లౌయతుల నా
సవమాని దూఱు ధుష్పంధయమ్ము,

తే॥గీ॥ సకలతరువులు మదనాస్త్రసమితిఁ దాల్చి
విప్రయోగుల యోగుల వెఱపుగొల్పు;
ప్రభువుఁ గోపింపఁ దత్పరివార మెల్ల
బహువిధంబులఁ బరిభవపఱచు టరుదె?

చం॥ ధరణిజ తోడ నుండ బ్రమదం బొడఁగూర్చు వసంత మయ్యెడన్
గరము విషాదహేతు వయి గాఱియవెట్టు నృపాలు; నంతరం
బెఱిఁగినయాప్తులే గురుతరేర్ష్యల విప్రియకారు లౌదు రీ
ధర శుభయోగదూరులకుఁ; దక్కుదు రాత్మలఁ దొంటినెయ్యముల్.

చం॥ పరమపతివ్రతామణి యపాంసుల సీతఁ దొఱంగి రాముఁ డా
తఱి నెటో ప్రాణము ల్నిలిపి దారుణదుఃఖము నోర్చె; ప్రేయసిం
దొఱఁగిన శూన్య మై జగము దుస్సహవేదన గొల్పుచుండ, భా
సురమధుశోభ గాయమున సోఁకినకారమురీతిఁ గా దొకో.

సీ॥ సహచరీసహితుఁడై సహకారతరువుల
పల్లవంబులఁ గేలఁ బట్టువేళ,
కుసుమకోమలితోడఁ గుసుమితాశోకప్ర
సూనగుచ్ఛము లంటుశుభసమయము,
పక్వబింబోష్ఠితోఁ బ్రబ్బలిపొదలందుఁ
గొసరి పూఁదేనియఁ గ్రోలునాఁడు,
చందనగంధితోఁ జందనద్రుమముల
ప్రచ్ఛాయ విశ్రాంతి పడయుతఱియు,

తే॥గీ॥ తలఁపునను దోఁప వలపులు తొలఁకు సూప
నెక్కటితనంబు జానకిఁ దక్కియుంట,
తెలిసి వగపున మూర్ఛిల్లఁ దేర్చుఁబట్టి
లక్ష్మణుఁడు శోకజలపూర్ణపక్ష్మలుండు.

శా॥ ఆరాకానిశ లావనంబులు నితాంతాహ్లాద మామాధవం
బా రమ్యారుణనూత్నపల్లవచయం బాపూవు లాసారభం
బారాగోదయహేతుమందపవనం బాతేఁటు లాచిల్కగుం
పారాముండె మహీజఁ బాయ నటు దైన్యం బందె నిం కే మనన్.

⊂ సుగ్రీవుండు రామలక్ష్మణులఁ గాంచుట ⊃

ఉ॥ ఆవనరాజిలో హనుమదాదులు మంత్రులు తన్నుఁగొల్వ సు
గ్రీవుఁడు వాలిభీతి మది గీడ్పడి గ్రుమ్మరుచుండి యొక్కచోఁ
బీవరబాహుసక్తదృఢభీకరచాపుల సౌమ్యరూపులన్
భూవరపుత్త్రులం గనియె మూర్తిధరించినయాత్త్రి మోయనన్.

కం॥ వాలిప్రేషితులై యా
భీలగతిం బట్ట వచ్చువిప్రియకరు లం
చాలోచించి కపీంద్రుఁడు
శైలోన్నతశృంగదుర్గసంశ్రితుఁ డగుచున్.

చం॥ తనయెడఁ గూర్చుమంత్రుల నతంద్రులఁ దా నలనీలజాంబవ
ద్ధనుమదభిఖ్యులం గని మతంగమహాముని యాశ్రమంబు చెం
తను వనసీమ వా రెవరొ దారుణమార్గణబాణపాణు లై
యనయము సంచరింతురు సురాధిపసూతికి నాప్తమిత్రులో.

ఉ॥ ఆయతబాహువుల్ దృఢతరాయతచాపము లాశుగంబులున్
గాయముతోడిమాత్రమటుఁ గన్పడి భూతభయంబు గొల్పు; భ
ద్రాయితమూర్తిసౌమ్యత ముదం బెదఁ గొల్పుచు మైత్రి నించు నిం
కేయది మార్గ మొక్కొ మన కిత్తటి వీరలచిత్త మారయన్.

ఉ॥ ఇంద్రతనూజుఁ డిన్నగము నెన్నఁడు మెట్టఁగ నోడుగాదె! మా
నీంద్రుని శాపభీతి ; నతఁ డీనృపపుత్త్రులఁ బంచె నొక్కొ ; ని
స్తంద్రపరాక్రమక్రములు దండధరప్రతిమానరూపులున్
సాంద్రనయుల్ నృపాలు రరిచక్రము నాప్తులచే జయింపరే ?

ఉ॥ నావుడు వాయుపుత్త్రుఁడు "మనంబున నీగతి చింత యేల ? త
ద్భావరపుత్త్రులం దరిసి పొందుగ మాటల వారిచిత్తముల్
దేవ ! యెఱింగి వచ్చెదను నేరుపుపెంపున ; నెల్లభంగులన్
జేవ యెఱింగి యానృపతిసింహుల నెయ్యులగా నొనర్చెదన్".

కం॥ అని యాతనిచేఁ దగు నని
పనుపంబడి వృద్ధమంత్రివర్యానుమతిన్
జని యవ్వనమండలిఁ ద
జ్జననాథసుతద్వయమ్ముసమ్ముఖమునకున్.

సీ॥ బాలాతపారుణప్రభ లొల్కువక్త్రంబు
చిత్రపింగళవర్ణనేత్రయుగళి,
పృథుశిలోచ్చయశృంగపీవరాంసంబులు
కఠినవిశాలవక్షస్థలంబు,
సింహాసంకాశకృశీభూతమధ్యంబు
నాజానులంబిహస్తాంబుజములు,
స్ఫీతతామ్రమంబైనపృష్ఠప్రదేశంబు
పల్లవారుణపాదపద్మయుగము,

తే॥గీ॥ కటితటంబున బంగరుకచ్చడంబు
పాణితలమున దృఢదీర్ఘవేణుదండ
మస్ఖలితసాధుపదము లహార్యధైర్య
సంపదయుఁ బొల్చునొకబ్రహ్మచారి యగుచు.

తే॥గీ॥ చేరి వినయంబుతోడఁ బ్రశ్నించె నిట్లు
"బాణతూణీరములు జటావల్కలములు
దాల్చి క్షాత్రమ్ము బ్రాహ్మంబుఁ బొల్చినట్లు
వనములం దుందు రేల యాశ్వినులొ మీరు ?

తే॥గీ॥ ఏకులము యుష్మదుద్భూతి నెసకమెసఁగు?
సకలలోకంబు లేలంగఁజాలుమీకు
కానలం దుండ నేల? వల్కలముఁ గట్టి
ధనువుఁ మార్గణములు కేలఁ దాల్పనేల?"

కం॥ అనవుడు "వనితాన్వేషణ
మున కిటు వచ్చితిమి రాజపుత్త్రుల మనఘా!
దనుజేశునెలవు నెఱుఁగఁగ
మనమునఁ గోరుదము"నాఁగ నూరుతి పల్కెన్.

ఉ॥ వాయుతనూజుఁడన్; గపులబాంధవసూతికి నాప్తభృత్యుఁడన్;
మీయసమానతేజమె యమేయగుణాఢ్యు లటంచుఁ దెల్పె; మీ
కాయినపుత్త్రితోఁ జెలిమి యైనఁ బ్రభుత్వము మంత్రయుక్తమై
దాయలఁ గెల్చునట్లతిముదం బొడఁ గూర్పదె యిష్టసిద్ధితోన్.

చం॥ అన ననుజన్ముతో దశరథాత్మజుఁ డిట్లనె వేషభాషలన్
వినయము సౌమ్యవర్తనము ప్రీతి జనింపఁగఁ జేసె భానునం
దనసదృఢసౌహృదంబున కుదారపథం బిది; రోయఁ బ్రోవు క్రొ
న్నన చెయిదాఁకినట్లు; దనునన్ మనబన్నము లెల్లఁ దెల్పుమా!"

కం॥ అనవుడు లక్ష్మణుఁ డిట్లను
ననఘా పవమానపుత్త్రి! యవహితమతి వై
విను మస్మదుదంతంబును
వినిచెద సంక్షిప్తము గను విస్పష్టము గన్.

సీ॥ పంక్తిరథుం డనువశు ధేశచంద్రుండు
పాలించుఁ గోసలవసుధ నెమ్మి;
కౌసల్య కైక మాగధ యను మువ్వురు
భార్య లొప్పును రా నృపాలమణికి;

జ్యేష్ఠుండు సద్గుణశ్రేష్ఠుఁ డితఁడు రాముఁ;
డగ్రపత్నీపుత్త్రుఁ డగుటఁజేసి
పట్టంబుఁ గట్ట భూపాలుండు చింతింపఁ
గైక యాత్మజు రాజు గా నొనర్ప,

తే॥గీ॥ వనములందుఁ జతుర్దశాబ్దములు తిరుగ
రాము సంపఁగఁ గోరె వరద్వయమ్ము;
ననుఁగు భార్యయుఁ దమ్ముఁడ నైననేను
దోడరా వనభూమి కితఁడు వచ్చి.

ఉ॥ పంచవటిన్ వసింప రఘువర్యసతీమణిఁ గొంచుఁ బోయె న
క్తంచరవల్లభుండు దశకంఠుఁడు; దైత్యనివాసముం గనన్,
జంచలనేత్రఁ గైకొన, నిశాచరవల్లభు సంహరింప, ని
ర్వంచనవిక్రమస్ఫురణ వైరులఁ ద్రుంపఁగ నెంచుఁ గావునన్.

కం॥ మిత్రతనూజునితోడన్
మైత్రీసౌఖ్యమ్ము నొంద మది నూహించున్
మిత్రకులాగ్రణి; మారుత
పుత్త్రా! నీ రాక మాకు ముద మెదఁ గొల్పున్.

తే॥గీ॥ అనెడిసౌమిత్రిపల్కుల కలరి హనుమ
స్వర్ణగిరిశృంగతుల్యభుజద్వయమునఁ
జండకరకులవరులఁ గూర్చుండఁ జేసి
తామరసమిత్రకుముద బాంధవులయట్లు.

తే॥గీ॥ ఋశ్యమూకాద్రిశృంగంబు నెక్కి సూర్య
తనయుసన్నిధి నిల్పి యుదారఫణితి
"రామలక్ష్మణు లనువీరు రాచవారు
వీరవర్యులు నీమైత్రిఁ గోరువారు.

మ॥ అలనాఁ డాకలహంసయానఁ గొని దేవారాతి యాకాశమం
డలమధ్యంబునఁ బాఱఁ జూడమె నితాంతక్లిన్న యాసాధ్వి యీ
జలజాతప్రియవంశ్యభార్య ; జనకాజ్ఞన్ దండకారణ్య భూ
ముల నిల్వన్ దశకంఠుఁ డమ్మహిజఁ గొంపోయెన్ వృథా వైరియై.

తే॥గీ॥ పగతుఁ బొరిగొని నిజధర్మపత్నిఁ బడయ
నెయ్యమును గోరు శాత్రవాజయ్యుఁ డితఁడు ;
తేని సాహాయ్యమునఁ బొంద రాని దున్నె ?
స్వప్రియావాప్తిఁ గను మన్నుఁ బలికె నతఁడు.

— రామ సుగ్రీవ మైత్రి —

మ॥ ఇనవంశోత్తమ ! నేను నీ వలెఁ బ్రియాహీనుండ ; మా యన్న వా
లి నను న్దోలి మదీయభార్యఁ గొనె ; వాలిం గెల్చి మత్కాంతఁ జే
కొన నూహింతును ; నీదునెయ్యమున నాకున్ సాధ్య మౌ నిద్ది ; రా
వణు నిర్జింప, భవత్సతిం బడయ సంపాదింతు సాహాయ్యమున్.

కం॥ సమదుఃఖయుతుల మగుటన్
దమితో నెయ్యం బొనర్పఁ దగు నని పలుకన్
సమయజ్ఞుఁ డై సమారుతి
సమకూర్చెన్ వహ్నితోడ శాశ్వతమైత్రిన్.

తే॥గీ॥ వహ్నిసాక్షికముగ మైత్రిఁ బడసి వారు
కాంక్షితార్థము లొందినకరణిఁ దనిసి
రరిజయాపేక్షఁ గొనువీరవరుల కాది
బలవదుత్తమమైత్రి శుభప్రదమ్ము.

ఉ॥ జానకి మింటినుండి పడఁ జార్చిన సొమ్ములమూట నల్ల నా
భానుసుతుండు రామపదపంకజసన్నిధి నిల్పఁ జూచి "చం
ద్రాననవేసినసొమ్ము లివి యాజనకాత్మజఁ బాసి యిట్లు మం
దానిలశీర్ణకల్పకలతాంతములట్లు వితాకు గొల్పెదున్.

సీ॥ లలితమృణాళమాంసలబాహులతికల
విలసిల్లుకంకణద్వితయ మిద్ది;
ఆపీనకుచమండలాలంబమానము
క్తారత్నమయచంద్రహార మిద్ది;
గురునితంబాభోగపరిధానవిన్యస్త
రత్నోజ్జ్వలస్వర్ణరశన యిద్ది;
శతపత్రకులజైత్రచరణాగ్రసంలగ్న
చిత్రసౌవర్ణమంజీర మిద్ది;

తే॥గీ॥ శ్రవణయుగరమ్యరత్నభూషణము లివ్వి;
ముగ్ధహస్తాంగుళీహైమముద్రిక లివి,
కలికి పరిధానకౌశేయఖండ మిద్ది
యరయుదే లక్ష్మణా! యన్న ననియె నతఁడు.

చం॥ ఎఱుఁగను కంకణద్వితయ మెన్నఁడుగాంచను కంఠహార మే
నెఱుఁగను రత్నమేఖల మహీజపదంబుల మ్రొక్కువేళ నే
నరయుదు నిచ్చలుఁ మణిగణాంచితనూపురయుగ్మ మద్దియే
ధరణివరాగ్రగణ్య! వసుధాసుతభూషణరాజి యిద్ది యా.

కం॥ ఈవిధి వెతఁ గుందఁగ, సు
గ్రీవుం డను రాముతోడ రిపుభంజన! సీ
తావృత్త మరసి నంతట
రావణుఁ బొలియించు టరుదె రణమున నీకుఁ.

ఉ॥ దైన్యము దక్కు; శోకమును దగ్గఱనీయకు; ధైర్య మూను, సా
మాన్యులయట్లు బన్నముల గ్రమ్మి యధీరతఁ గ్రుంగఁబోకు; నా
దైన్యము చెప్పఁ దీరునె? వృథా కుపితాత్ముకుఁ డౌచు వాలి సౌ
జన్యముఁ బాసి భార్యఁ గొని చంపఁ దలంచును ధర్మదూరుఁ డై.

సీ॥ దుందుభి యనునొక్క దోషాచరుఁడు కాస
రాకారమున విజయార్థి యగుచు,
వాలితోఁ బోరాడి పంచత్వ మందెను
వానికాయము లీల వాలిఁ జిమ్మ,
యోజనదూరాశ్రమోపాంతమునఁ బడ
శాపమిచ్చె మతంగసంయమీంద్రుఁ
"డిచ్చోట వాలి కా లిడినఁ జచ్చు"నటంచుఁ
జొరఁడు శాపార్తి నిచ్చోటు వాలి,

తే॥గీ॥ కాన నిట నిల్చి యాప్తవర్గములతోడ
శత్రునిర్మూలనక్రియోత్సాహి నగుచు
నాప్తమంత్రిసుహృల్లోక మనువుపఱచి
వైరనిర్యాతనైకతత్పరత నందు.

కం॥ అనినన్ వాలికి నీయెడఁ
గనలు జనింపంగ నెద్ది కారణ మన న
య్యినసుతుఁడు దెల్పెఁ ; దొలి మయ
తనయుఁడు మాయావి బాహుదర్పోద్ధతుఁ డై.

తే॥గీ॥ తమ్ముఁ జంపిన వైరంబు దలఁచి యింద్ర
తనయుఁ బరిమార్పఁ నెంచి యుద్ధంబు చేయఁ
గృత వినిశ్చయబుద్ధి కిష్కింధఁ జేరి
పిలిచె ; వాలియు నడిచె నే వెంట నరుగ.

కం॥ మా యిరువురఁ గని భీతిలి
మాయావియుఁ బఱచి యొక్కమహీభృద్గుహకున్
బోయిన వానిపిఱుందను
మా యన్నయుఁ జనుచు నన్నుమార్గముఁగావన్,

శా॥ ద్వారోపాంతమునందు నిల్పె; నఁట నే నట్లుంటి నొ క్కెడ సృ
గ్ధారల్ నుర్వులు గట్టిపాతెను గుహాంతర్భూమి పైకొంచుఁ ; ద
ద్వారారాతి వధించి వాలి యట కేతేకున్కిఁ దద్దైత్యదు
ర్వారప్రోద్ధతబాహువీర్యవిగతప్రాణుం డటం చెంచుచున్.

తే॥గీ॥ పగతుభయమునఁ దద్గుహాద్వారభూమి
గండశిల యొండు నడ్డంబు గాఁగ నిల్పి
భ్రాతృదుఃఖంబుతో శత్రుభీతిఁ గలఁచఁ
జిన్నవోవుచుఁ గిష్కింధఁ జేరి తల్ల.

తే॥గీ॥ ఆప్తులకుఁ దెల్పి తత్కృతప్రార్థనమున
రాజ్యభారంబు నూనితి రామచంద్ర!
వాలి యాలోనఁ గ్రోధాగ్నికీలఁ బోలి
వచ్చి సంతప్తుఁజేసి నన్ బరిభవించి.

ఉ॥ బంటుతనంబునన్ దనుజవల్లభుతో బవరం బొనర్ప నే
నుంటి గుహాంతరంబున; మహోన్నతగండశిలన్ గుహాముఖం
బంటఁగఁగప్పి వచ్చి సుఖ మందెదు నీతఁడు; ఖ్యాతి యగ్ని నా
నంటకు తారకాణ మితఁ డాగద యం చరుణాక్షియుగ్ముఁ డై.

కం॥ పురి వెడలఁ ద్రొబ్బి మత్ప్రియ
తరుణిం జెఱఁబట్టి మంత్రితల్లజులను దాఁ
బారిపుచ్చి కారఁ ద్రోసెను
దఱి వేచి వధింప వెంటఁ దఱుము నఁటన్నన్.

ఉ॥ వాలి వధించి నీ కఖిలవానరరాజ్యము గూర్తునంచుఁ దాఁ
గేల శరాగ్ర మంటి యెలుఁగించి ప్రతిజ్ఞ యొనర్చె రామభూ
పాలుఁ డవంధ్యకోపుఁడు; నృపాలుని వీర్యము శంకచేయుచున్
నేలను గాలిప్రేళ్లఁ గపినేతయు రాయఁగఁ జూచి ధీరతన్.

శా॥ వాలిం ద్రుంచుట యెంతదొడ్డ యని తోఁపన్ సప్తసాలంబులన్
హేలం గోలనుగూల్చి, ద్రుంచి యిటు దైత్యేంద్రున్ దదీయాంగమున్
వ్యాళగ్రాసముగాఁగ నైతు ననఁ బాదాంగుష్ఠమాత్రంబునన్
లీలన్ దుందుభిదైత్యదేహమును దూలించెన్ దశక్రోశమున్.

తే॥గీ॥ విశ్వసించెను జగదేకవీరుఁ డైన
రాము భుజశక్తి కపియు; సరాతి గెల్వఁ
జిత్త ముత్తలపడఁగఁ గిష్కింధఁ జేరి
యశనిసమఘోషమున వాలి ననికిఁ జీరె.

మ॥ దివిజాధీశసుతుండు, భానుసుత క్రుద్ధప్రోగ్రదిక్కుంభినీ
శ్రవణద్వంద్వవిదారకైకపటుగర్జామేదురాహూతి నా
హవరంగోచితవేషుఁ డై కదిసె మత్తానేకపవ్యాఘ్రహాసం
భవఘీంకారములన్ మృగేంద్రమతిక్రోపస్ఫూర్తి పైఁ బడ్డటుల్.

ఉ॥ మదగజయుగ్మమ ట్లెదిరి మార్కొని యొండొరుతోడఁ బోర దు
ర్మదు లగువానరోత్తముల రాజితశౌర్యము విక్రమంబు తత్
పదములు మోపులున్ గతులు పల్కులతీరు నొకేవిధంబుగాఁ
బొదవిన శత్రుమిత్రులను బోల్పఁగ నేరకె రాముఁ డత్తఱిన్.

తే॥గీ॥ శరము విడువక మిన్నకె యరయుచుండె;
వాలిపీడితుఁ డై యంత భానుసూతి
జన్యమున నిల్వ నోప కుత్సాహ మెడలి
ప్రాణభయమున ఋష్యమూకాద్రిఁ జేరె.

క॥ జితకాశి యగుచు వాసవ
సుతుఁడున్ గిష్కింధఁ జేరె; సూర్యతనూజుం
డతిదుఃఖవివశుఁ డై భూ
పతిఁ గాంచఁగ లేక సిగ్గువడె నతిముఖుఁ డై.

ఉ॥ విన్నదనంబు జూచి రఘువీరుఁడు పల్కెఁ "గపీశ ! నీవు మీ
యన్నయు సంగరంబున సమాకృతి నుంట శరంబు నేయఁ; గా
కున్న ఖరాదిదైత్యకుల మొంచిన యాశుగ మింద్రసూతి సం
పన్నకవోష్ణశోణితము పారణ సేయదె యొక్కుమ్రేల్మిడిన్.

సీ॥ గజపుష్పవల్లి కాగ్రైవేయకముఁ దాల్చి
పో రొనర్పుము శక్రపుత్రుతోడఁ;
గంఠమాలిక నభిజ్ఞానంబుగాఁ గొని
భేదమెఱింగి సహోదరులకు,
నిర్ఘాతఘోర మన్నిశితాశుగంబున
వాలిఁ ద్రుంతును వృత్రు వజ్రి మాడ్కి,
సత్యంబు నామాట చంద్రసూర్యాదుల
గతులు దప్పిన నమ్ముగాదు నమ్మ,

తే॥గీ॥ మనుచు నాశ్వాసపఱిచి యామనుకులుండు
ధనువు మార్గణమును గేలఁ దాల్చి నిల్చి
లక్ష్మణుఁడు గజపుష్పి నలంకరింపఁ
బోరి కంపెను సుగ్రీవుఁ బూన్చి మరల.

శా॥ కాలాంభోధరగర్జ వోల్కి, నిభఘీంకారాకృతిన్, వార్ధి క
ల్లోలధ్వానముభాతి, మృత్యువికటోల్లోలాట్టహాసంబటుల్
నీలగ్రీవకఠోరహుంకృతిగతి న్భీమస్వనం బొప్పఁగా
వాలిం జీరె రణార్థమై యవని కంపంబొంద సుగ్రీవుఁడున్.

కం॥ "అఱచచ్చి పఱచి గిరి కే
డ్తెఱ నిటు మఱి పిల్చువీనిఁ దేకువ సెడ ని
ష్ఠుర ముష్టిహతులఁ దేజో
విరహితుఁగాఁ జేసి చంపి విడిచెదఁ గనలున్."

చం॥ అని యని కేఁగఁబూను దివిజాధిపసూతికిఁ దార యిట్లనున్,
"వినరా! ధనుర్ధరాగ్రణులు విక్రమసింహులు రామలక్ష్మణుల్
చనువున నర్కసూతికి వశంవదు లై మిము నొంప బాసలై
వెనుకొని పోరి కంపెదరు; విక్రమ మెల్లెడఁ జెల్లనేర్చునే?

కం॥ పగ మేలె యనుజుతోడన్?
దగునే దండంపుఁ బరుసఁదన మీకరణిన్
వగ పుట్టకున్నె? పగచేఁ
బగఁ దీరునె? పోరితములఁ బాయదె సిరియున్".

ఉ॥ నావుడు తారతోడఁ గపినాథుఁడు పల్కెను "పోరి కేఁగి సు
గ్రీవుని నోటఁబుచ్చి ధృతిఁ గీడ్వడఁ ద్రోలి జయంబుఁ గాంచెదన్
లావున సర్వదిక్పతికులంబుల నొంచితి; నేల భీతిలన్
జేవఁ దొఱంగి పోరి కిటు జీరఁ దొలంగుట వీరధర్మమే?

కం॥ మనువంశ్యు లేల నన్నుం
జెనకెద రెగ్గింత యైనఁ జేయ; నధర్మం
బొనరింతురె? కృతబుద్ధులు
జనపాలురు ధర్మనీతిసన్నుతచరితుల్.

తే॥గీ॥ భయము వల" దంచుఁ దార నాశ్వాసపఱిచి
కౌఁగిటంగ్రుచ్చి యంగదు గారవించి
శతమఖసమాత్తపుష్కరస్రజముఁ దాల్చి
బవరమున కేఁగెఁ గపి సార్వభౌముఁ డంత.

తే॥గీ॥ ఒండొరులఁ జూచునంతట నొక్కమాఱు
వెలికి నుప్పొంగుఁ దమలోని బిట్టుపగలఁ
గన్నుగానక మడియింపఁ గడఁది కడక
లడర నొండొరుఁ గదిసిరి యని యొనర్ప.

మ॥ కులశైలద్వయరీతి సాంద్రమదదిక్కుంభీంద్రయుగ్మంబు నా
జలదద్వంద్వముపోల్కి దండధరదంష్ట్రాఘట్టనప్రక్రియన్
జలజాప్తప్రియసూతి, వాలియు బలోత్సాహంబులం బోరువోఁ
గులశైలంబులు కంప మొందె జలధుల్ ఘూర్ణిల్లె భీమంబుగాన్.

కం॥ పిడికిటఁ బొడుచుచు నడచుచుఁ
నెడనెడఁ బైకొనుచుఁ దాల్ము లెడలించుచుఁ జే
బడఁ గడఁక నొడిసి యడుచుచుఁ
గడు బెడిదము గాఁగఁ బోరఁ గడగిరి వారల్.

తే॥గీ॥ జన్య మొనరించు తత్కపీశ్వరులఁ గాంచి
కంఠమాలలఁ దద్భేదకలనఁ దెలిసి
కపికులేశ్వరుఁ జంప రాఘవుఁడు వజ్ర
సారఘోరాశుగమ్ము హస్తమునఁ దాల్చె.

కం॥ డాక న్నదరెను సీతా
నాకాధిపసూతి రావణాసురులకు ని
క్ష్వాకుకులుం డిట వింటన్
గాకోదరఘోరసాయకము సంధింపన్.

తే॥గీ॥ గుడుసునడ విల్లు చెవిదాఁక నొడిసి తివిచి
నారి సారించి శితమార్గణమ్ము దొడిగి
వాలిహృదయమ్ము గుఱిచూచి వైచె నంత
వజ్రధరుఁ డద్రిపై వైచువజ్ర మనఁగ.

ఉ॥ క్రౌంచమహీధరోదరము స్కందధనుర్గుణముక్తతీక్ష్ణ పుం
ఖాంచితమార్గణక్షతి మహాధ్వనితోడ విశీర్ణ మైనటుల్
ప్రాంచితరామసాయక విపాటితబంధురమర్మభాగుఁ డై
కౌంచక భూమిఁ ద్రెల్లెఁ గపికుంజరుఁ డమ్మహి కంప మొందఁగా.

తే॥గీ॥ స్నిగ్ధహేమైకకిరణావశేషుఁ డగుచు
మదంగతి వార్ధిఁ బడునంశుమాలిఁ బోలి
రామమార్గణవిద్ధుఁ డై భూమిఁ ద్రెళ్లి
వాలి యస్తాభిముఖుఁ డయ్యె జాలిఁ దూలి.

సీ॥ కులిశధారాహతిఁ గుంఠితపక్షుఁ డై
ధరఁ ద్రావు హేమభూధర మనంగఁ,
గాలసంగతి నస్తగహ్వరంబునఁ ద్రెళ్లి
కాంతిఁ బాయుసహస్రకరుఁ డనంగ,
నింద్రకోపాగ్నిచే నిలఁ గూలి చెలువేదు
వీతసత్త్వుండౌ యయాతి యనఁగఁ,
గుంభసంభవఘోరకోపకీలలఁ గ్రాఁగి
మహికిఁ దొఱంగిన నహుషుఁ డనఁగ,

తే॥గీ॥ ధరణిపైఁ బడి యల్ల చైతన్య మెడలి
ధూళిధూసర గాత్రుఁ డై వాలి యొప్పె
భస్మసంఛన్ను డైనట్టి జ్వలనుఁ డనఁగ
శాంత దయనీయరూపుఁ డై కాంతిఁ బాసి.

తే॥గీ॥ కొంతవడి కెట్లొ తెలిసి భూకాంతుఁ జూచి
నెగులు మదిలోనఁ గార్కొన నిల్పలేక
పరుసములు పల్కఁ దొడఁగె ; నెప్పగిది రోష
కలుషితస్వాంతులకుఁ బాడి తెలియ నగునె ?

శా॥ "రామా ! నన్నిటు లేలఁ గూల్చితివి ? నీ రాజ్యంబు చేకొంటినే ?
భామారత్నము సీత దొంగిలితినే ? వైరంబుతో నుంటినే ?
దీమంబొడ్డి మృగంబు నేయుగతి నాదిత్యాత్మజున్ బంపి, త
త్తేమార్థం బిటు పొంచి యేసితి ; ధరిత్రీపాల ! ధర్మంబొకో !

కం॥ నను జేర నొక్కఁ డేల్మిడి
దనుజాధిపుఁ గట్టి తెచ్చి త్వత్పదములపై
నునుపనె? జనకజఁ దేనె?
యినపుత్రుని గూడి తేల? యెఱుఁగవొ నన్నున్".

ఉ॥ నావుడు వాలితోడ నరనాథుఁడు పల్కు "మహేంద్రపుత్త్ర! నీ
చేన నెఱుంగ నెట్టు? కులశీలము లొల్లక పాడిఁ దప్పి సు
గ్రీవునిభార్యఁ బట్టితివి; కేవలపాతక మిద్ది గాదె! యిం
కీవిధి దుష్టశిక్షణ మ దెట్టుల ధర్మవిరుద్ధ మై తగున్?

కం॥ ధర ననుజభార్యఁ బట్టిన
మరణాంతకశిక్ష యొకటె మనుసమ్మతమై
యిరవొందుఁ గాన నీ వీ
దురితమ్ము తొలంగ శిక్ష దొరయుట యరుదే?

తే॥గీ॥ ధర్మబాహ్యప్రవర్తన దండ్యు లగుట
రక్కసులతోడు నీవు నా కొక్కరూప!
దోసఁగు గాకున్న నీ మైత్రిఁ దొడరి యుంట;
మహి ననన్యాశ్రయులు గారె మనుజపతులు.

తే॥గీ॥ హేమదోషంబు గాల్ప శమించునట్లు
రాజదండనమున నఘరాజి వాయు;
కాన సద్గతి యగు నీకుఁ గపికులేంద్ర!"
యనుచు నాశ్వాసపఱిచె నింద్రాత్మజాతు.

ఉ॥ వాలి నృపాలబాణహతి వ్రాలుట కర్ణయుగంబు సోఁకి, తా
రాలలితాంగి మూర్ఛపడి రామునిచేతకు నొచ్చి యంగదున్
గేలఁ దమల్చి గ్రుచ్చి కడుగీడ్పడి కుందుచుఁ గంట నశ్రువుల్
కాలువ లొచుఁ బాఱఁ గపికాంతునిచెంగటి కేఁగె దీన యై.

సీ॥ గట్టుపైఁ జేరాడు కాఱుమబ్బును బోలి
కటిసీమ వేనలి క్రమ్ముకొనఁగఁ
జనుగట్టు ప్రేగునఁ జలియించు మెయి దీవ
తళుకులీనుచు మించుబెళుకుఁ జూప,
వలుదపాలిండ్లపైఁ బట్టుపయ్యెదకొంగు
జారి నేలఁ దొఱంగి జాలిఁ గొలుప,
గండుమీలనుఁబోలుకందోయి వెలువడి
కన్నీటి తరఁగలు కాల్వగట్ట,

తే॥గీ॥ విడుచునిట్టూర్పుగాడ్పులవేఁడి సోఁకి
పగడపుంగెంపువాతెఱ వాడువాఱ
మూర్తిఁ దాల్చిన శోకంపుటార్తి నాఁగఁ
దార యేతెంచె నా శక్రతనయుఁ జేర.

చం॥ ఖరతరసింహతీక్ష్ణనఖఖండితమస్తకమై ధరాతలిన్
దొరలినమత్తహస్తిగతి ధూళిఁ దొఱంగినవాలి, సింహవి
స్ఫురణను భీతి గొల్పు రఘుపుంగవుఁ గాంచుచు, శోకమగ్నయై
చరణయుగంబుపైఁ బడి విశాంపతి నొవ్వఁగ నాడె నీక్రియన్.

మ॥ "జలదశ్యామలకోమలాంగ! కరుణాసాంద్రుండ వి వ్వాలిపై
గులిశాఘాతకఠోరకాండము నతిక్రూరమ్ముగా నేయుటన్
జలువం జిందెడినీలనీరదము గర్జాభీమమై భీకరో
జ్జ్వలదంభోళిని వైచినట్లుగ మనస్తాపంబు సంధిల్లెడున్.

తే॥గీ॥ అశనిపాతంబునన్ భూరుహంబు ద్రెళ్లఁ
దోడ సంశ్రిత లత నేలఁ దొఱఁగ కున్నె?
వాలి త్వద్బాణహతి నేలఁ గూలియుండ
యతనియర్ధాంగి యిటు నిల్చు టరుదు గాదె!

చ॥ ఎటుఁగవా ? వేఁటపాడి మనుజేశ ! కపీశుని నేలఁగూల్చి, త
త్తరుణిని వీఁడు ఔంతయు నధర్మము ; గువ్వలజంట నొక్కెడన్
బొరిగొనుబోయయేని ; విడఁబోఁ దొకదానిని ; గూర్మిబిత్తరిన్
దొలఁగి తపించునీమదికిఁ దోఁపదె నెయ్యునిఁ బాయు నా వెతల్.

తే॥గీ॥ అనుచు నగ్గాడు తార వారణ మొనర్చి,
కొమరు సంగదుఁ గౌఁగిటఁ గ్రుచ్చి యెత్తి,
రాఘవునితోడ సత్రువుల్ గ్రమ్ముకొనఁగ
నీతులుంగునఁ బల్కెఁ గపీంద్రుఁ డిట్లు.

ఉ॥ "చిన్న యితండు, మత్సముఁడు, పెద్ద బలంబున, సౌకుమార్య సం
పన్నుఁడు నిన్ను గొల్చు ; జనవర్య ! దయం గని నా కుమారు నీ
చిన్ని నిసుంగుఁ గావు ; కులశేఖరుఁ డితఁడు లంక గెల్చుచో
నెన్నఁగ వచ్చు నర్కజున కేడ్తెఱ సాటి యనంగ మేటియై.

క॥ అని యప్పగించి సుగ్రీ
వుని మెడఁ గై సేసి హేమపుష్కరమాలన్
"దనువుఁ దొలంగెద ననుజా !
కను దయ నంగద కుమారుఁ గాంతన్ దారన్."

తే॥గీ॥ అని ప్రశాంతాత్ముఁ డై వాలి యల్ల వ్రాలి
యలుఁగుఁ బుచ్చంగ నినకులతిలకుఁ గోరె ;
శల్యముఁ దొలంగఁ జేసె నా జనవరుండు
ప్రాణముల వీడె నాకపివల్లభుండు.

ఉ॥ హా ! కపిసార్వభౌమ ! దరహాస వినిర్జితదృప్తదైత్య ! బం
దీకృతపంక్తికంధర ! సుధీజనమాన్య ! బలారితుల్య ! భ
స్మీకృతసర్వశాత్రవ ! వశీకృత సర్వదిగంతపాల ! యి
క్ష్వాకుకులేశబాణహతిఁ గాంచితె యీగతి ఘోరమృత్యువున్.

తే॥గీ॥ అనుచుఁ దారాంగదులు దుఃఖమునను నేల
దొరలి వాపోవఁ దరుచరవరులు గుంద
భ్రాతృమృతి దుఃఖవివశుఁ డై భానుసుతుఁడు
ప్రేతకార్యముఁ దీర్చె నా నృపతియాజ్ఞ.

ఉ॥ శ్రీరఘురాము నాజ్ఞ కపిశేఖరు వానరరాజ్యమందు జం
భారి గురుండు నాకమున నట్లభిషిక్తు నొనర్చె లక్ష్మణుం ;
డారవిపుత్త్రుఁ డమ్మనుకులాధిపుఁ డంపఁ బురమ్ముఁ జేరె ! సీ
తారమణీమనోహరుఁడు తమ్మునితోడ వసించె నవ్వనిన్.

## శ్రీరాముఁడు వర్షాకాలమున మాల్యవంతమున నుండుట

సీ॥ నీలనీరదఘటానీరంధ్రగగనంబు
విద్యుత్ప్రభానష్టవీక్షణంబు,
వజ్రనిష్ఠురపాతభగ్నదిక్చక్రంబు,
శక్రగోపోజ్జ్వలత్క్ష్మాతలంబు,
బర్హిబర్హప్రభాభాసితారామంబు
బహుభేకముఖరితపల్వలంబు,
వారిధారాపూర్ణవసుమతీచక్రంబు
అధ్వావరోధనష్టార్యమంబు,

తే॥గీ॥ పథికమానసదుఃఖవివర్ధనంబు
ప్రణయకుపితాంగనాపతిప్రాపణంబు
కృశతరీభూతనదనదీబృంహణంబు
నైన వర్షాగమం బిల నవతరించె.

కం॥ కర్దమసంతమసావృత
దుర్దినముల భానుసంతతహీనాంశుం డం
తర్దహ్యమానుఁ డై యా
స్వర్ధావం డై సహించఁ దనంబున నొప్పెన్.

తే॥గీ॥ పుష్పితాపాండుకేతకీభూరుహంబు
ఫలితజంబూతరుశ్యామవనగణంబు
నైన వర్షాగమంబున భానువంశ్యుఁ
డనుజుతో మాల్యవద్గిరి నాశ్రయించె.

ఉ॥ అంబుదమాలికానిబిడితాంబరవీథి, నితంబినీ జనా
లంబనరాగవల్లరుల మ్లాన మొనర్చు వియోగజార్తి, దూ
రంబున నొంటి నుండుప్రియురాలిఁ దలంచి తలంకి రాముఁ డా
త్మం బుయిలోడి తమ్మునకుఁ దా నిటు పల్కెను దీనచిత్తుఁడై.

సీ॥ కొంగ్రొత్త జేడి వెల్లిగొల్పుఁ బల్వలరాజి
కలఁగి గుబాళించు కమ్మఁదావి,
అర పుట్టి కనవచ్చునకరువుల్ దొల్కాడ
విడిచి విప్పారని కడిమిపూలు,
పురివిప్పి నడయాడి పొలఁతినెమ్ములు మెచ్చ
నెలుగించు మగనెమ్మిపులుఁగు కేక,
కటిమొయిల్ కౌఁగిటఁ గఱఁగి లేనవ్వుల
మెఱుఁగు సూపెడి క్రొత్త మించు మెఱుఁగు,

తే॥గీ॥ లనుఁగు నెచ్చెలిఁ బాయు నా కనుల కెంతొ
వ్రేఁగుగాఁ దోఁచుఁ దమ్ముఁడా! బేల సీత
యెట్టు లీ వానప్రొద్దు సైరించు నొక్కొ!
యొక్కటితనంబు కంటె నిం కేది దొసఁగు?

తే॥గీ॥ ఇట్లు దురపిల్లి గంధ గజేంద్ర మట్లు
కొండ నెత్తమ్ములం దాఁచు క్రొత్తమొయిలు
గాంచి దైన్యంబునన్ వివేకంబుఁ దొఱఁగి
ప్రార్థనాపూర్వకంబుగఁ బల్కె నిట్లు.

మ॥ "జలదా! మత్పతి సీతఁ గాంచెదవొ! త త్సాధ్వీలలామంబు ముం
గల గర్జారభటీకఠోరత మెలంగన్ రాదుసూ! చంచలా
చలవిస్ఫూర్తుల సౌమ్యవర్తనల నాశ్వాసించి యా మీఁదటన్
దళదిందీవరగర్భసుందరతనూద్యత్కాంతిఁ జూపట్టుమా!

తే॥గీ॥ సీత విరహాగ్ని సెకల గాసిల్లు నేని
చలువ తొల్కాఱుచిన్కులఁ జల్లి తేర్పు
మసుర చేఁతకు నెడద దైన్యంబు గొన్న
నైంద్రచాపంబుఁ జూపి ధైర్యంబుఁ గొల్పు.

తే॥గీ॥ శక్రచాపంబుఁ బూను నిన్ సాధ్వి గాంచి
ధనువు భుజమునఁ దాల్చునన్ దలఁచి కొనుచు
ఱెప్పలార్పక కన్గవ విప్పువాఱఁ
గనుచు ముద మందు నొక్కింతగడువు జలద!"

చం॥ అని యనుజన్ముఁ జూచి యనుజా యిటుఁ జూచితె? మాల్యవంత మీ
ఘనజలసిక్తశృంగ మయి కానఁగ నొప్పెను సర్వవానరా
వని నభిషిక్తుఁ జేకమలబాంధవసూతిని బోలి నిర్ఝరీ
గణములు పుష్పదామముల కైవడి నెమ్మెయి నంటి పాఱఁగన్.

కం॥ తనసతితో రాజ్యంబును
గొని సుగ్రీవుం డొంది హర్షగురుసౌఖ్యంబుల్
జనకసుతాన్వేషణమున
కొనరుచు సాహాయ్య మనుచు నూరటఁ గనుచున్.

కం॥ భూకన్యా పుణ్యాపరీ
పాకంబున ననుఁగుఁదమ్ముపరిచర్యలచే
లోకోత్తరధైర్యంబునఁ
గాకుత్స్థుఁడు గడపె వానకాలము నెట్లో.

ఉ॥ రామకృపాకటాక్షమున రాజ్యముతో నిజభార్యఁ బొంది, సు
త్రామసమానభోగములఁ దాఁ దనివొందుచు భానుసూతి, సీ
తామదిరాక్షి యున్కిఁ గని దైత్యపతిన్ వధియించి, జానకీ
రాములఁ గూర్పకున్నఁ దన ప్రాభవ మే లని కుందు నేఁబవల్.

కం॥ ఈగనియ పైపై మదికిన్
వేఁగై చూపట్ట నద్దిఁ బిలువఁగ నంపెన్
సాగరహిమవద్గిరి భూ
భాగాంతరవాసు లైన వానరవరులన్.

సీ॥ నిర్వృష్టజలపూరనీరదంబులతోడ,
రమణీయవిమలాంబరంబుతోడఁ,
బరిశుష్కజంబాలపటలాధ్వములతోడ,
గుసుమితశరవణవసుధతోడ,
కల్హారకైరవకమలపంక్తులతోడఁ,
బ్రవిమలజలజాకరములతోడఁ,
ఆలోకరమ్యచంద్రాతపంబులతోడఁ,
దారకాదృశ్యరాత్రములతోడ,

తే॥గీ॥ జనకజాన్వేషణక్రియాసమయ మనుచు
రామసుగ్రీవులకుఁ దెల్పుక్రమముఁ దోపఁ
బుండరీకాతపత్రమై పొల్చె నంత
జైత్రయాత్రైకఫలశరత్సమయలక్ష్మి.

కం॥ శరదాగమ మైనను వా
నరనాథాగమము లేమి నరనాథుఁడు సో
దరు నంపె వాలిఁ జంపిన
శరశౌర్య మ్మెఱుఁగఁ జెప్పి చయ్యనఁ దేర్న్.

తే॥గీ॥ ధనువు తూణీర మూని లక్ష్మణుండు చనియె
చిత్రమందిరమైన కిష్కింధఁ జేరఁ
జకిత నయనాళితోఁ గరుచరులు చూచి
పఱచి వృక్షాగ్రముల కెగఁ బ్రాఁకి డాఁగ.

ఉ॥ వానరనాథునాజ్ఞఁ గపివర్యులు నాగసహస్రసద్బలుల్
భూనభ మేకవానరసమూహసమావృత మైనయట్లు రా,
సేనలఁ దీర్చి యల్లఁ గ్రమశిక్షణ మిచ్చుచు యూథనాయకుల్
దో నడువన్ బయల్వెడలెఁ దోయజబాంధవసూతి చెచ్చెరన్.

మ॥ కపిసైన్యంబును వానరాధిపుని మార్గంబందె యూహించి, హ
ర్ష పరిప్లావితచిత్తుఁడై యలసుమిత్రాసూతి శ్రీరామచం
ద్రపదాబ్జంబులచెంత కర్కసుతు సాంద్రప్రీతిఁ గొంపోవఁ, ద
త్కపిసేనాంబుధిఁ జూపి రామునకు నర్కప్రోద్భవుం డిట్లనెన్.

సీ॥ ఉదయాద్రిపృథుసానుసదనహారి యితండు,
పశ్చిమాచలగుహావాసి యితఁడు,
మలయపర్వతదరీమధ్యవర్తి యితండు,
పారియాత్రతటీవిహారుఁ డితఁడు,
వింధ్యభూధరశృంగవిహరణుం డీతండు,
గంధమాదనశైలగతుఁ డితండు,
ప్రాలేయగిరికందరస్థానుఁ డీతండు,
సహ్యపర్వతశిరస్సద్ముఁ డితఁడు,

తే॥గీ॥ పనస కేసరి గవయ గవాక్ష కుముద
తార నల నీల జాంబవ ద్గజ సుషేణ
శతబలి ద్వివిదమైందాదివితతబలులు
వానరుల టంచుఁ దెల్పి తద్బలము లెన్ని.

క॥ వానరులతోడ నిట్లనె
"నానావిధశైలభూవనౌకసులారా!
మానవనాథు కులాంగన
దానవపతి యపహరించెఁ; దగ మీ రెలమిన్.

చ॥ నలుదెసలం జరించి జననాథు ప్రియాంగనఁ గాంచి రావలెన్
నెల గడు వేఁగకుండ; గననేరక మాసము దాఁటి వచ్చినన్
దలఁ దెరిగింతు; సీతఁ గనుఁగొన్నవాఁడు మాకుఁ బ్రియంకరుండు; మీ
బలమును, బుద్ధి, పౌరుషము, భక్తిని జూపఁగ వేళ యియ్యదే!"

క॥ అని గౌరవపూర్వమ్ముగఁ
గని వారల కానవెట్టెఁ గపినేత; ప్రయో
జనవశమున నరపాలుర
కనుజీవులయెడను బ్రీతి యగ్గల మగుఁ గా.

ఉ॥ కొందఱఁ బూర్వదిక్కునకుఁ గొందఱ నిమ్ములఁ బశ్చిమాశకున్
గొందఱ నుత్తరంబునకుఁ గొందఱ దక్షిణభూమి కంపుచో
నందఱమధ్య రాముఁ డనిలాత్మజు మెచ్చి నిజాంగుళీయకం
బంది యొసంగి కాక మొకయుక్తి నొసంగిన గాథ దెల్పుచున్.

తే॥గీ॥ జానకి నెఱింగి యియ్యభిజ్ఞాన మిచ్చి
కుశల మెఱిఁగించి యూఱటఁ గొల్పు మనుచుఁ
బనిచె; రాఘవు విస్రంభపాత్రుఁ డైన
మారుతాత్మజు భాగ్య మేవారి కగును?

తే॥గీ॥ కపికులేశ్వరుచే ననుజ్ఞాతు లగుచు
జనకజాన్వేషణార్థమై సంచరించి
రఖిల దిక్కుల వానరు లార్తుఁ డైన
తరణికులుకృపాణమనోరథముల పోల్కి.

తే॥గీ॥ కొండదరులందు నడవులఁ గోనలందుఁ
బురములందును బల్లెల భూమితనయ
నరసి కానక నెలలోన మరలి చనిరి
ప్రాక్ప్రతీచ్యుత్తరాశల భ్రమయు వారు.

⇐ హనుమదాదులు దక్షిణమున కేగుట ⇒

మ॥ నలనీలాంగదజాంబవ ద్ద్వివిదమైందప్రముఖ్యుల మ్మారుతిన్
దలపూర్వం బలెఁ బట్టి దక్షిణదిశన్ ధాత్రీసుతన్ రోయుచున్
గలయంజూచుచుఁ బోయి వింధ్యశిఖరాగ్రం బెక్కియు న్నంతలో
నెలరోజుల్ గడ ముట్టె సీతఁ గనుచిన్నె ల్గోప వవ్వేళకున్.

తే॥గీ॥ దండధరతుల్యసుగ్రీవదండభీతిఁ
గపులు ప్రాయోపవిష్టులై కడకుఁ బ్రాణ
గతి నిరోధింప నిశ్చితమతుల నుండి
దర్భశయ్యలఁ బడి మదిఁ దలఁకుచుండ.

క॥ పక్ష విహీనుం డగునొక
పక్షీంద్రుఁడు నడచుకొండ వలె వానరులన్
భక్షింప రాఁగ నమరవి
పక్షుండను శంకఁ గపులు పలవించి రిటుల్.

సీ॥ ఇంతికి దశరథుం డేల వరము లిచ్చెఁ?
బనిచె రాఘవు నేల వనికిఁ గైక?
వనితతో వని కేల వచ్చెఁ గాకుత్థ్సుండు?
దశకంఠుఁ డేల సీతను హరించె?
నాయోధనమును జటాయు వే లొనరించెఁ?
బంక్తికంధరుఁ డేల పక్షిఁ జంపె?
మనువంశ్యసుగ్రీవమైత్రి యే లొనఁగూడె?
భానువంశ్యుం డేల వాలిఁ గూల్చె?

తే॥గీ॥ అర్కసుతుఁ డొక్క మాసమ్ము నవధిఁ బెట్టి
వానరుల సీత వెదుకంగఁ బంపె నేల ?
కపికులోత్తంసు లీవింధ్యకాననమున
దిక్కుచెడి చావ నిటు వ్రాసె నొక్కొ బ్రహ్మ!

తే॥గీ॥ అనుచు దురపిల్ల నప్పక్షి యవధరించి
పరమదుఃఖార్త మై యల్ల వారి కనియె ;
"నే యది నిమిత్త మొక్కొ జటాయు మృతిక
విశదముగఁ దెల్పుఁ డనఁ గపివీరు లనిరి.

ఉ॥ రాముఁడు భార్యతోడ వనరాజి వసింపఁగ, దైత్యరాజు త
ద్భామ బలాత్కృతిం గొని నభంబునఁ బోవఁగఁ గావ వేడె నా
కామిని ; తా జటాయువు మగంటిమి మీఱఁగఁ బోరి దైత్యుతో
రామహితార్థ మై మెయిఁ దొఱంగి దివంబును జొచ్చె ధన్యతన్.

తే॥గీ॥ అనఁగ సంపాతి యను నవ్విహంగమంబు
తమ్ముఁ డైన జటాయువు ; తనువు దొఱఁగఁ
దర్పణాంజలు లీ నబ్ధి దరికిఁ జేర్ప
వానరులఁ గోరెఁ బక్షముల్ సాయ కిలన.

చ॥ తరుచరు లా ఖగేంద్రు దయఁ దాల్చి సముద్రము నొద్దుఁ జేర్ప సం
తరణ మొనర్చి క్రుంకి జలతర్పణ మిచ్చి ప్రరూఢపక్షు మై
పరమవిషాద మంది కపివర్యులతో మును దాను నెమ్మి సో
దరుని జటాయుఁ గావ నినతాపహతం బగు టెల్లఁ దెల్పుచున్.

ఉ॥ "రామచరిత్రఁ గ్రోల నచిరంబుగ ఱెక్కలు వెండి వచ్చె ; ను
ద్దామబలుండు రావణుఁడు దాశరథిప్రియఁ దెచ్చి లంక నా
రామమునందు దాఁచె ! జలరాశి తరింపఁగఁ జాల నేను ; మీ
రా మహిజాతఁ గాంచుఁడు ; మహా బలతుల్యులు మీ కసాధ్యమే."

తే॥గీ॥ గ్రద్ద నేఁటను దూరమ్ము గాంచఁ గలను
సుదతి గనవచ్చు నదిగో యశోకవనిక
రాక్షసీగణయుత యౌ నను రమణి యుండెఁ
గనుఁ డనుచు దెల్పి సంపాతి చనె యథేచ్ఛ.

⇐ అంగదాదులు లంక కేఁగు విరు నరయుట ⇒

ఉ॥ అంతట నంగద ప్రముఖు లంబుధి దాఁటి మహీజుఁ గాంచు ధీ
మంతు నెఱుంగఁ గోర, బలమాన్యులు వానరు లాత్మశక్తు ల
త్యంత ముదావహంబుగ దశాధికయోజనవృద్ధితో నన
త్యంతముగాఁగ దెల్పిరి రయాధికు లా పయి లేమి నల్లనన్.

తే॥గీ॥ తాను యంగదుఁ డవ్వలి దరికిఁబోయి
సీతఁ గని రాఁ దలంచిన "సీతిగాదు
ప్రభువు దాత్యమ్ము నెఱపుట; వల దటంచు
వారణ మొనర్చి యిటు జాంబవంతుఁ డనియె.

మ॥ బలిరాజ్యాహరణార్థమై హరియు విశ్వవ్యాప్తిఁ బెంపొంద, న
జ్జలజాతాక్షుపదాంబుజద్వయము నుత్సాహంబుతో ముమ్మఱుల్
వలగొంటిన్ బల గౌరవంబున యువప్రాయంబునన్ దొల్లి; నే
డలసం బై వశ మేదె మేను జరచే నాశక్తి లే దిప్డన్.

తే॥గీ॥ కాన నే వార్థి దాటంగ లేను గాని,
వార్థి లంఘించి జానకీవార్తఁ దెచ్చు
వీరుఁ బేర్కొందు నిలువుఁడీ మీర లనుచు
వాయుతనయునికడ కేగి పల్కె నిట్లు.

ఉ॥ "ఇంత కలంత నొందఁ గపు లెల్లరు మిన్నక యుందువే హనూ
మంత! మరుత్తనూజుఁడవు మారుతతుల్యరయుండ వీ యుద
న్వంతము దాటఁ జాలవా? జవంబున బుద్ధివిశేషమందు నీ
యంతటి వాఁడెవండు? పవనాత్మజ! నీకు నసాధ్య మున్న దే?

సీ॥ దోర్దర్పం డనుచింతఁ దోయజాప్తుని బట్టు
చిఱుతలేఁ బ్రాయంపుఁ జురుకుఁదనము,
పూర్వాపరాద్రిభూముల నిల్చి మెయి వెంచి
యరుణాంశు శుశ్రూష నెఱపు నేర్పు,
పద్మాప్తుచే నవవ్యాకరణమ్ములఁ
బరిపూర్ణముగ నేర్చుపాటవమ్ము,
బ్రహ్మాస్త్రమునకైనఁ బట్టుపడక నిల్చి
పరబలం బెఱియించుపౌరుషమ్ము,

తే॥గీ॥ వజ్రహతి కైనఁ దలఁగని పాటవమ్ము,
సకల భువనమ్ములను నోర్చుసాహసమ్ము,
నియ్యెడనె కుంటువడెనె? మహీజఁ గాంచి
వానరేక్ష్వాకువరులఁ గాపాడు మనఘ.

ఉ॥ భూనభ మొంటికేల గొని పువ్వులబంతి యనంగ లీలమై
వానరవర్య! చిమ్మెదవు; వార్ధి తరింతువు గోష్పదంబటుల్
జానకి గూర్చి లంక సురశత్రువుతోఁ గొనివత్తు వోజగ
త్ప్రాణతనూజ! వానరుల ప్రాణము గావక మిన్నకుందువే?"

<= హనుమంతుఁడు లంకకేఁగ నంగీకరించుట =>

క॥ అని జాంబవంతుఁ డాడిన
సనయోక్తుల వాయుసూతి సంతుష్టుండై
"యనఘా! దాఁటెద శతయో
జనవిస్తారాంబురాశి; జానకిఁ దెత్తున్.

తే॥గీ॥ జనకసుతఁ గాంచనేని నిజవముతోడ
నఖిలలోకాంతరంబుల నరసి వత్తు;
బంక్తికంధరు లంకతోఁ బట్టి తెచ్చి
రామ పదపంకజద్వయాగ్రమున వైతు.

చం॥ అని పలుకంగ, వాయుసుతు నంగదముఖ్యులు మెచ్చి యుబ్బుచున్
వననిధి దాఁట సంబరముప్పై కెగురం దగు నిమ్మ లెన్నుచున్
గనిరి మహేంద్రపర్వతము గంధగజేంద్రవిహారరమ్యమున్
వనతరుపుష్పగంధభరవాసితసర్వదిగంతరాళమున్.

తే॥గీ॥ ప్రియముఁ దళుకొత్త నున్నతగ్రీవ మగుచు
శాద్వలంబునఁ దిరుగువృషంబు భాతి
మారుతాత్మజుఁ డఁటునఁటు మసలెఁ గొంతఁ
బొలయు వలిగాలి కంగంబు పులక లెత్త.

కం॥ ఈకరణిఁ గవలు కిష్కిం
ధాకాండకథావిధంబుఁ దగఁ జేర్కొనఁగన్
గాకుత్స్థకులుఁడు పేర్కొనె
వాకొనుఁ డామీఁది కథను భవ్య లటంచున్.

చం॥ పరహితకార్యతత్పర ! యపారకృపాపర ! దీనవత్సలా !
నరనుత పుణ్యకీర్తి ! బుధనందిత ధర్మగుణా ! యశేష భూ
సురవరపావన ప్రణయశోభితమానస ! భద్రవర్తనా
పరిణత సాధుచిత్త ! చిరపావన సత్యశమాదిరంజితా !

కం॥ నానాదానవినోదా !
దీనోద్ధరణైకకార్యదీక్షితహృదయా !
భూనుతసుగణశరణ్యా !
శ్రీనాథపదాబ్జయుగ్మసేవానిరతా !"

ఉత్సాహము—— జలజపత్రరమ్యనేత్ర ! సాధులోకసన్నుతా !
లలితకీర్తి ! రమ్యమూర్తి ! లాలితార్థిమానితా !
విలసదమలయోగ్యకృత్య ! వివిధ సుగుణ భాసురా !
కలితలలితమృదులహృదయ ! కాంతసత్కృపాపరా !

గద్య॥ ఇది శ్రీమత్కాశ్యపగోత్రపవిత్ర సుబ్రహ్మణ్యపుత్త్ర
బుధజనవిధేయ వేంకటసుబ్రహ్మణ్యనామధేయ
ప్రణీతంబైన శ్రీరఘురామచరిత్రంబునందు
కిష్కింధాకాండము.

శ్రీః

శ్రీ శారదాంబాయై నమః.

# శ్రీ రఘురామ చరిత్రము

## సుందరకాండము

కం॥ శ్రీ వజ్రాంబాసంచిత
పావనసత్పుణ్యాగణ్యఫలమయమూర్తీ!
ధీవిభవవినుతకీర్తీ!
భావితచిరధర్మ! స్వామిబాబు! గుణజ్ఞా!

తే॥గీ॥ అవధరింపుము కుశలవు లవలికథను
బల్కఁదొడఁగిరి యిటు రామభద్రుతోడ
మంత్రిసామంతమునిజనమాన్యు లెల్ల
రతి ముదంబునఁ దత్కథామృతముఁ గ్రోల.

తే॥ వారినిధిదాఁట నల్ల వివర్ధమాన
గాత్రుఁడై వాయుసూనుఁ డక్కాననమునఁ
దమ్మికొలఁకున గంధగజమ్ముమాడ్కి
లీల నొక్కింతకాలంబు కేళి సలిపె.

తే॥గీ॥ పదయుగంబునఁ ద్రిజగతీవలయ మెల్ల
గ్రమ్ముకొన నుబ్బు విక్రమక్రమముఁ దోఁప
భూనభోఽంతర పరిపూర్ణమూర్తి యగుచు
వర్ధమానాంగుఁ డయ్యె నప్పవనసుతుఁడు.

ఉ॥ అంబరమార్గమందుఁ బవనాత్మజుఁ డేఁగఁ దలంచి మున్ను దా
నంబుజమిత్త్రుఁ బాశి యము నాత్మభవుల్ బవమాను శక్రునిన్
సాంబధనేశులన్ దశరథాత్మజు లక్ష్మణు భూతనూజఁ జి
త్తంబున నిల్పి కార్యజయతత్పరతన్ వినుతించి భక్తిమై.

ఉ॥ వారిధి దాఁట నెంచి కపివర్యులఁ గాంచి వచించె "నే నిదే
శ్రీరఘునాథకార్ముకవిసృష్టశరం బన లంక కేఁగి సీ
తారమణిం గనుంగొని ముదంబున వచ్చెదఁ గాక రావణుఁ
ధీరత లంకతోడ రఘుధీరుని చెంతకుఁ దెత్తు నం చొగిన్.

### అంజనేయుఁడు సముద్రమును దాఁటుట

సీ॥ ఊర్ధ్వదిక్ప్రసృతాయతోరుబాహులతోడ,
నాలీఢపాదద్వయంబుతోడ,
సన్నిరుద్ధోభయశ్వాసమార్గముతోడఁ,
బవనకుంభితగాత్రపటలితోడ,
సాచీకృతోద్వృత్త చారుకంఠముతోడ,
గగనాంతబద్ధదృగ్యుగళితోడఁ,
దిర్యగాకుంచితదీర్ఘదేహముతోడఁ,
బరిపూర్ణ బలకాయపటిమతోడ.

తే॥గీ॥ మారుతాత్మజుఁ డాకాశమండలమున
కెగసె శ్రీరామపత్నీదిదృక్ష వొంగ
నమృతభాండంబు తేర ఖగాధిపుండు
దేవలోకంబునకుఁ బోవు తీరు దోఁప.

తే॥గీ॥ పవనతనయోరుసంజాతవాతధూత
పాదపాకీర్ణ సుమవృష్టి పరగెఁ జూడ
నమరు లా రామకార్యజయార్థు లగుచుఁ
జల్లు సేసలు నా దెసలెల్లఁ గ్రమ్మి.

కం॥ మారుతివేగాకృష్టో
ర్వీరుహసంతతులు వెంట వెడలుచు నొప్పెన్
దూరప్రదేశ మేఁగెడి
వారలతో ననుగమించుబంధువులట్టుల్.

క౦॥ భారాక్రాంతములై య
వ్వారిధిలో మున్గు వృక్షపంక్తులు దనరెన్
శ్రీరామసేతుబంధా
ధారోపితశంకునివహమట్టులు బోల్పన్.

సీ॥ కక్షద్వయాంతరగత మైనవాయువు
జీమూతమట్లు గర్జిల్లుచుండ,
పతగేంద్రపక్షతిపాతస్వనభ్రాంతి
జలచరంబులు నిమ్నతలిని డాఁగఁ,
పవనవేగాకృష్టవార్ధిభంగంబుల
నబ్ధి ద్రోణీకృత మ్మాచుఁ దనర,
ప్రావారపటపరీహారమ్మునం దేహి
తను వట్లు వార్ధియంతరము దేల,

ఉ॥ అంబరంబునఁ దుహినాంశు నట్లు మెఱసి
జలదమాలికఁ జొచ్చుచు వెడలుచుండి
మారుతసుంతుండు జ్యాముక్తమార్గణమ్ము
భాతి నవిషహ్యవేగుఁడై పాఱుచుండె.

తే॥గీ॥ లంబమానాంగుడై నిరాలంబగగన
తలమునం బాఱు మారుతాత్మజుని గాంచి
యర్థి సాహాయ్య మొనరింప వార్ధి గోరెఁ
దన కృతజ్ఞతఁ జూపింపఁ దరుణ మగుట.

ఉ॥ ఈ కపి రామచంద్రధరణీశ సతిం గన లంక కేఁగు; ని
క్ష్వాకుకులీనుఁ డౌ సగరుసంతతినిర్మితినొప్పునాకు నై
క్ష్వాకులు పూజ్యు లీకపియు భానుకులేశుని మంత్రి యౌట మై
నాక మహీధరేంద్ర! కపినాథుఁడు నాకును నీకుఁ బూజ్యుఁ డౌ.

తే॥గీ॥ కృతముఁ దలపోసి తత్ప్రతికృతి యొనర్చు
టెంచ ధర్మంబు గాదె! మహీధరేంద్ర!
పూజ్యపూజావ్యతిక్రమ భూరిదోష
మొదవఁ జేయును మన్యువు నుత్తములకు.

కం॥ అని యంబురాశి పనుపన్
వినువీధి సువర్ణనాభపృథ్వీధ్రము పా
వని మార్గమందు నిలువన్
గని విఘ్నశంకఁ దాఁచెఁ గపి వక్షమునన్.

కం॥ పవిఘాతబాధ నెవ్వాఁడుఁ
జవిచూడని శైలవరము శ్వసనుజతనుసం
భవకులిశనిష్ఠురాహతి
నవిరళ వజ్రప్రహారహత మన నొప్పెన్.

ఉ॥ వాయుజుతోడ నిట్లనియెఁ బర్వత "మంబుధి పంప వచ్చితిన్
నీయెడఁ గూర్తుఁ; దొల్లి ధరణీధరసంతతి పక్షవంతమై
చేయఁగఁ బ్రాణగొడ్డములు, చేడ్పడి లోకులు కుయ్యివెట్ట, వ
జ్రాయుధ మెత్తి దేవపతి యద్రులఱెక్కలు ద్రుంచుచుండఁగన్.

కం॥ పక్షోపద్రవభీతిన్
రక్షింపఁగ మాతరిశ్వుఁ బ్రార్థించితి నా
దక్షుం డంబుధి నిల్ప న
పక్షుఁడ నిటులైతి పవనవార్ధుల కరుణన్.

తే॥గీ॥ భానుకులవర్ధితం బౌట వార్ధికూడ
రామకార్యార్థి వగు నీకుఁ బ్రేమసూపు;
ప్రాకృతుండైన నర్థి సంభావ్యుఁ డన్న
నిన్నుబోలిన ప్రాజ్ఞు నింకెన్న నేల?

ఉ॥ మారుతుఁ డాత్మ మెచ్చు గుణమాన్యుని దక్షుని నిన్నుఁగొల్వ నో
మారుతి! నిల్చి యచ్చిఖరమందుఁ, బథశ్రమ మెల్లఁ బాసి, యిం
పారఁగ మత్సపర్యఁగొని యావల నేర్చి జవంబుతో నకూ
పారము పార మొందు మతిభాగ్యము మాకగు నిన్నుఁ గొల్చుటన్.

ఉ॥ నాపుడు వాయుసూతి "జననాథుని కార్యభరమ్ము పెద్ద, నేఁ
బోవలెఁ జాలదూర మిటఁ బ్రొద్దుపుచ్చఁ గోయెదె; దూతలీ క్రియన్
ద్రోవల నిల్వ రాదని యని భాషిత మౌఁ గద! యాదరోక్తి సం
భావన సేసి; తద్గియ సపర్యగ నెంతు నటంచు నెమ్మితోన్.

తే॥గీ॥ వార్ధి పుత్తెంచు మైనాక పర్వతమ్ముఁ
గరతల స్పర్శమాత్రచే గారవించి
మారుతాత్మజుఁ డాకాశమార్గ మొంది
గరుడుఁ డట్టుల పఱచె సాగరముఁ గడవ.

కం॥ అచ్చెరు వందుచు గాంచి వి
యచ్చరు లాకపిబలంబు నరయఁగ సురసన్
బుచ్చిరి విఘ్నం బొనరుప
నొచ్చునొ గెలుపొంది యేగునొ తెలియంగన్.

### హనుమంతుఁడు సురసను జయించుట

ఉ॥ మారుతిమార్గమం దురగమాత ప్రసారితవక్త్రభీషణా
కారముతోడ నిల్చి, చిరకాలబుభుక్షిత నైన నాకు నిం
పారఁగ మాంసపారణ మమరించి తెలుపధను; రమ్మనంగ నా
దారుణ మృత్యుకందరము దాఁటఁగ మారుతి చింతసేయుచున్.

తే॥గీ॥ "వింజమా కిడినటు వినువీథిఁ గప్పి
భీషణాకారమున నేల వెలయు దమ్మ!
రామకార్యార్థి నగు నాకుఁ బ్రేమతోడఁ
ద్రోవఁ జూపించి పున్నెంపుఁద్రోవఁ బొమ్ము".

చం॥ అనుపవమానపుత్త్రునకు న వ్వికృతానన నవ్వి యిట్లనెన్
"వనరుహగర్భుఁ డొక్కెడ భక్తికి మెచ్చి వరం బొసంగె; ని
న్ననవిధి నిల్చి యాకసము ప్రైఁ జను సత్త్వము లెల్లబట్టనా
కనుగవఁ జిక్కి తప్పి చనఁ గా దనిలాత్మజ! యెంతవారికిన్.

కం॥ చిరకాలబుభుక్షిత నై
తఱి వేచుచు నుంటి జఠరదహనం బేఁచన్
దొఱికితివి నీవు నేఁ డిటు
లెఱసెడి నా కడుపుచిచ్చు కింధన మగుచున్.

తే॥గీ॥ క్రకచనిష్ఠురదంష్ట్రికరాళవక్త్ర
గహ్వరంబున నామలకంబు భాతి
నిన్ను గ్రసియించి జఠరాగ్ని నెఱ్ఱ నడంతు
రామకార్యార్థి నని కనఁ బ్రామ వశము" ‘

కం॥ ఆమ్మాటలకు మ్మారుతి
నెమ్మనమునఁ గనలి క్రమింగ నేర్తువె యది నీ
కెమ్మెయి సాధ్యము యని దీ
ర్ఘమ్ముగఁ దన మేను పెంపఁగా నొఱఁగొనినన్.

చం॥ సురసయు వక్త్రముం బెనిచె; శూరుఁడు మారుతి మేనువెంచె; నొం
డొరుల ముఖంబు మేను శతయోజన విస్తృత మై పెఱుంగ న
ప్పరమామసిషి మారుతి జవంబున నంగుళిమాత్రదేహుఁ డై
వెఱవునఁ జొచ్చి త న్ముఖము వెల్వడి పల్కెను నవ్వు దోఁపఁగన్.

తే॥గీ॥ "బ్రహ్మ నీ కిచ్చు వరముల పాడినిలుపఁ
దల్లి! త్వ ద్వక్త్రగహ్వరాంతరము చొచ్చి
వచ్చితిఁక పోదు; సెలవిచ్చి పంపు" మనినఁ
బనిచె సురసయు మెచ్చి దీవన లొసంగి.

కం॥ పవనజుఁ డొనరించిన రెం
డవ యద్భుతకార్య మరసి యమరులు మది ను
త్సవ మొంది సాధుపదముల
మివ్వులన్ నుతియించి రా సమీరకుమారున్.

సీ॥ అంగుళీయక మిచ్చి యఖిలవానరులందు
గారవించిన రాముకరుణపెంపు,
వనధి దాఁటఁగలేక వనచరుల్ దురపిల్లఁ
దను బూన్చు జాంబవంతునిమనీష,
మైనాకసురసాదిమహితు లధ్వమునందుఁ
దన కిచ్చుమేలిదీవనల బలిమి,
జానకీపదపద్మసందర్శనాపేక్ష
యుప్పొంగి మదిఁ గల్గునుబ్బుకలిమి,

తే॥గీ॥ పఙ్క్తికంధరకృత ఘోరపాపకార్య
సంస్మరణమాత్రసమకాలజాయమాన
వహ్నికల్పోజ్జ్వల క్రోధభరము నొలయ
నప్రతిహతోరుజవమున నరుగు హనుమ.

తే॥గీ॥ క్రూరపలలాశపురిఁ జొరఁ బోలుచుంట,
నస్ఖలితవీర్యజవమున నలరుచుంట,
రామకార్ముకముక్త నారాచ మనఁగ,
బవనసుతుఁ డెన్నఁ దగె నభోభాగమందు.

శా॥ వాయుప్రోద్భవుఁ డంబరంబునను బోవన్ భీమవేగంబుతో
నా యంభోనిధి నీట నౌకయటు దేహచ్ఛాయ పర్వెత్తెఁ; ద
చ్ఛాయన్ సింహిక పట్టి నిల్పఁ బ్రతివాతస్తబ్ధ నౌకా క్రియన్
ఛాయాగ్రాహిణి నీటఁ జూచెను నభస్వత్సూతి రుద్ధాధ్వుఁ డై.

కం॥ తనుతరదేహుండై పా
వని యా రాక్షసి ముఖంబు వడిఁ జొచ్చి క్రుధన్
గొనగోళ్లఁ ద్రెంచి ప్రేవులఁ
జనుదెంచెను రాహుముక్తచంద్రుం డనఁగన్.

ఆ॥వె॥ ప్రాణ మెడలి నిటఁ బడి కూలె సింహిక
నభవీధి నేఁగు ననిలజాతు
నరసి యమరు లెల్ల నాశ్చర్యచకితులై
జయము పల్కి రాశిషములతోడ.

తే॥గీ॥ పరమ నిర్మలుఁ డా యోగివర్యుఁ డల్ల
భవజలధి పార మొందినపగిది వాయు
భవుఁడు శతయోజనాయతవార్ధిపార
మందె విఘ్నంబులకుఁ జిక్కి కలఁత గొనక.

⇐ ఆంజనేయుఁడు లంకఁ బ్రవేశింప నెంచుట ⇒

ఉ॥ అంబుధి నిట్లు దాఁటి పవనాత్మజుఁ డవ్వలియొడ్డుఁ జేరి, తీ
రంబున లంబశైలశిఖరంబున డిగ్గి, త్రికూటశైల శృం
గంబున నున్న లంకఁ గని కాననభూముల విశ్రమించి రా
త్రిం బురిఁ జొచ్చి నద్దెసఁ బరీక్ష యొనర్పఁ దలంచె నిమ్మలన్.

ఉ॥ స్వీయకులప్రసూనరఘువీరకళత్రము నల్ల లంకలో
రోయఁగ రాత్రిఁ గోరెడి మరుత్సుతు చిత్త మెఱింగి యంతలో
సాయ మొనర్ప నస్తగిరిచాటున కేగిన మాడ్కిఁ గుంకుమ
చ్ఛాయలు గ్రమ్మ దిక్తటులఁ జండకరుండును నస్తమింపఁగన్.

తే॥గీ॥ పంక్తికంధరదుర్యశఃపటలిఁ బోలి
చిమ్మచీఁకటి దశదిశల్ గ్రమ్ముకొనియె;
అసురపురిరంగవీరనాట్యం బొనర్చు
పవనతనయున కది పటావరణ మయ్యె.

చం॥ తనుతరరూప మొంది పృషదంశకమాత్రశరీరుఁ డౌచుఁ బా
వని వనభూములం గడచి పర్వతసానువు లుత్తరించి, రా
వణభుజవిక్రమ స్ఫురణ వైరిజనావళిదుర్నిరీక్షు మై
తనరెడు లంక యుత్తరపు ద్వారముఁ జేరె నితాంతధీరుఁ డై.

శా॥ ప్రాకారాగ్రము నెక్కి తన్నగర సౌభాగ్యంబు, దుర్ధర్ష లం
కౌకస్సంచయదోర్బలంబుఁ బురరక్షాకల్పనం బంత రా
స్తోకాంభోనిధివారిపూరము మరుత్సూనుండు వీక్షించి, చిం
తాకుంఠీకృతధైర్యుఁ డయ్యె నట సీతామానినీప్రాప్తికిన్.

సీ॥ కాకుత్స్థు లేగితి గడచి రానేర్తురు
కడలేని కడలిని గపులతోడఁ ?
గడచివచ్చియు దశకంఠ రక్షిత మైన
యీ లంక నెట్లు జయింపఁగలరు ?
సామసాధ్యులె నిశాచరులు ? దానంబును
గొఱ యౌనె రక్కసికొలమునందు ?
భేదమ్ము వమ్మౌ నభేద్యమానసులందు ?
దోర్బలాజయ్యు లీదుష్టదైత్యు !

తే॥గీ॥ లర్కసూతియు జాంబవదంగదులును
నేను మాత్రమె తరియింప నేర్తు మబ్ధి ;
నంతమాత్రంబుచేత జయంబు గాంచఁ
గలమె ధరణిజఁ గైకొనఁ గలమె కలన ?

తే॥గీ॥ అనుచు నొక్కింత చింతాకులాత్ముఁ డగుచు
కలఁగి, వెన్వెంట చేడ్పాటు తొలఁగఁ ద్రోచి
యరసె "రామాశుగంబుల కడ్డు గలదె
పోర లక్ష్మణు నెదిరించువారు గలరె ?

ఉ॥ ఎంత బలాఢ్యులైన దనుజేశులు రాఘవధర్మదారదు
ర్దాంత పతివ్రతా మహిమ దగ్ధులు, తత్సతి కోపకీలికా
సంతత నష్టవీర్యులు, సుజయ్యులు నౌదురు; ధర్మదూషిత
స్వాంతుల కెట్టు లాత్మమహిమాదులు నిల్చు? జయంబు చేకుఱున్?"

చం॥ అని తలపోయు చా నగర మల్ల చొరంబడ నెంచునంజనా
తనయుని యగ్రభూమి వనితామణి రూపున నిల్చి లంక "యో
వనచర! దొంగ పోల్కిఁ జొరఁబాఱెద వి ప్పురిఁ, గాలు ద్రోలికిన్
బనిచెద నిన్ను! దండధరవాసపు లొక్కటఁ నద్దు వచ్చినన్".

కం॥ నా విని నవ్వుచు ని ట్లనెఁ
బావని "పురి నాల్గు దెసలు పరికించి యిదే
పోవుదు లంకానగరిన్
భావింతును వైభవమునఁ బరము"ంబనగన్.

ఉ॥ కోపమునన్ నిశాటి కపికుంజరు వక్షము కాలఁ దాఁచె; ను
ద్దీపితకోపుఁ డయ్యెఁ గపి స్త్రీ యనుచున్ దయ కొంత పూని య
ప్పాపిని నాతి గాఢముగఁ బాణితలంబున నెత్తి వ్రేసె; దు
ష్ప్రాపమహాజవుం డపుడు ప్రాణవియోగము నొంద కుండఁగన్.

తే॥గీ॥ ఉరము భేదిల్లి క్రొత్తనెత్తురు దొఱంగ
ధరణిపై వ్రాలి మూర్ఛిల్లి దనుజకాంత
యల్లఁ దెలివొంది కపిఁ జూచి యడలు వొంది
పల్కె గీడ్పాటుదోప నిప్పగిదిఁ బల్కె.

ఉ॥ తొల్లి సరోజసూతి రిపుదుర్జయరాక్షసరాజధాని భా
సిల్ల సృజించి కావఁ బనిచె న్నను "వానరుఁ డొర్చి నంత నే
యెల్ల నిశాటవంశము నశించు న టంచు వచించి" యట్ల నే
డెల్లిద మైతి నోడితి కపీశ్వర! యీ క్రియ త్వత్కరాహతిన్.

తే॥గీ॥ కాన నిఁక లంక చెడును రక్కసులతోడఁ
జొచ్చి యి ప్పురిఁ బరికింపు మిచ్చమీఱు
ననుచు లంకాధిదేవత యనిలసూతి
కనుమతి యొసంగె దుర్గమ్ము నరసిచూడ.

చం॥ జయమున నుబ్బి యా యనిలజాతుఁడు రాక్షసరాజధాని ని
ర్భయమున రోయఁగాఁ దలఁచి వామపదంబును నిల్పె మున్ను ; దు
ర్జయసకలామరారుల శిరంబులు దాఁచి యురంబులందు వి
ప్రియమున నాత్మ వామపద విన్యసనం బొనరించుకై నడిక.

⇐ ఆంజనేయుఁడు లంకఁ బరిభ్రమించుట ⇒

తే॥ లంక పరికించు నా రామకింకరునకు
నిరుల విరియించి సరవి నిల్లిల్లు చూపి
సాహ్య మొనరించు దివ్వియ చందమునను
జంద్రుఁ డుదయించెఁ దూరుపుచక్కి నల్ల.

సీ॥ గగన కాసారంబు కల్లోల పంక్తుల
నలవోక నిల్చురాయంచ యనఁగ,
అభ్రమందరకందరాంతరంబున నుండి
యల్లల్లఁ గిదలు పంచాస్య మనఁగ,
ఆకాశదిగ్దంతి యంసదేశంబునఁ
గై సేయు రాజత ఘంట యనఁగ,
వ్యోమ గోష్ఠాగారభూమిఁ గోరాడుచు
విహరించు మదకల వృషభ మనఁగ,

తే॥గీ॥ కలికి వెన్నెల చీఁకటి కచ్చుఁ బాపి
కలువ నవ్వించి వెన్నెల పులుఁగుగములఁ
దనిపి వెన్నెలయూమెతఁ దనియఁ జేసి
నిలిచి జాబిల్లి పొడసూపె నింగి మొదల.

ఉ॥ గోడలు మేడ లెక్క, పురగోపురగుల్మము లెల్లఁ జూచి, యా
క్రీడన భూములం దిరిగి త్రిమ్మరి మిద్దెల చంద్రశాలలన్
బోడిమి మీఱఁగా దనుజ ముఖ్యనివాసము లెల్ల గాంచి యా
వీడు కపిప్రవీరుఁ డెడవీడక రోసెను నాల్గు దిక్కులన్.

సీ॥ నిద్దంపుటద్దంపు నీటు దాల్చుచు ముచ్చ
మణుగు పెన్రచ్చల పొనుపు గనుచు,
రమణీయ గతి బ్రహ్మరాక్షసుల్ గుణియించు
సామవేదంబుల సంతసిలుచు,
అందంద గృహమేధు లాత్మగేహంబుల
గుఱువెట్టి నిద్రింప దఱియఁ జనుచు,
రక్షణార్థం బర్ధరాత్రమ్ము గ్రుమ్మరు
దైత్య వీరుల దారిఁ దప్పికొనుచు,

తే॥గీ॥ రచ్చకొట్టంబు లరయుచుఁ బ్రమదవనులఁ
గలయఁ జూచుచుఁ గిరువలి కన్నకొడుకు
పాకశాసనసాధంబుఁ బరిభవించు
దనుజవల్లభు హర్మ్యంబు దరియఁ జేరె.

సీ॥ యామికమ్ములు గాఁచు ద్వారదేశంబుల
నరిజనాభేద్య మై యలరు దాని,
పాలమున్నీటిపై మేలి తరఁగలఁ బోలి
తెలి డాలు తేజీలు తిరుగుదాని,
రవి రథంబు లనంగ జవనాశ్వములతోడి
పైఁడితేరుల కాంతిఁ బరగుదాని,
మెఱియల కీఁడైన దుఱుస రక్కసులెల్ల,
గడ విచ్చు కత్తులఁ గాఁచు దాని,

తే॥గీ॥ పంక్తికంధరు భవనంబు పవనసూతి
యల్లఁ జొలఁబాఱి యరసి మహానసంబు
పానశాలయుఁ బరికించి వచ్చివచ్చి
శయనమందిరమును జొచ్చె సాధ్వ నరయ.

చం॥ తొలకరి మించుతీఁగె లటు దోఁపఁగ మేనులు, నాటపాటలన్
బొలసిన క్రొత్త చెమ్మటలు ముత్తెపుఁజాలుల జాడ దోఁప నౌ,
దల నెఱివీడ కొప్పులు యథాతథలై నిదురించు కాంతలన్
గలయఁగఁ జూచె మారుతి నిగారపు టెంతులమాలఁ బోలికన్.

కం॥ ఆ వామా జనములలో
రావణుపై మరులుకొనని రామ యొకతెయున్
భావింపఁ గానరామిని
భూవిభుదేవేరి లేమి పోఁడిమి నెఱిఁగెన్.

ఉ॥ వీడిన పట్టుపుట్టములు, విచ్చినపయ్యెద, లల్లిబిల్లిజీ
రాడెడి వేనలుల్, కురులహత్తక వాసిన పూలు, గల్లు నా
చేడెలు నెమ్మికాండ్రవలె సిగ్గరి యొంటరుఁ గౌఁగలించి, యొం
టోటక నిద్ర నొందఁ గపియోధుఁడు చూడఁ దలంకె సిగ్గునన్.

కం॥ పరదారదర్శనంబున
దురిత మ్మొనఁగూడె ధర్మదూషణ మయ్యెన్
జారిపోయె బ్రహ్మచర్యము
తఱితెప్పను శీల మనుచుఁ దపియించు మదిన్.

ఉ॥ కాంతల నెన్నఁ డేని కడకంటను గాంచి యెఱుంగ; నేఁటి కీ
యింతులఁ జూడఁ బాల్పడితి నియ్యెడ; నైనను సీత రోయి నా
స్వాంతము సంచలింపదు; ప్రసన్నత వీడదు; ధర్మలోప మా
వంతయు లేదు; నైజహృదయంబె ప్రధానము గాదె మేనికిన్.

కం॥ అని తలఁచుచుండ మృగమద
ఘనసార సుగంధ పూర్ణగంధవహంబుల్
వినువీథి సుడిసి మారుత
తనయున కెఱిఁగించె దైత్యతల్లజు పొలుపున్.

ఉ॥ తోడన యేఁగి తల్పమునఁ దొయ్యలి కౌఁగిటఁ జిక్కి మించుతోఁ
గూడిన కాఱుమబ్బు గతిఁ గూరుకునొందెడు దైత్యరాజు వె
న్నాడెడు ధైర్యవృత్తి పవనాత్మజుఁ డారసె, ఫూత్కరించు క్రొ
వ్వాడి మహోరగంబు గతి శ్వాసల బుచ్చుచునుండ నల్లనన్.

కం॥ కని తత్తేజోహత వీ
క్షణుఁడై పవమానసుతుఁడు చకితాత్మకుఁడై
"ఘనతేజమింత యొప్పునె ?
దనుజేంద్రుం డేలఁ దగఁడె త్రైలోక్యంబున్.

కం॥ పరకాంతాహరణమ్మను
దురితమ్ముఁ దొలంగ నింత గొర యొకఁ డున్నె ?
వెఱ పుట్ట పోర నెక్కటి
హరిదశ్వు జయించెఁ గాదె" యని పేర్కొనుచున్.

చం॥ సురరిపు కౌఁగిటన్ మెఱుఁగు సొక్కఫుమించు టొయారిఁ గాంచి యా
ధరణిజ గా భ్రమించి కపి దాఁటెను గెంతెను వోఁక ముద్దిడెన్
బరులను గోకెఁ బ్రాకె నలుపైపుల వానరలీలఁ జూపుచున్
దరిగెను గొంతదవ్వు జగతీపతి కార్యము పూర్ణమైనటుల్.

ఉ॥ ఇంచుకఁ దేరి చిత్తమున నెంచె మహీసుత యీమెగాదు ; ధీ
వంచన గల్గె ; నిట్లు పెఱవానిని గూడునె పుణ్యసాధ్వి ? చిం
తించునె స్వప్నమందయినఁ దేటి రఘూద్వహు దక్క నన్యు ? ని
ద్రించునె సీత ? యీమె దనుజేశ్వర పత్నిగఁ దోఁచు నెంచఁ గన్.

తే॥గీ॥ లంక నల్దెసఁ బరికించి పంకజాక్షి
పొలఁకువ యెఱుంగ నిట్టు పొలిసోయెఁ గాదె
కడలిదాఁటుట యీ పురిఁ గలయఁగనుట ;
కలదె తప్పింప నొకచొప్పు కపులముప్పు.

కం॥ అని చింత గదిరి తిరుగుచు
వనరుచు మారుతి యశోకవనికను గాంచెన్
ననతీఁగెలల్లు మ్రాఁకుల
ననలను బంధులను బొల్చు నందన మనఁగన్.

కం॥ పరికింపనైతి నివ్వనిఁ
దరళాక్షిని దాఁచె నొక్కొ దైత్యుం డని యా
మరుదాత్మజుండు తద్వని
తెఱువునఁ జనె జానకీదిదృక్షాపేక్షన్.

సీ॥ కపురంపుటనఁటులకాండంబు లిరుగడ
వర్తిల్లు కృతకాద్రిపార్శ్వతతులు,
ఎల్లకాలములందుఁ బల్లవఫలపుష్ప
భరితంబులై యొప్పు పాదపములు,
కోడెత్రాఁచుల బోలి కొండకొమ్మలనుండి
పల్లంబులకు డిగ్గఁ బాఱునేళ్లు,
నెమ్మికాండ్రను బోలి నిడుమ్రాఁకుఁగొమ్మలఁ
బెనవై చికొని యుండు వనలతాళి,

తే॥గీ॥ అరసి తద్వనశోభ కచ్చెరువు గనుచు
నమరపతినందనారామసమ మటంచు
ధనదుచైత్రరథమ్మున కెన యటంచు
తలఁచు చట నొక్క శింశుపాతరువు నెక్కె.

ఉ॥ ఆ నిశి నీరవంబున కయత్నవిరామముఁ గొల్పి వేణు ని
క్వాణము నా మరుద్వశతఁ బావన తారకమంత్ర వర్ణముల్
వీనులవిందు సేయఁ, గపివీరుఁడు హర్ష భరప్రపూర్ణుఁ డై
జానకి పల్కు లివ్వి యని సవ్వడిదోఁచిన దిక్కు నారయన్.

సీ॥ బహుళవాఃకల్లోలపంక్తుల నడుచిక్కి
పోలుపేదు నెత్తమ్మిపూవు మాడ్కి,
మునుముట్టి క్రొల్బులుల్ దనుఁజుట్ట దీనయై
పుయిలోడు చిఱులేఁటిబోటి కరణి,
జాలుడేగలుచుట్టి సమయింప గమకింప
కలఁత నొందెడు రామచిలుక భాతి,
కాఱుమబ్బులలోనఁ గళబాసి చెలువేది
వెలవారు నమృతాంశుకళిక రీతి,

తే॥గీ॥ రాక్షసీపరివృత యైన రమణిఁ గాంచెఁ
జటులవిషవల్లివృత మహౌషధిని బోలి
మలినవసనమ్ము నతికార్శ్యలులితతనువు
వసుమతీసుత యనుచుఁ జెప్పకయ చెప్ప.

తే॥గీ॥ అవిరతంబును భీతిల్లి యమలభక్తి
రామనామంబు బల్కు నా రామఁ గాంచి
సొరిది యా లేమ యవయవశోభఁ గాంచి
ధరణిపుత్త్రిక గా వాయుతనయుఁ డెఱిఁగె.

ఉ॥ ఈ మదిరాక్షి రామధరణీశసతీమణి ; యీమెఁ బాసి యా
స్వామి ధరించె నెప్పగిది ప్రాణము లచ్చెరు వౌను ; రామనా
మామృత మాను టొక్కొ యమరారుల పీడల కిట్టు చిక్కి యీ
లేమయు దాల్చుమేను ; తగ లేకొకటై నను నూర్పు వాయదే ?

కం॥ అని పగలఁ దేలియాడఁగ,
మనుజాశనవనిత లతివ మానము వీడఁగ,
దనుజేశుపొందు గూడఁగ
వినిపింపఁ గడంగి రెల్ల వెరపులతోడఁగ.

తే॥గీ॥ "చొక్కపుఁదనంబు సుఖములఁ జూఱఁగొనఁగ
వనిత యౌవనమును బోలు వయసు గలదె?
ప్రాయమం దిష్టసుఖములఁ బడయకున్న
వయసు కైవ్రాల నింకేమి పడయఁగలవు?

కం॥ సురగరుడకిన్నరోరగ
తరుణీమణు లెవనిఁ గోరి తపియించెద రా
సురవైరి నిన్ను గోరెడి;
తరుణీ! నీభాగ్యమెంతొ తలపఁగ నగునే?

చం॥ జగముల నన్నిటిం గెలిచి సర్వదిగీశుల నోటఁబుచ్చి నె
మ్మగఁటిమి మీఱు వజ్రహతిమండితవక్షుఁడు దైత్యరాజు నీ
తగులము నాసఁజేయ నుచితం బొకొ కాదని త్రోసిపుచ్చ; నో
మగువ! తపింతు వావెనుక మారకృతార్తి దృఢానుతప్తవై".

కం॥ అని పదరుచుండ వానిఁ
విననోడి జుగుప్సఁబొగిలి వ్రేలిడి చెవులఁ
జనకాత్మ జాత తారక
మను జప మొనరించు దెసలు మాఱుసెలంగన్.

ఉ॥ ఆ నడురేయి దైత్యపతి యంగజబాణవిశీర్ణధైర్యుఁ డై
జానకిఁ జేరవచ్చె; వెనుచక్కి విలాసవతీ జనంబు వ్రీ
డానత మై కరద్వయపుటంబుల దీవియ లెత్తి రాఁగ, సీ
తాననచంద్రుఁ గప్పఁ దొలుకాడు మెఱుంగులతోడి మబ్బు నాన్.

తే॥గీ॥ చేరి ధరణిజఁ బ్రార్థనాశీలుఁ డగుచుఁ
జాటువులఁ బల్కెఁ దొడఁగె నిశాచరేంద్రుఁ
డవియె యుద్వేగకరము లై యలరె సీత
కగును భయకారణము దుర్జనానునయము.

కం॥ "తొల్లి జనస్థానములో
బల్లిదు లై చుప్పనాఁతి భంగింపరె నీ
వల్లభుఁడు మఱఁది యటు నా
చెల్లెలిఁ గాఱింప నిన్ను జెఱఁగొనఁ దగదే!

ఆ॥వె॥ దానికేమి? మగువ! తగు నొక్కెఁ దురపిల్ల
నిఖిలలోకజేత నేను గోర?
నన్ను జెట్టఁబట్టి నాఁతి! యౌవనభాగ్య
మాన్య వగు మ దగ్రమహిషి వగుచు.

చం॥ జగముల గెల్చియున్ దశ దిశాపతులన్ బొరిపుచ్చి విక్రమ
స్థగితదిగంతరుండ నయి దానవలోకము నేలు నాకు నో
మగువ వికస్వరాంబుజసమానభవన్నయనాంబకాహతిన్
బగిలెను ధైర్యకంచుకము; భావజు బారికి నిట్లు చిక్కితిన్.

చం॥ కృపణుఁడు గాక రాఘవుఁడు కేవల వీరుఁడె? తండ్రి త్రోవ న
ట్లపగతరాజ్యుఁ డై యిడుమ లందు వనంబుల; వానిఁ గోరియే
యిపు డిటు కుందుచుంటివి? మృగేక్షణ! బేలవు గాక యింక నా
నృపతనయద్వయమ్ము గననేర్తువె? చావరె దండకాటవిన్.

తే॥గీ॥ బ్రదికియున్నను గడలి నా బడుగు లెట్లు
గడవ నేర్తురు? లంక నెక్కరణి గెల్వ
నోపుదురు? దైత్యవీరుల నోర్వ నగునె?
కలికి యడియాస లెడవీడి కనుము సుఖము".

ఉ॥ నావుడు రావణుం దృణకణం బటు లెంచుచుఁ బూరిఁ బూని యో
"రావణ ! నీ మగంటిమి తెఱంగెఱుఁగంబడు రాము నాజిలోఁ
జేవ నెదిర్చి నిల్వ, రఘుశేఖరుమార్గణరాజి వమ్ము గాఁ
బోవునె ? వార్ధులార్చుఁ గులభూధరపంక్తులఁ గూల్చు వ్రేల్మిడిన్.

ఉ॥ ఒక్కనిమేషమాత్రమున నొంచె ఖరాదుల వేనవేలు ; పెం
పెక్కిన భార్గవుం గెలిచె ; నీశ్వరచాపము భంగపుచ్చె ; నీ
యుక్కును బాప కున్నె మనుజోత్తముఁ డాయెడ నిన్ను గన్నచోఁ
దెక్కలి ! కన్నొమ్మెఱింగి యిటు తెచ్చియు బీరము లేల దానవా ?

తే॥గీ॥ రామకోపాగ్ని కింధనప్రాయ మగుచుఁ
గూలు నీ లంక రక్కసికొలముతోడ ;
నంగిదకుఁ జిక్కి గరళమ్ము మ్రింగినట్టి
మోఱకు తెఱంగునన్ నీవు పొలియఁగలవు.

చం॥ దురితపరీత ! నీ పలుకు దూషణవాక్యము లెవ్వఁడేని నా
నరపతితోడఁ దెల్పిన ననంతజవంబున వార్ధి దాఁటి యి
ప్పురిఁ జొఱఁబాఱి మంత్రిహితపుత్త్రులతో నిను బట్టి చంపి నీ
తరుణులు పెన్వగన్బొగల దానవ ! సన్గొనిపోఁడె ? నీరతన్.

తే॥గీ॥ తగదు పరదారలను గోర దనుజ ! ధాత్రు
వంశమందును బుట్టిన వాఁడ వందు
బ్రహ్మవేత్తవు నీ ధర్మపత్ని నోరులు
చెఱుప నీ కెట్టు లౌనో యోచించుకొమ్ము".

కం॥ అని పల్కఁ గనలి జానకిఁ
దునుమం గమకింపఁ, దగదు దోష మటంచున్
దనుజేశు నాఁచె నొకసతి ;
దనుజుఁడు పైఁదరువు నడుపు తరుణుల కనియెన్.

తే॥గీ॥ వలపు మొలకెత్త హితవును దెల్పఁ డల్ల
మరులుకొనదేని యిక రెండుమాసములకు,
కాఱు లఱచిన యీ యింతిఁ గసిదొఱంగఁ
జంపి మెసవుఁడు ప్రాతరాశంబు గాఁగ.

ఉ॥ ఈ గతిఁ బల్కి దైత్యుఁడు మహీసుత వీడి ప్రియాంగనాళితో
నేఁగె ; మరుత్సుతుండు దనుజేశ్వరు నా క్షణమందఁ జంప ను
ద్వేగము నొందియుఁ గా సహజధీరత శాంతి వహించె ; నంత సీ
తాగజరాజయానఁ గని దైత్యసతుల్ వెఱపింపఁ బూనఁగన్.

తే॥గీ॥ త్రిజట యను దైత్యకాంత నిద్రించి లేచి
జనకతనయను వెఱపింపఁ జన దటంచు
వారణ మొనర్చి తాఁ గన్న స్వప్నరీతిఁ
దెలుపఁ దొడఁగొనె మెయి నిండఁ బులకలెత్త.

సీ॥ తెలియేన్గు నెక్కి యాఁదల వెల్లగొడుగూని
యీ సీతఁ గొని రాముఁ డేఁగినట్లు,
రామావనీశ్వరు వామాంకమున సీత
కూర్చుండి దుగ్ధమ్ముఁ గ్రోలినట్లు,
మార్గణమ్ముల దైత్యమండలిఁ బొరిగొని
సౌమిత్రి వెనుచక్కిఁ జనినయట్లు,
దైత్యముఖ్యులతోడ దశకంఠుఁ దలపట్టి
మృత్యుకన్యక నేల నీడ్చినట్లు,

తే॥గీ॥ వెల్లగుఱ్ఱము నెక్కి విభీషణుండు
రాము సేవించి యొడయఁడై బ్రతికినట్లు
సీత కుంగరమిచ్చి భాషించి యొక్క
చరుచరుఁడు లంక దహియించి తరలినట్లు.

మ॥ కలఁగంటిన్ గలకంఠులార! ధరణీకాంతుండు నేఁ జెల్లి యీ
జలజాక్షిం గొనిపోవు రక్కసులకున్ సంధిల్లు నిక్కట్టు లీ
లలితాంగిన్ శరణంచు గొల్చి మనమెల్లం జేరి ప్రార్థింత మా
వల మేల్గల్గును; నిష్ఠురోక్తుల వృథా బాధింపఁ గా నేటికిన్.

ఉ॥ నావుడు నొక్కరక్కసి మనంబునఁ గల్లగనెంచి నవ్వె; నిం
కే విధిఁ బల్కరాదని వచించె మఱొక్క విరూప! యల్ల ర
క్షోవిభుఁ డిద్ది విన్న మనకుం దలచే టగు నంచుఁ బల్కె నొం
తే వెఱగందె వేఱొకతె తేఁకువ జానకి బ్రువ్వఁదిట్టుచున్.

తే॥గీ॥ క్రమ్ముకొని యశ్రుజలములు కాల్వగట్టి
చెక్కుటద్దములం బాఱి దిక్కువాసి
శోకవశ యాచుఁ జెలి నా నశోకలతిక
నూని మరపిల్లఁగఁ గడఁగె భూజానిలేమ.

తే॥గీ॥ అంతఁ గొంతకు రాక్షసకాంత లెల్ల
నలఁతలంగూరి నిద్రల నణఁగియుండఁ
గడమెఱుంగనిశోకమ్ము గడవదాఁట
వేణి యుద్బంధన మొనర్ప వెలఁది కడఁగె.

కం॥ అది యదనని హనుమంతుం
డెదనెంచి వచించె రాఘవేశ్వరుచరితన్
మృదుమధుర ఫణితి సీతా
మదవతి మది సోఁక దివ్యమకరంద మనన్.

సీ॥ రథవాజిగజభటరాజితోఁ గోసల
ధరణిఁ బాలించును దశరథుండు,
కౌసల్యయు సుమిత్ర కైకేయి యను రాణి
వాసంపుఁ బడతు లా పంక్తిరథున

కం దగ్రమహిషీప్రియాత్మజుం డగు రాము
నభిషిక్తు నొనరింప నధిపుఁ డెంచ
వారించి కైకేయి వరయుగ్మమును గోరెఁ
దన పుత్త్రి భరతునిఁ ధరణి నిల్పి,

తే॥గీ॥ వనుల కంపఁ జతుర్దశాబ్దములు రాము;
ననుజుఁడగు లక్ష్మణుఁడు భార్య జనకపుత్త్రి
యనుసరింపంగ రాముండు వనులనుండ
రమణి సీతను హరియించె రావణుండు.

ఉ॥ ఆ వసుధేశపుత్త్రులు ధరాత్మజ రోయుచు వచ్చివచ్చి సు
గ్రీవునిజేరి నెయ్యమునఁ గీడ్పడ వాలి వధించి, రాజ్య సం
భావితుఁజేయ, వానరులఁ బంపెను జానకిజాడఁ జూడ! నే
నీ విధి లంకఁ జొచ్చి యిట నీ మృగలోచన యున్కి గాంచితిన్.

తే॥గీ॥ ఏ మహాసాధ్వి నరయంగ నెల్లకపులు
సకల దిగ్భాగముల నెల్ల సంచరింతు
రా మహాసాధ్వి జానకి నరయఁగంటి
సఫలజన్ముఁడ నైతి యశంబుగొంటి.

కం॥ ఈ విధి సీతా ప్రాణో
జ్జీవనమై యమృతబిందుసేకం బనఁగాఁ
బావన రామచరిత్రము
పావని వినిపించె శింశుపాతరుగతుఁడై.

తే॥గీ॥ వామనయనంబులోఁ బరిస్పందమొంది
వామబాహువు భావిశుభంబుఁ దెల్పి
రమణి కానందమొసఁగె శ్రీరాముఁ డగ్ర
భాగమున నిల్చి యాశ్వాసపఱిచినట్లు.

ఉ॥ అల్లన వాయుసూతి జనకాత్మజ యగ్రమునందు డిగ్గి, భూ
వల్లభుదేవి కయ్యెడను భక్తిపురస్కృతిమ్రొక్కి పల్కె “నో
తల్లి ! మరుత్సుతుండ ; గుణధాముఁడు రాముఁడు పంప వచ్చితిన్
జెల్లె మనోరథం బిట సజీవను నిన్గనుభాగ్య మబ్బుటన్.

తే॥గీ॥ కుశలినివి గాన వానరకులముతోడ
మనుకులమ్మునఁ గుశలమ్ముఁ దనరుఁ దల్లి !
త్వ ద్వియోగార్తి దురపిల్లు ధరణివరుని
జీవముల నిల్పఁ బ్రత్యాశ జీవగఱ్ఱ.

శా॥ నీకై రాఘవుఁ డంబ ! చింతిలుచు నన్వేషించు నీ సేమమే
యాకర్ణింపఁదలంచు నిన్ను గన దేవారాతి నిర్జింప నా
కాకుత్స్థాన్వయుఁడెంచు రేవగలు భోగత్యాగియై సర్వమం
దేకాగ్రేంద్రియవృత్తి యోగివలె నిన్నీక్షించు నిర్నిద్రుఁడై.

తే॥గీ॥ జనపతి యొసంగె నిదె యభిజ్ఞాన” మనుచు
హనుమ శ్రీరామనామాంకితాంగుళీయ
కము నొసంగెను ; జానకి కనులఁ గద్ది
కొనుచుఁ గన్నీటఁగడిగెఁ బైకొనెడు భక్తి.

ఉ॥ అక్కునఁజేర్చు ; ముద్దుగొను ; హా యను ; నోఁదఁఁదాల్చు భక్తిమై
మ్రొక్కును ; బాడు నశ్రుజలపూరమునించును ; జాలినొందు నీ
చిక్కికి నెట్లు వచ్చితను ; స్వామి శుభంబరయం దలంచు నా
యెక్కటి పెంటిజక్కవకు నీ డగు జానకి హర్ష విక్రియన్.

తే॥గీ॥ కడిమి తొల్కరిఁ జిరుమొగ్గదాల్చినట్లు
గఱులఁ దేలెను జానకీ గాత్రయష్టి
హర్ష వశమున సీత జాడ్యమ్ము నొంది
పోల్పఁదగి యుండెఁ బుత్తడిబొమ్మతోడ.

ఉ॥ ఏఁచినభక్తి మారుతి మహీసుత కిట్లనె "తొల్లి చిత్రకూ
టాచలమందు కాక మొకఁ డాకులవెట్ట నిషీక మేసినన్
వే చని సర్వదిక్పతుల వేడియు రక్షణమొందలేక తా
లోచన మొక్కటిచ్చి నిజలోకముఁ జేరె నభగ్నదేహ మై.

ఉ॥ ఆ కరుణాసముద్రుఁడు మహాత్ముఁడు బాణము కేలఁబూని నీకై
జేకొన సర్వకాలమును జింతయొనర్చు; యుగాంత కాల రు
ద్రాకృతి నెత్తివచ్చి దనుజాధిపుఁగాల్చు శరాగ్నికీలలన్
నీ కలచొప్పెఱింగిన! యనింద్యచరిత్ర! దొఱంగు దుఃఖమున్."

కం॥ అని పావని పేర్కొనినన్
జనకజ విస్రంభ మొంది జగతీపతి ల
క్ష్మణు లే రూపున నుందురో?
వనచరు లెటు తోడుసూప వలఁతులో? యనినన్.

సీ॥ సర్వభూతసముండు సర్వవేదవిదుండు
జలదమేచకతనుం డలఘుభుజుఁడు,
సత్యధర్మ క్షమాశాలి శౌర్యాంభోధి
యాజానుబాహు వక్త్రాయతాక్షుఁ,
డతి దయాపరుఁడు బ్రహ్మాస్త్ర ప్రయోగజ్ఞుఁ
డతి పీవరోరస్కుఁ డల్పమధ్యుఁ,
డాశ్రితావనదక్షుఁ డాత్మజ్ఞుఁడు కృతజ్ఞుఁ
డంబుజోపమపాదుఁ డనఘమూర్తి,

తే॥గీ॥ రాముఁ డీగతి గుణరూపరమ్యకీర్తి
సాటియగు నన్న కన్నిటఁ జేయ పసుపు
లక్ష్మణుండు పరాక్రమ లక్షణుండు
దేవతుల్యులు తల్లి! యాదిత్యకులులు.

మ॥ నఖదంతాయుధు లద్రితుంగతను లానా కాంతసంచారు లు
ల్లిఖితాజాండకటాహకర్పరులు దోర్లీలాసమగ్రుల్ కపుల్
సుఖదుఃఖద్వయచింత వీడి దితివంశ్యక్షేమ జంపు టేనాఁడొ యం
చు ఖగేంద్రుండటు క్రేళ్లువారుదురు త త్సుగ్రీవసంప్రేష్యు లై.

తే॥గీ॥ చలముమై వార లొక్కొక్క చుళుకమెత్తి
గ్రోల వారాశిజల మెల్ల రూపువాయు
నీట నొక్కొక్క శిల వైవ నీరరాశి
మెట్టగామారు నమ్మము; మీనవయన!

ఉ॥ వింటి ఖలుండు రావణుఁడు ప్రేలిన కాఱులు వీనులార నా
తుంటరి లంకలో నిపుడఁ దోయధిఁ ద్రొక్కెనె? దూత నౌట నే
నుంటినిమిన్న కీక్రియ రఘూద్వహుతో భవదీయవార్త వా
ల్గంటి యెఱుంగఁ జెప్పవలెఁ గావునఁ బంపుమట"న్న దీనయై.

ఆ॥వె॥ "తండ్రి జనకుకంటెఁ దల్లి కాశ్యపికంటె
మఱఁదికంటెఁ గూర్మిమగనికంటె
నన్న! యాప్తబంధు వైతి వీరీతిగ
నుసురునిల్పి హర్ష మొదవఁజేసి.

ఉ॥ చూచితి గాదె! దైత్యపతి చొప్పును బల్కులతీరు; నాథుతో
నీచులువెట్టు బాములను నిక్కముఁ దెల్పుము మాసమంతలో
నీ చెఱఁబాపకున్న దనుజేశుఁడు చంపను బాసచేసె; దో
షాచరకాంత లెంతకును జాలుదు రంతకు నిల్వనిత్తురే?

కం॥ క్షణమొకయుగ మై యున్నది!
దనుజాంతకుఁ డెట్లు వేగదయఁజూచునొ? పా
వని! యట్లు సేయు మన్నిటి
కిని నేర్తువు నీవకలవు; కృతమతి వనఘా!

తే॥గీ॥ చిత్రకూటంబునందు నా చెనఁటి కాకి
ముట్టినంత నిషీక వి మోచనంబు
చేయు నొడయుఁడు నే డిట్టు చెనఁటి దైత్యుఁ
డాలిఁగొన మిన్నకుండుట పోలు నొక్కొ!

తే॥గీ॥ క్షత్రియోచితపౌరుషసాహసమ్ము
లెల్లలోకమ్ము లెఱుఁగ నీ కృపణదైత్యు
నోర్చి నను గొనిపోవుట యోగ్యమనుము!
తరణివంశోచితమ్ము క్షాత్త్రమ్ము సుమ్ము!"

క౦॥ అని పల్కి యానవాలుగఁ
దన చూడారత్నమిచ్చె ధరణీసుత; యా
మణిఁ దాల్చి తలను గపియుఁ
దనుజకులమ్మేర్చు సాగ్నిదర్విం బోలెన్.

ఉ॥ మారుతి వాకొనెన్ "దితిజమాయల నీక్రియ గ్రుమ్మనేల? యో
శ్రీరఘురామపత్ని! విభు చెంగట నిల్పఁగ నేర్తు నిన్ను నీ
వారిధిదాఁటి యీక్షణమె; పాయక నా భుజసీమ నిల్వు"నా,
నా రఘువంశ్యదేవి దరహాసముతో నిటుపల్కె లీలగన్.

చం॥ అలఁతివి; మూపునంగొనుచు నభ్రపదంబున నెట్లు పాఱఁగా
వలఁతివి? నాఁ గపీశ్వరుఁడు పల్కె దిగంతరపూర్ణమూర్తి నై
యలరి మదంబ! దైత్యకులమంతటితోడను లంక మూఁపునన్
నిలిపి యజాండమున్ గడవనేర్తును జూడుము టంచు నయ్యెడన్.

సీ॥ మేరుభూధరమట్లు మించి రోదోఽంతర
వ్యాకీర్ణ దీర్ఘ దేహంబుతోడ,
బ్రహ్మాండభాండధూర్వహనక్షమం బైన
యత్యున్నతాంసద్వయంబుతోడ,

రోహణాచలశృంగ మోహనారుణకాంతి
కమనీయమైనవక్త్రంబుతోడ,
బలిరాజ్యహరణార్థవర్ధిష్ణువిక్రమ
పద దీర్ఘపదపల్లవములతోడ,

తే॥గీ॥ దావదహనోగ్రగీప్త నేత్రములతోడఁ,
కులిశనిష్ఠురనఖదంతకోటితోడ
భువనభీకరదారుణమూర్తి యగుచుఁ
బవనతనయుఁడు నిల్చె నంబరముగప్పి.

తే॥గీ॥ జయజయధ్వని పుష్పవర్షమ్ముఁ గురిసి
హనుమ మెచ్చిరి యప్సరోవనిత లెల్ల
సురలు మెచ్చిరి ; గంధర్వనరులు పొగడి ;
రవనిజాతయు మదిలోన హర్షమందె.

తే॥గీ॥ మగుడఁ దనుతరదేహుఁడై మారుతాత్మ
జాతుఁ డంట నిల్వ ననియెను జనకజాత ;
"తగుదు వంతకు హనుమంత ! ధైర్యవంత !
బుద్ధిబలసంపదల నిన్ను బోల రొరులు.

ఉ॥ అంబరమార్గమందుఁ బవనాత్మజ ! నీవు జవంబుతోడఁ జా
అం బడకుందునే యుదధి ? రాత్రిచరుల్ గన నెట్లు ? నాకుఁ గా
ర్యం బగునొక్కొ యన్య తనువంటుట ? జేనికి శౌర్య మొక్కొ ? చౌ
ర్యం బనరొక్కొ ? దైత్యపతి రాఘవుఁ డోర్చుట మేలు గాదొకో !"

తే॥గీ॥ అనుడు మారుతి యనె ధరాతనయతోడ
"జనకతనయకు రఘురామసాధ్వి కెద్ది
సముచితం బద్ది పల్కితి జనని ! నీవు ;
ధైర్యసారంబు దక్క రుదాత్తమతులు.

ఉ॥ భూవిభుఁ జెల్లి రేపొ కపిపుంగవసైన్యముతోడ వచ్చి యా
రావణు నెల్లదైత్యుల దురంబున దున్మి జగత్ప్రియంబుగా
నీ వెదమెచ్చ శౌర్యగతి నిన్గొనిపోవును ; సందియంబులే
దో వనజాక్షి ! యింక రిపుయోషలయార్తరవంబు విందు వౌ.

తే॥గీ॥ పోదు సెలవిమ్ము తల్లి ! బుభుక్షతీరఁ
పండ్లఁగొన్నిటి నమలెద వనములోన
ముదలయే" యనఁ దలయూఁచెఁ బూవుఁబోఁడి
యట్టె మారుతికోర్కె కా దనఁగలేక.

తే॥గీ॥ ఆరముగ్గిన పండుల నారగించి
తేనెపెఱలాని తని వొందితేటి కొంత
దైత్యపతిఁ జూచి భాషింప తలఁపుగలుగ
వనము భంజింపఁ గడఁగె నప్పవనసుతుండు.

సీ॥ హర్యక్షు మట్లు గర్జారావ మొనరించి
తరుతలాశ్రితజంతుతతులఁ ద్రోలి
ఖగరాజుపోల్కె ఱెక్కలసద్దుతోఁబాఱి
నిమరించు పక్షుల బెదరఁగొట్టి
పెనుగాలి సుడివెట్టి పెల్లువీచినమాడ్కి
నసలతోఁ గొమ్మలఁ దునుఁగఁద్రోచి
మొలకలతోఁ గొండ మొగిరి పైబడినట్లు
బలుమ్రాఁకులకు నుగ్గువా టొనర్చి

తే॥గీ॥ పవనపుత్త్రుండు తద్వనభంగమునకుఁ
బూనె ; వనపాలు రతికోపపూర్ణు లగుచు
పట్ట గమకింపఁ జిక్కక పఱచి నిక్కి
పండ్లఁ జూపుచు నుఱుగొట్టి భయముగొల్పి.

క॥ అత్యుగ్రమూ_ర్తి మారుతి
చైత్యప్రాసాదభూమి చక్కడఁచి యటఁ
దైత్యాళి సంహారింపఁగఁ
బ్రత్యుద్గతయముఁ డనంగ భయకరుఁ డయ్యెన్.

సీ॥ ముక్కడి రక్కసు లొక్కుమ్మడి నెదిర్ప
నుగ్గునూఁచ మొనర్చి మ్రగ్గఁజేసి,
బలదర్పమునఁ దన్ను బట్ట నంకించిన
పంచసేనానులఁ బట్టి చంపి,
శస్త్రాస్త్రదీపిత స_ప్తమంత్రితనూజ
శౌర్యాగ్నిదోశ్శ_క్తి సమయఁజేసి.
అనితరజయ్యవీరాక్షకుమారుని
లీలగాఁ గాలునిఁ బోలి కంపి,

తే॥గీ॥ రావణుని గుండె శోకాగ్ని రగులుకొలిపి
దుర్జయత్వంబు నతిలోక దోర్బలంబు,
పటుతరపరాక్రమముఁ జూపి భయముఁగొల్పి
మోఘవీర్యు నొనర్చె నా మేఘనాదు.

తే॥గీ॥ అస్త్రశస్త్రాదిదుర్జయు నా కపీంద్రుఁ
గెలుచుమార్గంబు గానక కలఁతనొంది
యసుర బ్రహ్మాస్త్రమేసె; నా యస్త్రనిహతి
క్షణము మూర్ఛిల్లియును దేరి యనిలసుతుఁడు.

ఉ॥ ధాతృవరప్రభావమునఁ దన్నది కట్టఁగలేమి నెంచియున్
దూతగ రావణుం దరిసి తోఁచిననీతిని దెల్పఁగోరి యా
వాతతనూజుఁ డయ్యెడను బద్ధునిక్రై_వడి మిన్నకుండె మా
యాతతవ_ర్తనం బరముఁ డజ్ఞత సంస్తృతిమగ్నుఁ డైనటుల్.

ఉ॥ చిక్కను గోఁతిగాఁ డనుచుఁ జేరి విశృంఖలవృత్తి రక్కసుల్
గ్రక్కనఁ జుట్టుముట్టి దృఢరజ్జునిబద్ధు నొనర్చి కొట్టఁగన్
రక్కసిసేన కొల్వునకు రావణి మారుతిఁ దెచ్చె; రావణుం
డక్కజ మంది నందికృత మైనభయంకరశాప మొక్కొ నాన్.

తే॥గీ॥ ఆ ప్తమంత్రిప్రహస్తాఖ్యు నరసి చూచి
"యెవఁడొ ? నీఁడేల ? వనము భంగించె దైత్య
వరులఁ దునుమాడెఁ ? బ్రశ్నించి యరయు"మనఁగ
దైత్యపతి కిట్లు మారుతాత్మజుఁడు పల్కె.

⇐ ఆంజనేయుఁడు రావణునకు హితబోధ సేయుట ⇒

ఉ॥ "రాముని దూతనై జనకరాజసుతన్ గని యామెతో రఘు
స్వామి శుభంబుఁ దెల్పి జనపాలుని పాలికిఁ బోవుచుండి నీ
సేమముగోరి మే ల్దెలుపఁ గంతయొనర్చుచు నిన్ను జూడఁ నా
రామము పాడొనర్చితిని రక్కసు లొంపఁగరాఁగఁ జంపితిన్.

ఉ॥ తామసవృత్తి రాఘువునిధర్మసతిన్ గొనివచ్చి తేల ? శ్రీ
రాము నెదిర్చి నిల్తువా ? ధరాసుత రాక్షసకాళరాత్రి ! యా
కోమలగాత్రి పొందు మదిఁగోరుట మృత్యువునొందఁగోరుటే
యీ మహనీయభోగములఁ దృప్తి వహింపవ ? నిల్వఁ జూడవా ?

చం॥ హరునిశరాసనం బెఱుగు నా రఘువీరునిచేతి లావు; పెం
పఱు భృగుపుత్త్రుఁ డాతని పరాక్రమలీల నెఱుంగు; వాలి ని
ష్ఠురగుణము క్తమార్గణముశూరత నించు కెఱుంగు; నట్టి దా
శరథి శరాళిసారము నిశాచర నీవు నెఱుంగ నెంతువో ?

ఉ॥ రావణ ! జానకీసతిని రామునకిచ్చి 'మహాత్మ ! తప్పిదే
గావుము'టంచు వేడు; కపికాంతుని బ్రోచినరీతిఁ గాచు ! లో
కావళిఁగాచు నాతఁడు దయామతిఁ గావకపోఁడు; లేనిచో
భూవిభుఁ డెత్తివచ్చి నిను బోర వధించు సపుత్త్రమిత్రమున్.

తే॥గీ॥ ప్రళయకాలాగ్నిఁ బోలు నా రాఘవునకుఁ
బూని ఝుంఝూనిలంబు తోడైన యట్లు
భానుతనయుండు వానరసేనతోడ
బాసటగ వచ్చు ; నీ కింక బ్రదుకు గలదె ?"

తే॥గీ॥ అనఁగఁ గనలూని మారుతిఁ దునుమఁజూడ,
దూత వధ్యుఁడు గాఁ డంచు నీతిఁదెల్పి
వెఱవునను మాన్చె నల్ల విభీషణుండు
కారణములేనిమిత్రులు గద ! సుజనులు.

తే॥గీ॥ వానరాళికి వాలమ్ము ప్రాణపదము
దాని గాల్చిన నగుఁ దగుదండనం బ
టంచు రావణుఁ డెంచె ; నా యగ్నితోడ
లంక భస్మీకరించు నన్ శంకలేక.

కం॥ పలిక యానతి మారుతి
వాలంబునఁ దైలసిక్తవస్త్రము లసురుల్
లీలగఁ జుట్టి హుతాశ
జ్వాలలు దరికొల్పి రగ్నిసాత్కృతిసేయన్.

ఉ॥ వాయుతనూజు వాలమున వహ్ని రగుల్కొని యేర్చుచుండి జ్వా
లాయుతుఁ డయ్యుఁ జందనవిలాసము దోఁపఁగ శైత్యమొందెఁ దా
వాయుసఖుండు గావునను వాయుతనూజు దహింప నోడెనో ?
యా యవనీసుతా రచిత మైన నిజస్తుతి శైత్య మొందెనో ?

తే॥గీ॥ పాపరాక్షసకృత రజ్జు బంధనములఁ
బాసె మారుతి దేహవివర్ధనమున
జ్ఞానసంప్రాప్తిచే యోగి కర్మఁ బాసి
ప్రకృతిబంధవిముక్తుఁ డై పరగి నట్లు.

కం॥ తనయెడ శైత్యము నూనిన
యనలుని దనియింప నెంచి యాహుతి యిడెనో
యన దనుజ మందిరంబుల
ననలముఁ దఱికొల్పె మారుతాత్మజుఁ డంతన్.

సీ॥ క్రమపారావతకంఠకర్బురవర్ణ
ధూమధ్వజం బభ్రసీమఁ గప్ప,
వితతేంద్రగోపోపమితవిస్ఫులింగముల్
ఛటఛట ధ్వనులతోఁ జదల కెగయ,
జాజ్వల్యమానమై జ్వాలాసమూహంబు
సౌవర్ణకాంతి విశ్వంబు నింప,
దందహ్యమానమై దశదిశాభోగమ్ము
తప్తకటాహదీప్తమ్ము గాఁగ,

తే॥గీ॥ పద్మరాగారుణజ్వలద్వహ్ని యేఁచి
కాల్చె నా లంక సకలరాక్షసులతోడ
వాయుతనయుఁడు సాహాయ్యభరము పూన
నసురపతి భీతిఁ దొఱఁగిన ట్లడరియడరి.

ఉ॥ పిల్లలయార్తిఁ గాంచి దురపిల్లెడు తల్లులు ; పత్ను లేడ్వఁ గా
సిల్లెడు భర్తలున్ బితలు చేడ్వడ దిక్కుదొఱంగు నాత్మజుల్
వల్లభు లగ్నిపాల్పడఁగ వందురు కాంతలు గల్గి తూలె వ
ర్థిల్లి మహానలంబు పురిఁ దేఁకువఁ గాల్పఁగ శోకపూర్ణమై.

తే॥గీ॥ కడఁగి మారుతి వాలమ్ముఁ గాల్ప నెంచి
జ్వాలను దఱిఁగొల్ప సర్వనాశమ్ము గలిగెఁ ;
బరుల వంచింపఁగోరు నభవ్యమతికి
నాత్మనాశంబు గల్గుట యబ్బురంబె !

తే॥గీ॥ సజ్జనోత్తముఁడగు విభీషణు గృహంబు
వసుమతీసుత నిల్చిన పాదపంబు
దక్క నా లంకయెల్ల దగ్ధమ్మునర్చె
జతుగృహం బట్లు వాలసంజాత వహ్ని.

మ॥ పవనాత్మజుఁ డిట్లు తత్పురము సర్వం బగ్నిపాల్చేసి యా
లవణాంభోనిధి గ్రుంకువెట్టి నిజవాలం బార్చి శ్రీజానకీ
సవిధంబొంది యనామయం బడిగి మైమెత్తోకేశుఁ జేరంగఁ "బో
దు వరాబ్జాక్షి! యనుజ్ఞ యి" మ్మనఁ, గపీంద్రుం బల్కె నుద్విగ్న యై.

కం॥ "నిను జూచునంతకాలము
మనమున నుల్లాస మెసఁగె మారుతపుత్రా!
చనఁబోవ దిగులు పొడమెడుఁ
జను శీఘ్రము కార్యభరము చక్కంబరుపన్.

కం॥ చూడారత్నముఁ జూచిన
తోడనె విభుఁ డొందు విరహదుఃఖ మ్మెదఁ, గా
పాడగ వేడుము లక్ష్మణుఁ
బ్రోడవు; చెఱఁబాపు, హనుమ! పొ" మ్మని పలికెన్.

చం॥ వలఁగొని జానకీమృదులపాదయుగమ్మును మ్రొక్కి యశ్రువుల్
దొలుక ననుజ్ఞవొంది యరిదుర్జయుఁ డభ్రపదంబుఁ బట్టి, యు
జ్జ్వలశరతీవ్రవేగమున సాగరముగ్ దరియించి యంబరాం
చలమునుండి "చూచితిని జానకి" నంచు వచించి చెచ్చెరన్.

తే॥గీ॥ ఉన్నతవిశాలకరినశిలోచ్చయంబు
నందు మారుతి యల్లన నవతరించె
కుంభితప్రాణమారుతోజ్జృంభణంబు
సడలఁ గరపాదరోధంబు గడవఁబెట్టి.

తే॥ పవనసుతుఁ జూచు నక్కపీశ్వరకులమ్ము
ప్రాణసంయుక్తదేహాళి పగిది నొప్పి
జలజహితు రాకచేఁ దమ్మికొలనుబోలి
యభినవోన్మేషశోభిత మయ్యె నంత.

ఉ॥ మారుతిచుట్టు మూఁగి బలమాన్యులు జానకియున్న రూపు దే
వారులవర్తనంబు లవణాంబుధి దాఁటినరీతిఁ దెల్పగాఁ
గోరినఁ బూసఁ గ్రుచ్చినటు గొంచక సర్వముదెల్పి లంకపైఁ
బాఱి సురారులం దునిమి భామినిఁ దెత్తము చాలమేలనన్.

ఉ॥ జాంబవదాదులంత "నృపచంద్రుని సన్నిధిఁ జేరి యెల్ల కా
ర్యంబు వచించి నెమ్మి నుచితానుచితంబు తెఱంగెఱింగి శాం
తంబునఁ గీడుమేల్దరసి దైత్యవధంబున కాజ్ఞవెట్ట లం
కం బొరిపుచ్చి యాత్మభుజగర్వముఁజూపుట కార్య మా" ననన్.

తే॥గీ॥ అంగదాదులు హృష్టచిత్తాబ్జు లగుచు
పోవఁ గడగిరి కిష్కింధపత్రోవఁబట్టి
మార్గమునఁ గాంచి తరుచరుల్ మధువనంబు
తేనియలఁ గ్రోల నాజ్ఞ నర్థించి రెల్ల.

కం॥ కృతకార్యు లగుట వానరు
లతిహర్షముతోడ మధువు లానిరమేనిన్
బతికోప మొందఁ డనుచును
జితకాశి మరుత్సుతుండు చెప్పెన్ దోడ్తోన్.

⇐ వానరులు మధువనము భంగించుట ⇒

తే॥గీ॥ వనములోఁ జొచ్చి ఫలములఁ దినుచు జుంటి
తేనె లానుచు వనచరుల్ దిరిగి రెలమిఁ
ద ద్వనాధికృతుం డగు దధిముఖుండు
బలిమివారింప నుబ్బున భంగపఱిచి.

సీ॥ ఫలవృక్షముల నెక్కి పండ్లగుత్తుల ద్రుంగి
తలక్రిందుగా వ్రేలు తనిసి యొకఁడు,
తేనెపెఱకుఁ ద్రాఁకి తీపుతేనియఁ గ్రోలి
వశమేది నేలపైఁబడు నొకండు,
తనివొంది వేఱొక్క తరుచరు కుఱువుపై
పండించి కండూతిఁ జూపు నొకఁడు,
కిలకిలధ్వనితోడఁ గేరింతలకుఁ జొచ్చి
పఱచి ద్రూఁకుల భంగపఱచు నొకఁడు,

తే॥గీ॥ వృక్షశాఖాగ్రవీథుల వ్రేలియాడి
యింకొక మహీజశాఖపై కెగురు నొకఁడు
ధరణిజావృత్త మెఱిఁగి వానరులు హర్ష
భరముతో నిట్లు లీలమైఁ దిరుగుచుండ.

తే॥గీ॥ భంగమొందిన తద్వనపాలుఁ డంత
వాయుజనమున సుగ్రీవుపాలి కరిగి
వానరు లొనర్చు మధువనభంగ మాత్మ
భంగమును దెల్పె నతికోపభరితుఁ డగుచు.

తే॥గీ॥ అంగదాదులు వచ్చిన నవనిపుత్త్రి
వృత్త మెఱుగంగఁదగు నని వేఁచియుండ
వచ్చిరనియును మధువనభంగమునకుఁ
బూనిరని తెల్ప రవిజుండు ముదముఁజెంది.

ఉ॥ "జానకిఁజూచి యుబ్బునను జాంబవదంగదముఖ్యు లీక్రియన్
బూనిరి తేనెలాన! నది పోలును; వేఱొక లైన భీతులై
దీనతఁదోఁప రారె? మితిఁదీరిన వత్తురె? మెచ్చవచ్చె! నా
యానఁగఁ జెల్పి పుచ్చు మిట కాదరమొప్పగ వారి నెల్లరన్".

తే॥గీ॥ అనుచుఁ బుత్తెంచె సుగ్రీవుఁ డా కపీంద్రు;
నంబరంబున నిల్చి రాజాజ్ఞఁ దెల్పి
భక్తిఁబూజించి పంపె నా వానరాళి
ప్రభువు లెదమెచ్చ భృత్యులు భక్తిఁ గనరె?

తే॥గీ॥ వాయుపథమునఁ గదలి యా వానరులును
రామసుగ్రీవసన్నిధి వ్రాలి మ్రొక్కి
బద్ధకరపుటులై నిల్చి పల్కి రిట్లు
"సీతఁగాంచితి" మంచు సంతుష్టగతిని.

చం॥ అమృతపుసోనలై చెవుల నప్పలుకుల్ చొర రాముఁ డంత సం
భ్రమమున మందహాసరుచిరం బగు వక్త్రము శారదాబ్జసా
మ్యమును వహింప "నెచ్చట ధరాత్మజ యున్నది? యెట్టులున్న దా
రమణినిఁ గాంచి రెవ్వరు? కరంబు మదాప్తులు వారు తెల్పరే".

ఉ॥ నావుడు వాయుసూతి రఘునాథుపదంబులనంటి మ్రొక్కి "యో
దేవ! భవత్కృపర్ గపులధీరత వారిధిదాఁటి లంక నల్
గ్రేవల భూసుతన్ వెదకి స్రీతి నశోకవనంబుఁ జొచ్చి యా
దేవి నెఱుంగఁగంటి నతిదీననుఁ జేర్కొన రామనామమున్.

సీ॥ సతతధారగ నశ్రుజలము కన్గవ డిగ్గి
కాల్వలై చెక్కిళ్లఁ గారుచుండ,
నిడుపైన వేసలి జేడగట్టి పరుసనై
కటిభాగమునఁ ద్రాఁచు కరణి వ్రేల,
మలినమై జీర్ణమై మైఁ గప్పు పుట్టంటు
పద్మిని జుట్టు శైవలముఁ బోల,
వనఁటుల జిక్కి లావణ్యంబు దొఱఁగక
మెయిఁదీవ క్రొమ్మించు మెఱుఁగులీన,

తే॥గీ॥ కూడుకూర్కులు నెఱుఁగక ఘోరవిపిన
సీమ వసియించి చెక్కుటఁ జేయిచేర్చి
మదిని త్వత్పాదపద్మముల్ పదిలపఱచి
తపముసాధించు మునిఁ బోలి ధరణిజాత.

తే॥గీ॥ అంగుళీయక మీయ నా యవనిజాత
మోదభరమున మిన్నందె; ముద్దువెట్టె;
త్వత్పదాంబుజసన్నిధి వ్రాలినట్లు
తలఁచి పొలయల్కఁ బూనె నాత్మను గెలంగ.

ఉ॥ పంకజగంధి సీత పడుపాములు చెప్పఁగ నోరురాదు; ని
శ్శంక నిశాచరాంగన లజస్రముఁ దిట్టి దురుక్తు లాడ, నా
వంకకు బోక తారకజపం బొనరించుచు నిల్పుఁ బ్రాణముల్
గంకణమయ్యె నుంగరము కామిని కే మనువాఁడ రాఘవా!"

తే॥గీ॥ అని చూడారత్నంబును
మనుజేశునిచేతి కిచ్చె మారుతి; సీతా
తనుగాత్రిహృదయ మట్టుల
కని యక్కునఁ గ్రుచ్చె ధరణికాంతుఁడు దానిన్.

చం॥ మరల మరుత్సుతుం డనెను, "మానవనాథ! ధరాత్మజాత నే
నరసి, దశాస్యుఁ జూడఁ దనుపారెడు తద్వని భంగపుచ్చి, నన్
దరిసిన దైత్యులం దునిమి దానవనాథునిజేరి పాడిమై
గఱపి హితమ్ము, తత్పురముగాల్చి నగంబు జయించి వచ్చితిన్.

తే॥గీ॥ వజ్రనిష్ఠురమార్గణవహ్ని దైత్య
వల్లభునిఁగాల్చి ధరణిజఁ బడయుఁగెలవు
తడయకయ లెమ్ము కపులతో దండువిడియ
నదను సు మ్మిది" యని పల్కె ననిలసుతుఁడు.

శా॥ "సీతం గాచితి వుంగరం బొసఁగి తచ్చీమంతరత్నంబు సం
ప్రీతిం దెచ్చి యొసంగి కాచితివి నన్, వీరాగ్రణీ! నిన్ను నే
రీతిన్ సత్క్రియఁ జేయనేర్తు? చిరకీర్తిం బొందుమా" యంచు ప్ర
స్ఫీతప్రాంశుభుజద్వయంబునను నాశ్లేషించె శ్రీరాముఁడున్.

క॥ అనితరలభ్య రఘూద్వహ
ఘనభుజబంధంబు నొంది కపి హృష్టుం డై
మునుముట్ట నీఁగె మది రా
వణకృత పైతాపహారప్రబంధావమతిన్.

క॥ అని యిట్లు కవలు రావహా
యణ సుందరకాండవృత్త మంతయుఁ దెలుపన్
విని రాముఁ డడిగె నవ్వలి
తనచరిత మెఱుంగఁ జెప్పఁ దగ నా కవలన్.

చం॥ అతులితపుణ్యవై భవ! భవాంఘ్రిసరోజయుగైకభావనా!
వితతయశోవిలాస! చిరవిశ్రుతదానగుణైకభూషణా!
సతతసమస్తలోకహితశాశ్వతకార్యవిధానతత్పరా!
నుతగుణరమ్యవిగ్రహా! యనుత్తమసజ్జనలోకపూజితా!

క॥ అనితరలభ్యసుకీర్తీ!
జననందితభవ్యసుగుణసన్నుతమూర్తీ!
వినుతోత్తమపథవర్తీ!
అనవరతహృతాఖిలాశ్రితానేకార్తీ!

సుగంధి వృత్తము :— మేరుమందరాద్రిధీర! మిత్రలోకనందితా!
సారపుణ్యధర్మకర్మ! సజ్జనాభివందితా!
చారుచిత్రనీతిమార్గసంచితార్థసంచయా!
ధారుణీసురేంద్రదత్తదానధర్మసత్క్రియా!

గద్య॥ ఇది శ్రీమత్కాశ్యపగోత్ర పవిత్ర సుబ్రహ్మణ్యపుత్త్ర
బుధజనవిధేయ వేంకటసుబ్రహ్మణ్యనామధేయ
ప్రణీతం బైన శ్రీరఘురామచరిత్రంబునందు
సుందరకాండము.

శ్రీః

శ్రీ శారదాంబాయై నమః.

# శ్రీ రఘురామ చరిత్రము

## యుద్ధకాండము

కం॥ శ్రీరమ్యాభరతమాతృ ప
దారుణసరసీజసేవనైకార్థజనీ !
కారుణ్యామృతపారా
వారాయితహృదయ ! స్వామిబాబు ! వదాన్యా !

కం॥ అవధారు ; కుశలచిత్తులు
కవ లవ్వాలికథను దెల్పఁ గడఁగిరి యిట్టుల్
రవికులవల్లభు మ్రోలన్
దవిలి సభాస్తారు లెల్లఁ దత్పరత వినన్.

తే॥గీ॥ జానకీవృత్త మరసి యా జనవిభుండు
రాక్షసకులంబుతో దైత్యరాజుఁ జంపి
లంక ముంచంగ నడిచెఁ జేలంబు పూని
పొంగు నుద్వేలవానరాంభోధితోడ.

సీ॥ తరుచరపృతనాపదక్రమక్రమమున
ధరణీతలమ్ము గర్తమ్ముగాఁగ,
వానరవాహినీపాదోత్థరజమున
దశదిశాభోగ మాంధ్యము వహింప,
ఋక్షవానరచమూపృథుపాదఘట్టన
శేషపీవరఫణాసీమ లడఁగఁ,
గపివీరసైనికగర్జారవంబులఁ
బరిపంథిహృదయముల్ పగులువార,

తే॥గీ॥ గణనమీఱిన వానరగణముతోడ
ధరణితలమును నంబరతలము గప్పి
కదఁగి దండెత్తి లంకపై నడిచె రాముఁ
డంబురుహమిత్రసూతి సాహాయ్య మూన.

సీ॥ సేనాని యై రణస్థిరవిక్రమాఢ్యుఁ డై
నీలుండు బలరక్ష నెఱపుచుండ,
వాస్తుశాస్త్రరహస్యపారజ్ఞుఁ డై నలుం
డధ్వసంశోధన మాచరింప,
ఆశ్వినేయులఁబోలి యఖిలౌషధులచే సు
షేణుఁ డార్తి తొలంగఁ జేయుచుండ,
భల్లూకగణపరివారంబుతో జాంబ
వంతుండు కుక్షి కాపాడుచుండ,

తే॥గీ॥ ఉన్నతగ్రీవుఁ డౌచు నా యోధవరుల
నెల్ల సుగ్రీవుఁ డెంచి శాసించుచుండ,
సర్వవానరసేన యుత్సాహపడుచుఁ
గదలి నడిచెను నేల గ్రక్కదలుచుండ.

కం॥ పవనాత్మజుమూఁపున రా
ఘవుఁ డధిరోహణమొనర్చి ఖగవాహుక్రియన్
జవమున నేఁగెను లక్ష్మణుఁ
డవలం దారేయు నెక్కి యట నేఁగె వడిన్.

తే॥గీ॥ కొండలెక్కుచుఁ గానలనుండి చనుచు
నదుల దాఁటుచుఁ గోలఁకులఁ గదియఁజనుచు
గడచి వానరవాహిని విడిసె నల్ల
కడలియొడ్డున వే ఱొక్క కడలిపోల్కి.

తే॥గీ॥ స్వప్రియాపారదుస్తరవిప్రయోగ
వార్ధి మున్గుచు శ్రీరామభద్రుఁ డల్ల
యంబురాశిపరిక్షేప మాత్మఁ దలఁచు
లంకఁ జుట్టినపరిఖాంబులఘువు గాఁగ.

ఉ॥ అంబుధి భక్తిఁ గొల్చి సుగుణాంబుధి రాముఁడు త్రోవవేఁడ, గ
ర్వంబున మిన్న కుండె జలరాశి; రఘూద్వహుఁ డగ్నికల్పచా
పంబును గేలఁ దాల్ప భయభక్తులు పైకొన ముందునిల్చె; లో
కంబున సాధు గేలిగొని గాఢరుషార్తుల గారవింపరే!

ఉ॥ అంజలిచేసి రామునకు నంబుధి పల్కె శిలోచ్చయాళి తే
లం జలమందు సేతువు విలాసముగా నలుఁ డొప్పుఁ గట్ట నీ
నెంజలివాయు వానరులు నెమ్మి ధరాధరపంక్తిఁ దెచ్చినన్
గాంచనపుంఖమార్గణనికాయము నేయక నన్ను గావవే!

తే॥గీ॥ అనఁగఁ గరుణించి రాముఁ డా యాశుగమ్ము
వార్ధిపంపున ద్రుమకుల్యపైని బఱపె;
సేతు వొనరింపఁ బ్రార్థించి ప్రీతి నలుని
వానరుల నద్రులనుఁ దేర నాన తిచ్చె.

## రావణుండు మంత్రులతో నాలోచించుట

కం॥ తరుచరసేనావృతుఁ డై
నరవరుఁ డటురాక దైత్యనాథుఁడు విని దు
ర్భరచింత నాప్తసచివులు
దఱియన్ గొలువుండి కార్యతత్త్వము తెలుపన్.

ఉ॥ ఒక్కనిశాచరుండు కపియోధులతో రఘువంశ్యుఁ బట్టి తా
నుక్కున మ్రింగివత్తు ననె; నొక్కఁడు వారలచింత యేలనన్
మ్రుక్కడు లావరాకు లిటు పోటునకెత్తిరె యంచు నవ్వుచున్
ముక్కున వ్రేలునిల్పె నొకముష్కరుఁ డామెడ ఱిచ్చవాటునన్.

ఉ॥ అంత విభీషణుండు దనుజాధిపుతో నిటుపల్కె "సీత భూ
కాంతున కిచ్చు టొప్పగును; గార్య మెఱుంగరు వీరు; వానరుం
డంత యొనర్చె నొక్కరుఁడె; యంతకుమించినవార లెందఱో;
యింతకుఁ బోరు మేలె? యొరునింతి హరించుట ధర్మమార్గమే?

తే॥గీ॥ పోటుమానుసులటు వీరు పోర దింపి
చేటు గలిగింతు రవ్వలఁ జేవఁ దక్కి-
కలయఁబరికింప నేరరు కార్యగతుల
నరయుమా పాడి నియ్యెడ నసురనాథ!

ఉ॥ జానకిఁ గాన్కతోడ నృపచంద్రున కిచ్చుట మేలు; లంకతో
దానవజాతి పెంపుఁ గను; దక్కిన రాఘవబాణవృష్టిమై
వానరసైన్యసాగరము బల్మిని ముంచును లంక; నీ మతిన్
మానుము; సాధ్వి నంపు రఘునందనుపాలికి దైత్యపాలకా!"

కం॥ అనఁ గనలు గదిరి తమ్ముని
దునుమం గమకించె రోషదూషితుఁ డగు రా
వణుఁ డాప్తు లుడిపి రంతటఁ
జనుమెందే ననుచుఁ దన్ని చరణాగ్రమునన్.

తే॥గీ॥ కొలువు వెడలించె; నాతఁడు కూర్మి తల్లి
పజ్జకుంబోయి తనపడ్డ భంగపాటు
నన్నయానతిఁ దెల్ప నాయమ్మ రాము
నడుగులంగొల్చి బ్రదుకుమం చాజ్ఞవెట్టె.

తే॥గీ॥ వార్ధికూలంబునం దున్న వసుమతీశు
వెలువునను జేరఁదలఁచె విభీషణుండు;
నెమ్మి రాక్షసలక్ష్మ తా నీతిఁగలిపి
పలికినట్టుల రాఘవు శరణువేఁడ.

## ⇐ విభీషణ శరణాగతి ⇒

ఉ॥ తోడనె మంత్రిసత్తములతో గగనాధ్వముబట్టి రాఘవుం
జూడ మనంబు క్రేళ్ళురకఁ జొక్కుచు వారిధిపారమొంది, యి
ట్లాడె; "దయాబ్ధి; కావు! శరణాగతు రావణుతమ్ము నన్ను" నా
నోడకు నిన్ను గాతు నని యోజ దినేశకులుండు పల్కెనర్.

కం॥ తగదని సుగ్రీవుం డనెఁ;
బగతుర నెపమనుచు జాంబవంతుఁడు పలికెన్
వగపుట్టు ననియె నంగదుఁ
డగు నెయ్యమొనర్ప యోగ్యుఁ డనె మారుతియున్.

చం॥ పరమకృపన్ రఘూద్వహుఁడు పల్కెను "వానరులార! దీనతన్
శరణని చేరవచ్చిన నిశాచరు రావణుతమ్ముఁ డంచు నే
నఱక పరిత్యజింతునె? మదోద్ధురుఁ డైన దశాస్యుఁ డేని నన్
దఱిసినఁ గాతుఁ గాక నిజధర్మము నారడిఁపుచ్చ నేర్తునే?

చం॥ అభయముఁగోరు భూతతతికంతకు నే శరణం బొసంగెదన్
శుభములఁ బెంచెదన్, విపులశోకవినాశ మొనర్తు; సత్క్రియా
విభవములందుఁ బెద్ద భయభీతుల గాచుట; కాన దైత్యునిన్
నభముననుండి దింప ధర నాసవిధంబున నిల్పుఁ డింపుమై".

తే॥గీ॥ నా నరేశ్వరు నార్తసంత్రాణగుణము
మెచ్చి కీర్తించెఁ దరుచరబృందమెల్ల
వేడ్క గగనంబు డిగ్గి విభీషణుండు
రామపదపద్మముల మౌళి రాయ నిలిచె.

చం॥ ఎఱిఁగి తదాశయంబు మనుజేశుఁడు దానవరాజ్యలక్ష్మికిన్
బరివృఢుగా నొనర్తు ననిపల్కి సముద్రజలంబు దెచ్చి, స
త్వర మభిషిక్తుఁజేసె గుణధన్యు విభీషణు; నీతిబీజ మె
త్తఱి విపులార్థసత్ఫలముఁ దా నొడఁగూర్పదె కల్పశాఖ నాన్.

సీ॥ రామకార్యార్థమై రత్నాకరం బంత
రాహార్యములఁ దేల్చి యంపె ననఁగ,
అంభోధి కలఁగఁ ద దంతస్థభూతముల్
జాలి పెల్లున నీటఁ దేలె ననఁగ,
శౌరికిఁ దోడ్పాప క్షీరాంబునిధి వీడి
శేషాహి యచట వసించె ననఁగ,
తనపట్టి చేబట్ట మనుఁగోటి యత్తరి
చూచి మున్నిటిపైఁ జాచె ననఁగ,

తే॥గీ॥ ఆరవిశశాంకముగ రఘువీరు కీర్తి
భూతలమ్మున నిల్వ నంభోధిలోన
వానరులచేత సేతువు బద్ధమయ్యె
దనుజధైర్యంబుతో లంక దద్దరిల్ల.

తే॥గీ॥ సేతువున నంబునిధి దాఁటి చేరి లంక
చుట్టు నరిగట్టి రాఘవుఁ డట్టె నిలిచె;
హేమపింగళకపితనూధామభూమ
మపరకనకంపుఁబ్రాకార మట్లు దోఁప.

⇐ అంగదు రాయబారము ⇒

తే॥గీ॥ అంగదకుమారు రాఘవుఁ డంపె దైత్య
పతికిఁ దగురీతి నీతియు హితవుఁ దెల్పి
రాయబారంబు నెఱప; నా రామదూత
బఱచి గగనంబునఁ దైత్యపతినిఁ జేరె.

చం॥ "ఎవఁడవు? వానరా!" "రఘుకులేశుని దూతను;" "మున్ను వచ్చె నా
పవనజుఁ డెందుఁబోయె నటు భస్మమొనర్చెను లంక; నాతఁ డా
చవట! మగంటిమే యిది? నిశాచరబద్ధుఁడ వైతి వేల యం
చవలకుఁ ద్రోయ వానరులు న్యక్కృతి బాలిశుఁ డెందుఁ బోయెనో?"

ఆ॥వె॥ "దానికేమి దైత్య! తగు మాట లాలింపు
సీత నిచ్చి రాముఁ జేరవచ్చి
శరణువేఁడు దైత్యసంతతిఁ గాపాడు
చెడక నిలుము కామ మెడసి మనుసు.

చ॥ నిను నొకఁ జీరికింగొనక సీరధిఁ గుంచిన వీరు నొక్క తూ
పునఁ దునుమాడె; దోర్బలము పూనికిఁ గార నడంచు కార్తవీ
ర్యునిఁ బోరిఁగొన్న భార్గవుని నోర్చె ధనుర్గ్రహణంబుమాత్ర నా
మనుకులవర్యు నెక్కరణి మార్కొని నిల్వఁగ నోర్తు రావణా!

చ॥ ధరణితనూజ నిచ్చి యుచితంబుగ నమ్రత రక్షఁ గోరుమా
శరణని రాముపాదజలజంబుల గొల్చెదొ? శూరవృత్తి మై
దురమున నిల్చి దోర్బలముఁ దోఁపగ రాఘవమార్గణాళి పెం
పటి నశియింతువో? దనుజ! యారసి యొక్కటి నిశ్చయింపుమా!"

కం॥ అను నంగదు రోషమ్మునఁ
దునుమం గమకించు దుష్టదోషాచరునిన్
దన కాలఁ దన్ని మాళిన్
జనె రాఘవుఁ జేరఁ గపియు శౌర్యం బొప్పన్.

## ⇐ దైత్య వానరుల యుద్ధము ⇒

తే॥గీ॥ ప్లవగరాక్షసకృత వీరభాషణమ్ము
ఘుష్ట రామ రావణ జయఘోషణమ్ము,
విక్రమారబ్ధరిపుబలపేషణమ్ము
భీషణమ్ము రణమ్ముఁ బ్రవృత్త మయ్యె.

సీ॥ బహుధా పరిక్షిప్త పాదపాఘాత సం
భగ్నాతిదృఢలోహపరిఘగణము,
సంఖ్యాతిగతశిలోచ్చయపాతచూర్ణిత
భూరి నిష్ఠురకూటముద్గరమ్ము,

వజ్రనిష్ఠురనఖభల్లదంష్ట్రాగ్రటంక
సంకృత్తదారుణశస్త్రచయము,
దంభోళిసమముష్టిసంభిన్నదిగ్దంతి
సమకుంభిపటుకుంభసముదయంబు,

తే॥గీ॥ వనచరానీకమర్దితదనుజకులము,
నిర్భరానందవీక్షితనిర్జరంబు,
విష్టపత్రయసంతోషవితరణంబు
శూరజనతోత్సవం బయ్యె ఘోరరణము.

ఉ॥ శూరుఁడు మేఘనాదుఁ డనిఁ జొచ్చి పరాక్రమలీల రాముతోఁ
బోరి త దాశుగాహతులఁ బొల్పరి నిల్వఁగ నోడి భీతుఁడై
పాఱి నభంబునం జలదపంక్తుల డాఁగి యదృశ్యమూర్తి యై
క్రూరశిలీముఖంబుల నకుంఠితుఁడై ఖరి నేసె నీసునన్.

కం॥ ప్రతివీరు నరయఁ జాలమిఁ
బతదాశుగవృష్టిఁ జాప వశ మేదిన యా
క్షితివరులఁ గపులఁ దోడ్తోఁ
బ్రతిహతులం జేసె నసుర బాణచ్యుతులన్.

చం॥ నెఱకులుగాఁడి మూర్ఛవడి నేలను వ్రాలిరి సర్వవానరుల్
సరసిజమిత్రుఁ డస్తగిరిచాటున కేఁగె ; దమంబు పర్వెఁ ; బెం
పరియు విభీషణుండు మరుదాత్మజుతోడ నలాతహస్తుఁడై
యరయుచు నెల్లవానరుల నారసె నొక్కెడ జాంబవంతునిన్.

తే॥గీ॥ మూర్ఛఁ దేఱియు కాల్సేయి ముడిచికొనుచు
బోరగిలఁబడి యవశుఁడై మూల్గుచున్న
జాంబవంతున కనియె నిశాచరేంద్రుఁ
"డుసురుతో నుంటివే తాత ! యసురజేత !"

చం॥ విని యది జాంబవంతుఁడు విభీషణు పల్కుల గుర్తెఱింగి "యా
యనిలజుఁ డున్న వాఁడె? సుఖియై?" యని ప్రశ్న మొనర్ప నల్ల "పా
వనిసుఖ మేల నారసితి? వానరనాయకు రాఘవేశులన్
మును గణియింపవో? రధికముఖ్యులఁ గానవొ" నా నతం డనున్.

తే॥గీ॥ "ప్రాణములఁగూడి యాజగత్ప్రాణసుతుఁడు
నిలువ మనకెల్ల ప్రాణముల్ నిలిచినట్లు
ప్రాణముఁ దొఱంగెనేని నవ్వాయుసుతుఁడు
బ్రదికియుండియుఁ జచ్చినవార మెల్ల."

ఉ॥ నావుడు వాయుసూతి చరణంబులపైఁబడి పేరు తెల్పి "తా
తా! వచియింపు కార్యగతిఁ; దప్పక తీర్తు ననాహతుండ నై
యీవిధి సేమ ముంటి"నన ఋక్షకులేశుఁడు పొంగి యాత్మలోఁ
"బావని! నీవు గల్ల నిఁక భద్రము గల్గదె మాకు నెల్లెడన్.

తే॥గీ॥ అరుగు ముత్తరదిశకు; హిమాద్రి దాఁటఁ
గలుగు ద్రోణాచలం బోషధులకు నెలవు
దానిఁ గొనివచ్చినన్ మనవారి కసుర
బాణసంజాత దుర్వ్యథల్ పాయు" నన్న.

చం॥ గగనగతిన్ సుపర్ణునటు గాఢజవంబునఁ బాఱి మంచుగొం
డఁ గడచి ద్రోణశైలము హుటాహుటిఁ జేరియుఁ గాంచ కోషధుల్
నగము పెకల్చి దోర్యుగమునం గొనివచ్చె నిమేషమాత్రలో;
నగచరు లోషధీపవన మాని గతవ్యథు లైరి చెచ్చెఱన్.

ఉ॥ రామునిజంపి తచ్ఛిరము రక్తముతోఁ గొనితెచ్చి తంచు సా
ధ్వీమణి సీతకున్ దనుజవీరుఁడు కల్పితరామశీర్షమున్
భీమముఖంబుఁ జూప నతిభీతి ధరాసుత నేలవ్రాలె; నా
కామినిఁ దేర్చెఁ బో! సరమ కల్పిత మిద్ది యటంచుఁ దెల్పుచున్.

తే॥గీ॥ విభుఁడు సప్రాణుఁడై యుంట విని యమంద
హర్షభరమున మిన్నంటె నవనిజాత!
మున్ను మృతుఁడయ్యె నని విని మూర్ఛనొంది
ప్రాణములఁ బాయ నని సిగ్గుపడియె సాధ్వి.

సీ॥ మరుదాత్మజుఁడు జంబుమాలిఁ గూల్చె, విభీష
ణుఁడు చంపె మిత్రఘ్నుఁ గడఁగి పోర,
మైందుచే నశనియు మడిసె, ద్వివిదునిచే
వజ్రముష్టియు గతప్రాణుఁ డయ్యె,
గజునిచే విఘసుండు గతజీవనుం డయ్యె,
బ్రఘసు సుగ్రీవుండుఁ బాపె నుసురు,
ప్రతపనుండును నల హతుఁడయ్యె, నా సుషే
ణుండు విద్యున్మాలి గండడంచె,

తే॥గీ॥ రాఘవుం డగ్నికేతువు రశ్మికేతు
యజ్ఞకేతువు సుప్తఘ్ను నరసి చంపె;
అంగదుం డింద్రజిత్తుపై నడరి పోర
విరథు నొనరించె విక్రమాభీలుఁ డగుచు.

శా॥ ఆ రాజన్యుల మేఘనాదుఁ డఁట నాగాస్త్రంబునన్ గట్టి తాఁ
బోరం గెల్చినభంగి సంతసమునన్ పొల్పొందె; నా సర్పముల్
పారెన్ గారుడపక్షమారుతము పైఁబర్వన్ భయం బొంది; యా
ధీరోత్తంసుల కద్ది స్వప్నకథయై దీపించె నిర్బాధ మై.

సీ॥ ధూమ్రాక్షుఁ జూర్ణించి ధూళిపాలొనరించె
వాయుపుత్త్రుఁడు శిలావర్షణమున,
వజ్రదంష్ట్రుని జంపి వానరానీకమ్ము
నంగదుఁ బాపె నాయంగదుండు,

చంపి యకంపను జన్యస్థలంబున
పవనాత్మజుఁడు మేటిబలము చూపె,
శస్త్రవిక్రముని బ్రహస్తు విధ్వస్తుఁ గా
వించె నీలుఁడు ప్రతాపించి మిగుల,

తే॥గీ॥ రావణుఁడు సైన్యములఁగూడి రాముతోడ
బవర మొనరింపఁ గలనికి బయలువెడలె;
వానరేశుఁడు దశకంఠుఁ బట్టి నిల్పి
చిక్కువడఁజేసి మూర్ఛిల్లె స్రుక్కి పోర.

ఉ॥ అంతట నంజనాతనయుఁ డడ్డగుచొచ్చి పరాక్రమించి ధీ
మంతుఁడు నిల్చి "దైత్యపతి! మా కొనరింతువొ చే నడంతువో
స్వాంతమునందు నెంతు నినునంతటి వీరు నెదిర్చి పోర;" నా
నంతకభీముఁ డై దనుజుఁ డాతని ముష్టిహతుం బొనర్చినన్.

తే॥గీ॥ పిడుగు పైఁబడ్డ పెనుగొండ వడువు దోఁప
వాయుసుతుఁ డట్టె యొక్కింత వ్రాలి యవలి
క్షణములోఁ దేఱి దైత్యేశుఁ గని వచించెఁ
"గాఁచుకొ మ్మిదె బలుముష్టి వైచువాఁడ".

మ॥ అని వజ్రోపమముష్టిఘాతమున దేవారాతి వక్షస్స్థలం
బునఁ దాడించె మరుత్తనూజుఁడు; సముద్భూతార్తి దైత్యుండు గ్ర
న్ననఁ గ్రొన్నెత్తురు గ్రక్కుచున్ బడెను జన్యక్షోణి మూర్ఛిల్లి; యం
తన మేల్కాంచి వచించె ముష్టిహతి సంతాపింప నీ తీరునన్.

ఉ॥ "వీరుఁడ వౌదు; నీబలము పెద్ద; మగంటివి మెచ్చనయ్యొ; నే
పోరుల నిట్టి బెట్టిదపుముష్టిహతిన్ జవిచూడ మున్ను" నా,
మారుతి పల్కె "నాబలము మ్రగ్గెను ముష్టిహతుండ వయ్యు నీ
తీరున లేవనేర్తువొకొ? తేకువఁ బెల్లుగనున్న రావణా!"

క॥ అను నంతలోన దినమణి
తనయుఁడు చైతన్యమొందె; దైత్యేశునితో
నని సేయ సుమిత్రాత్మజుఁ
డనుమతి నర్థించె రాము నతికౌతుకి యై.

ఉ॥ అన్న యనుజ్ఞ నొంది దనుజాధిపు ముందట నిల్చి వీర్య సం
పన్నుఁడు లక్ష్మణుం డసురవల్లభు దోర్బలవారిరాశికిన్
సన్నుతబాహుశక్తి నవిమహ్యాబలోజ్జ్వలవేల యౌచుఁ దాఁ
గ్రన్నన విల్లుద్రుంచి విశిఖప్రకరంబుల నొవ్వ నేసినన్.

ఉ॥ ఒండొకవిల్లు బూన నదియున్ దగ భగ్నమొనర్చి రావణున్
ఖండితచాపుఁ జేసి ఘనకార్ముకకౌశల మెల్లఁ జూపె నా
దండిమగండు; దైత్యపతి దానికి నోర్వక శక్తివైచి దో
శ్చండిమఁ దోఁప లక్ష్మణుని జన్యమునన్ ధరఁద్రోసి మూర్ఛిలన్.

ఉ॥ కూడి రఘూద్వహానుజు నకుంఠితశక్తి హరింపఁజూడ న
ల్లాడె సశైలకాననదిగంతమహీస్థలి గాని లక్ష్మణుం
డోడి చలింప డింతయు; మహోగ్రమహీధరమెత్తు బాహువుల్
పోఁడిమిదక్కి లా వెడలె; పొల్పఱె దైత్యుఁడు లజ్జ పెంపునన్.

తే॥గీ॥ అంత మారుతి యఱచేత నసుర నడిచి
నేలఁ బడియున్న లక్ష్మణు లీలనెత్తి
బెండుకైవడి కొంపోయె; వీరుఁడన్న
మారుతాత్మజుఁడే గద మహితబలుఁడు.

తే॥గీ॥ అసురపతిశక్తి హతి మూర్ఛ నణఁగియున్న
యనుఁగుఁదమ్ముని జూచి యాయవనివిభుఁడు
శత్రునిర్ముక్తమార్గణాక్షతుఁడు నయ్యు,
శోకశల్యోపహతుఁ డైన చొప్పుఁ దోఁచె.

ఉ॥ శూరవరేణ్యుఁ డానృపుఁడు శోకభరమ్మును ద్రోచి, రావణుక్
జీరి, రణంబొనర్చి, ధృతిఁ జేడ్పడ మార్గణరాజిఁ గప్పినక్,
మారొనరింపలేక వెఱమ్రాన్పడె దానవరాజు నెత్తురుల్
వారఁగ ; జూచి రాఘవుఁడు పల్కెను ధైర్యగుణప్రశస్తుఁ డై.

తే॥గీ॥ "దనుజనాయక ! యనిసేయ ననువు కాదొ ?
యలసితివొ ? నేఁడు నగరికి నరిగి త్రేపు
సమరసన్నాహమున రమ్ము చేలమువిూఱ
వీరవిక్రమసంపద విందు గుడుప."

ఉ॥ నా వెఱగంది సిగ్గున మనంబునఁ గుందుచు నేఁగె రావణుం ;
డావిధ నున్న లక్ష్మణుని నక్కునఁజేర్చి రఘూద్వహుండు సు
గ్రీవునితోడఁ బల్కె నిటు "కీడ్వడె లక్ష్మణుఁ డింక సీతకై
యే వగఁజెంద నేల ? దనుజేశునిఁ జంపఁగనేల ? వమ్ముగా.

తే॥గీ॥ వసుధ నెల్లెడ భార్యలఁ బడయవచ్చు
బాంధవులఁ గూర్పవచ్చు సంబంధగరిమ,
నీడఁబోలిక వెన్నంటి తోడుసూపు
ఆత్మసమదుఃఖు సోదరు నరయు టరిది.

సీ॥ సీతాసరోజాక్షి సేవాసమాసక్తి
మాతృవాత్సల్యసంపదను మఱచె,
ప్రవిమలాస్మత్పదారాధనాపేక్ష మై
జనకాంకవాసహర్షమ్ము దొఱఁగె,
ఐచ్ఛికారణ్యవాసాయత్తచిత్తత
భార్యాపరిష్వంగభాగ్య మెడసె,
నిత్యనిరాహారనిర్నిద్రవృత్తి న
యోధ్యానివాసంబు నోటుఁ బుచ్చె,

తే॥గీ॥ నిశ్చలైకాగ్రగురుతపోనిష్ఠఁ బూని
యోగి యన నొప్పె మధ్యభక్తియోగ మొంది
తమ్ముఁ డనఁ దమ్ముఁడే సుమిత్రాత్మజుండు
ధరఁ బృథక్చర మత్ప్రాణధనముగాక.”

తే॥గీ॥ అనుచు దైన్యంబునొందు నామనుజనాథుఁ
గని సుషేణుండు పల్కె-“లక్ష్మణుఁడు మూర్ఛ
నలగియుండెను గాని ప్రాణంబు పోదు
తేలునిప్పుడె” యని పల్కి తేర్చె విభుని.

ఉ॥ “మారుతి! ద్రోణశైలమున మందులు గల్గును వానిఁ దెచ్చినన్
దేలును లక్ష్మణుం డిపుడు తేవలె; నీపని నీవు గాక యిం
కెరును దీర్పఁజాలరు; జనేశ్వరుదైన్యముఁ బాపు” మన్న నా
ధీరుఁడు రామకార్యమును దీర్పఁ జనెన్ నిమిషాంతరంబునన్.

చం॥ పవనజవంబునం బఱచి పర్వతరాజము చేర, నోషధుల్
దవిలి యడంగెఁ గన్పడక; దైత్యకృతంబును రాము దైన్యమున్
రవి యుదయింప లక్ష్మణునిప్రాణము నిల్వని తీరు వాయుసం
భవుఁ డెఱిగించి యోషధులఁ బ్రార్థనఁజేసెను ద్రోణశైలమున్.

తే॥గీ॥ మాఱుపల్కక యాగిరి మిన్నకున్నఁ
బర్వతంబును బెకలించి పట్టితెచ్చె
దారి నెదిరించు దైత్యులఁ బోరఁజంపి
భానుఁ డుదయింపకయ మున్న వాయుసుతుఁడు.

తే॥గీ॥ దాన నెలకొన్న దివ్యౌషధముల గంధ
భరము మూర్కొని తెలివొంది పరగె నతఁడు
రాహుముఖముక్తుఁడైన రేరాజు మాడ్కి
వానరాంబోధి హర్షసంభ్రమము నొంద.

ఉ॥ ఏఁచి బలంబునొంది దనుజేశునిపైఁ బగదీర్పఁ బూని, దో
షాచరవర్యదారకుచచందనపంకవిశోషణైక దీ
క్షాచణకార్ముకుం డగుచు శత్రుకులాంతకధూమకేతువై
రేఁచుచు శోకవహ్నిని జరించు రణంబున దుర్నిరీక్ష్యుఁడై.

తే॥గీ॥ సర్వరాక్షసకుల వినాశంకరమ్ము,
తరుచరానీక నర్దితాంబరము రణము,
దరిసి కననోడి దైత్య దుర్దశల కోడి
చింతఁ గుందును దానవశేఖరుండు.

ఉ॥ "నాకెదురంటయే కడిఁదిన్యక్కృతి; యందుఁ దపస్వి తేకువన్
నాకవిరోధులం దునుము నా కనుమ్రోల; నికేటి మన్కి దే
వాకముఁ జూరఁగొన్న భుజయుగ్మ మిదేటికి? నింద్రజిత్తుచే
నేకృతిఁ దీరు? మేల్కొలుప నేపని తీరునుఁ గుంభకర్ణుచే?"

తే॥గీ॥ అనుచుఁ జింతింప దైత్యేశుఁ డరసి మేఘ
నాదుఁ డిట్లనెఁ "దండ్రి! వానరుల నరులఁ,
జంపి నీ కెదె గూర్చెద సంతసమ్ము;
చింతవిడు" మంచు యుద్ధసంసిద్ధుఁ డయ్యె.

## లక్ష్మణుం డింద్రజిత్తును జంపుట

సీ॥ కాలాంబువాహంబు కరణి దిక్చక్రంబుఁ
గప్పి యాంధ్యము నించు కట్ట్రిమేను,
ఇంద్రచాపంబున కీ డన నతిచిత్ర
కాంతిరంజిత దీర్ఘకార్ముకంబు,
ఆభీలజలదగర్జారావమును బోలు
ఘోరభైరవధనుర్గుణ రవంబు,
వర్షధారాపాత భంగి నొక్కుమ్మడిఁ
బఱచు సంఖ్యాతీతబాణరాజి,

తే॥గీ॥ పరగ వానరవాహిని భంగపఱచి
నాశమొనరించుచును మేఘనాదుఁ డంత
నంతకోపముఁ డై జన్యమందు నిలిచి
తలపడె జయేచ్ఛ నల సుమిత్రాకుమారు.

తే॥గీ॥ అసమవిక్రము లావీరు లటు లెదిర్చి
యొండొరులఁ బోరఁగడఁగి రాయోధనమున
వార్ధి వారాశియును నద్రి పర్వతమును
గవిసి యొండింటి ననిసేయఁ గడఁగినట్లు.

మ॥ దనుజాస్త్రంబుల నగ్గొనర్చును సుమిత్రాసూతి, యింద్రారియుఁ
మనువంశోత్తము మార్గణంబుల వియన్మార్గంబునం దుమ్ముఁ జ
చ్చెను దైత్యుం డని యొక్కవేళ, నిఁదె నొచ్చె న్లక్ష్మణుం డంచు నొ
య్యన ఘోషింపఁ బ్లవంగి రాక్షసులు జన్యంబయ్యె ఘోరంబుగాఁ.

ఉ॥ మాయఁదలిర్ప మేఘములమాటున నిల్చి బలంబుచూపు నా
దాయ సురాధిపాస్త్రమునఁ దల్లడమందఁగఁ జేసి వీర్య ము
ద్రాయితబాహుసారమున దర్ప మడంచి బలప్రకర్షముఁ
మాయఁగఁ జేసె లక్ష్మణుఁడు; మాయలు చెల్లునె ప్రాజ్ఞు సన్నిధిఁ.

తే॥గీ॥ ఐంద్రచాపంబుఁ బోలు శరాసనంబు
స్తనిత సమగర్జనంబు లక్ష్మణుఁడు వాపి
మోఘవీర్యునిఁ జేసె నామేఘనాదు
మేఘదర్పమ్ము శారదోన్మేష మట్లు.

ఉ॥ దానవనాథు చిత్తమున దావహుతాశనకీల పర్వ రా
మానుజవహ్ని నింద్రజితుఁ డాహుతి యయ్యెను నింధనం బనఁ
దానవశీర్షమందు వసుధాపతిసోదరశీర్షమందు సం
తానసుమాళి దివ్యవనితాకరకర్షము రాలె వింతగా.

తే॥గీ॥ దోర్బలాజయ్యు మేఘనాదుని హరించి
శోకశల్యంబుఁ బాపిన శూరుఁ డనుచు
దనుజశల్యాహతి వ్యధ లణఁగఁ దమ్ము
నిడుద కేల్దోయి గదియించెఁ బ్రభుమహేఁడు.

ఉ॥ రాఘవుచేత నాక్రియఁ బరాజయమొంది నిశాచరేంద్రుఁ డెన్
మోఘబలుండ నైతి నని పొల్వరి కుందుచునుండ నింద్రజి
న్మేఘములక్ష్మణానిలసమిద్ధరయప్రహృతంబు నయ్యె! ఘో
రాఘములం దనర్థము లనంతముగాఁ బ్రభవించు నొక్కెడన్.

⇐ కుంభకర్ణ యుద్ధము ⇒

ఉ॥ చచ్చిరి బందుగుల్ సుతులు చచ్చిరిగా నరవానరాళిచే
నొచ్చితి నిట్లు, మంత్రులును నొచ్చిరి; లంకనశింప నిద్ర మై
పొచ్చెమెఱుంగఁ డింతయుఁ బ్రబోధమొనర్పఁడు కుంభకర్ణు నం
చెచ్చినభీతిఁ బంపె దనుజేంద్రుఁడు దైత్యుల నాప్తభృత్యులన్.

శా॥ త్రొక్కించెన్ మదకుంభియూధములఁ, దై ద్రొబ్బించెఁ బాషాణముల్
స్రుక్కించెన్ నిశితాస్త్రఘాతముల రక్షోరాజు తాఁ దమ్ము నా
చక్కన్ మాంసనగమ్ము లాసవసరిస్సంఘంబు గల్పించి, పెం
పెక్కన్ మేల్కొని కుంభకర్ణుఁడును భక్షించెన్ నిమేషంబునన్.

ఉ॥ అన్నకు మ్రొక్కి పల్కె "దనుజాధిప! న న్నిటు మేలుకొల్ప వీ
వెన్నఁ డకాలమందు; పనియే" మన, దైన్యముఁదోఁప రావణుం
డన్ననుఁ దెచ్చుటాదిగ రణాంతముదెల్పగఁ "దప్పుజేసి తీ
వెన్నఁగరాని దుష్కృతి మహీసుత రామున కిమ్ము మేలగున్.

కం॥ పరకాంతాహరణ మ్మది
హరియింపదె రాజ్యలక్ష్మి నాయువుఁ గొనదే
దురితమ్ము గాదె యియ్యది
దొర యెవ్వఁ డొనర్చు ధర్మదూరము దీనిన్".

కం॥ అనఁగా రావణుఁ డయ్యాది
చన దింతకుమించ నన్న, సరి చేసెద నా
తనువైన దొఱఁగి యని తా
ననిసేయఁగ బయలువెడలె నతి దర్పమునన్.

శా॥ ప్రాకారాగ్రముదాఁటి యేఁచి గదతోఁ బైఁబడ్డ న వ్వానరా
నీకంబుల్ వెఱఁగందె; వీరవిహృతిన్ జెన్నొందు న వ్వీరు ను
ద్యోకాంతుం డఁటఁజూచి పైఁబఱచు నిర్వీరుండెవం డొక్కొ నా
గాకుత్థాన్వయుతో విభీషణుఁడు పల్కెంజొచ్చె నీరీతిగన్.

చం॥ "అతఁడు మదగ్రజుండు దనుజాధిపదక్షిణబాహు వాజిలో
నతని కితండె సాటి; వనజాసనదత్త వరుండు; దేవ! సం
తతసుఖనిద్రనొందు; బలదర్పితుఁ డాతనిఁజూచి వానరుల్
వెతగొని పాఱకుండ గతభీతులఁ జేయుఁడ"టంచు దెల్పుచున్.

తే॥గీ॥ కుంభకర్ణుని దరిజేరి గోత్రనామ
ములను దెల్పుచు నతిభక్తి మ్రొక్కి నిలువఁ
దమ్ముఁ గౌగిటఁగ్రుచ్చి యాదనుజవరుఁడు
"వత్స! సుఖముఁంటివే రాము భక్తిఁగొల్చి.

ఉ॥ ధర్మపథంబునన్ మెలఁగి దైత్యకులమ్మును నిల్పు మన్న! దు
ష్కర్మఫలంబుగా దనుజకాంతుఁడు నాప్తులు చత్తు రన్న! యీ
మర్మ మెఱింగి భక్తి రఘుమండను గొల్చి సుఖింపు మన్న! నీ
నిర్మలవర్తనం బొకటి నిల్పు కులం బని నమ్మితిం జుమీ!

తే॥గీ॥ పొమ్ము దూరమ్ము దరిఁ జేరఁబోకు మన్నఁ!
గన్నుగవఁ గానరాము నే నెన్నఁజాల
స్వపరభేదంబు; దఱి నున్నవారి నెల్లఁ
జంపి రాఘవుచేఁ దుదిఁ జత్తు నన్న!"

క॥ అని యనుప నశ్రువులతోఁ
జనె వేఱొకదెసకు నతఁడు; జన్యస్థలి నా
దనుజుఁడు వానరవీరులఁ
దునుముచు విహరించు వీర్యసుర్జయుఁ డగుచున్.

సీ॥ పాదప్రహారోత్థవసుధారజంబునఁ
గటికచీకటులు దిక్తటులఁ గ్రమ్మ,
శైలనిష్ఠురతనుస్పర్శమాత్రంబున
భగ్నాంగులై కపుల్ పరువులెత్త,
చంచద్గదాదండసంఘట్టితంబులై
కపులదేహములు చిద్రుపలు గాఁగ,
పదతలాధఃపతత్ వానరసైనికుల్
క్రమ్మి చీమలయట్లు నుగ్గు గాఁగ,

తే॥గీ॥ అరిభయంకరలీల జన్యమున మించి
తరుచరానీకముల దండధరుఁ డనంగ,
జదిపి పొలియించి రాక్షససైన్య మలర,
వీర్యదర్పమ్ముఁ జూపె నాభీలగతిని.

ఉ॥ అంగదుఁ డోడె వాయుసుతుఁ డంతికముం బెడఁబాసె; భగ్నస
ర్వాంగుఁడు నై నలుం డడఁగె; నాఁదట నీలుఁడు పిచ్చలించెఁ; బా
తాం గజుఁ డోర్వకెచ్చటికొ; జక్కొను భీతిని జాంబవంతుఁడున్
జెంగటి కేఁగనోడె; నిటు చేట్పడి రయ్యెడ నెల్లవానరుల్.

ఉ॥ అంత మహీధరేంద్రము బలారి యెదిర్చిన రీతి రామభూ
కాంతుఁడు వజ్రఘోరశరకాండములన్ దనువంశ్యు నాఁచెఁ; గ్రు
ద్ధాంతకతుల్యుఁడై దనుజుఁ డాతనిపై గదనేసె; మధ్య కం
తంతలు వ్రక్కలై పడఁగ నవ్వసుధేశుఁడు ద్రుంచె నేర్పునన్.

కం॥ గద బాసి నిరాయుధుఁడై
మదగజమటు మీఁదికురుకు మనుజాశను ను
న్మదు ముక్కుచెవులు దునుమఁగఁ
బొదలెన్ దైత్యుండు కోడెఁబుట్టువు పోల్కిన్.

ఉ॥ అంబుదమట్లు గర్జిలుచు న మ్మనుజాశనుఁ డె త్తిరాఁగఁ దీ
క్ష్ణంబగు సాయకంబుల నిశాచరుబాహులఁ ద్రుంచెఁ; ద త్ప్రపా
తంబునఁ గోటి వానరులు దైత్యులు మ్రగ్గిరి; యంబురాశిపూ
రంబు గలంగె; నద్రులు ధరాస్థలి గ్రక్కదలెన్ జవంబునన్.

తే॥గీ॥ కులిశనిష్ఠురమార్గణకోటిహతుల
శైలశృంగసమాన శీర్షంబు ద్రుంచి,
కుంభకర్ణుని ద్రుంచి కాకుత్స్థకులుఁడు
రావణాభేద్యధైర్యదుర్గంబు వ్రచ్చె.

తే॥గీ॥ నిద్రగూరుట యనఁ బ్రీతి నెగడు నీకుఁ
గడఁక మేల్కొల్పి రరకి యకాలమం ద
టంచు రామాశుగంబు లంతంతపోలి
దీర్ఘనిద్రను నొందించె దితితనూజు.

సీ॥ మకరాక్షుఁ డారాజమౌళి మార్గణరాజిఁ
బ్రాణంబులనుఁ బాసె రణధరిత్రి,
అతికాయుఁ డాసుమిత్రాత్మజు చేతిలో
గతజీవనుం డయ్యెఁ గదనభూమి,
మాల్యవంతుఁడు హనుమంతుచే మడిసెను
శౌర్యసంపదఁ జూపి జన్యమందు,
కుంభుండు శలభమై గూలి సుగ్రీవాగ్ని
హుతదేహుఁ డయ్యె నాయోధనమున,

తే॥గీ॥ గంపనుం డంగదునిచేతఁ జంపఁబడియె;
ద్వివిధమైందులు పోరిలో వీరవరుల
క్షోణితాక్షుని యూపాక్షుఁ బాణిహతుల
బాలియఁజేసిరి; యసురులు పొలిసి రిట్లు.

### రామ రావణ యుద్ధము

తే॥గీ॥ ఒకఁడు రాముఁడో రావణుం డొక్కరుండొ
ఘనితో నుండవలెఁ గాని మించియుండ
రా దరామమొ ధరణి యరావణమ్మొ
కావలె నటంచు నని కెత్తె రావణుండు.

ఉ॥ తేర దశాననుండు రఘువీరుఁడు నేలను నిల్చి పోర, వృ
త్రారి సువర్ణవర్ణకలితాత్మరథంబును బంపఁ దెచ్చి "దే
వా! రిపు నోర్వమీ రథముపై వసియించి; తనుత్ర మిద్ది సా
కారి జయార్థివై యనిపె" నంచును మాతలి నిల్చె ముంగటన్.

తే॥గీ॥ గగనగంగోర్మిమాలికాకంపితధ్వ
జమ్ము జైత్రమ్ము నరదమ్ము సమ్మదమున
రాముఁ డధిరోహణమొనర్చె బ్రమద మెసఁగ
నింద్రసారథి కైదండ నిచ్చుచుండ.

కం॥ సురవైరి శరము లెందున్
దరుణాంబుజపత్త్రిమృదులతనుగాంచునొ యా
సురరాజ తనుత్రాణము
సురసారథి రాము మేన సొంపుగఁ దొడిగెన్.

ఉ॥ ఒండొరులం గనుంగొని మహోద్ధతకోపవిఘూర్ణమాను లై
చండభుజాబలుల్ రఘు నిశాచరనాథు లజయ్యవిక్రముల్
దండి మగంటిమిన్ గవిసి దారుణమార్గణరాజిఁ జిమ్ముచున్
భండనముం బొనర్చి రరిభంజననిశ్చితవీరమూర్తు లై.

తే॥గీ॥ ఒండొరులఁ జూచునంత నభ్యుదిత మగుట
నసమవిక్రమమును జూప నవసరంబు
రామరావణకృతఘోరరణము మెచ్చఁ
దగి కృతార్థతఁబొందిన పగిది నొప్పె.

క॥ పెక్కు భుజోరుస్థలులున్
బెక్కుతలల్ గలిగి దైత్యవీరుం డనిలో
నెక్కటి యయ్యెను గనఁదగె
నుక్కున బహుదైత్యయోధయుతుఁ డైన క్రియన్.

సీ॥ పాకారిముఖ్యదిక్పాలుర నెక్కటి
కయ్యంబులో గెల్చు ఘనుఁ డటంచు,
స్వాసిధారానికృత్తాననారుణపద్మ
సమధికార్చితశంభుచరణుఁ డనుచు,
స్ఫుటవిక్రమాటోపపటుదీర్ఘబాహువి
లాసాతితులితకైలాసుఁ డనుచు,
బ్రహ్మాండభాండనిర్మాణప్రవీణాబ్జ
జనికులంబేఁచుముమ్మనుమఁ డనుచు,

తే॥గీ॥ శౌర్యవీర్యాన్వయంబుల సత్వయుక్తి
నాత్మ విక్రమతుల్యవీరారియనుచుఁ,
దలఁచి పరిపంథి యోగ్యతఁ దనిసి రాముఁ
డాజి బహుమానపూర్వక మ్మరయు నసుర.

ఉ॥ స్పందనమొందుచున్ జనకజా పరిరంభశుభప్రశంసి గాఁ
గొందలమంది యీసునను క్రూరశరమ్ములఁ గోసలాత్మజా
నందనసవ్యబాహువు రణంబున నొంచె మునీంద్ర దేవతా
బృందము లార్వ రావణుఁడు విక్రమసంపద దుర్నిరీక్ష్యుఁ డై.

ఉ॥ రామధనుర్గుణచ్యుతశరంబు దశాననపీనవక్షముం
భీమగతిం బగిల్చి తమిఁబీల్చి తదీయ కవోష్ణరక్తముం,
భూమిఁ జొరంబడెం భుజగపుంగవకోటికిఁ దత్ప్రియంబు నెం
తే ముదమారఁ దెల్పి పరతెంచెను సల్ల విషహ్యవేగ మై.

తే॥గీ॥ వాక్యసంతతి ప్రతివాక్యభంగిమములఁ
బోనడచు వాద కుశలులఁ బోల్కి దోఁప
నస్త్రములతోడ నస్త్రమ్ము లణఁగఁజేసి
రామరావణయుద్ధసంరంభ మెసఁగె.

కం॥ ఈవిధిఁ బ్రతికృతికృతులం
దేవాసురు లలరువానఁ దివిరి కురియఁగం
భూవరదానవశరములు
పూవులఁ దలరాలనీన పోలయల్కు నటుల్.

ఉ॥ అంతకు నోర్చి క్రొన్న పరిఘాయుధమెత్తి దశాననుండు, భూ
కాంతునిపై చె; లోహమయకంటకశంకుచితంబు నై రిదు
ర్దాంతకృతాంతదండభయదంబు రఘూద్వహుఁ డఖ్వమందె యం
తంతలు గాఁగఁ దున్మె దివిజారుల యాశలతోడఁ దూపులం.

కం॥ జగదేకధనుర్ధరుఁ డా
శుగమును సంధించె లోకశోకోద్ధరణం
బగు బ్రహ్మాస్త్ర మమోఘము
జగతిసుతాశోకశల్యశమనౌషధముం.

మ॥ కలఁగెం వారిధిసప్తకంబు, గిరివర్గంబెల్ల కంపించె సం
చలతం బొందె వసుంధరాస్థలి, జగజ్జాలంబు ఘూర్ణిల్లె నా
కులమయ్యెం సురదైత్యసంతతులు కాకుత్స్థుండు బ్రహ్మాస్త్ర ము
జ్జ్వలబాణంబునఁ గూర్చినంత దితివంశ్య ప్రాణజాలంబుతో.

తే॥గీ॥ మనుకులోత్కృష్టమైన యా మార్గణమ్ము
శేష భీషణఫణిఫణాసీమఁ బోలి
బహుముఖవ్యాప్తమై యభ్రభాగమందు,
జ్వాలికాదీపితాస్యమై పఱచి గ్రమ్మె.

కం॥ వనజాసనాస్త్ర మటు రా
వణకంఠదశకముఁ దాఁకి వ్రణవేదనమున్
గననీక తెప్పపాటునఁ
దునిమెన్ గడు విస్మయంబు దోఁపఁగ నాజిన్.

తే॥గీ॥ ఛిన్నకంఠంబులై రణక్షితిని రాలి
దైత్యపతి వక్త్రములు రక్తధారఁ దేలి
జలతరంగోదరంబుల సంక్రమించు
భానుమత్ప్రతిబింబాళి పగిది నొప్పె.

తే॥గీ॥ పతితమైనట్టి రాక్షసపతి శిరములు
చూచియును నమ్మఁజాలరు ; సురలు మరల
నంకురించునో యనుశంక ; నతిభయమ్ము
గదురు మనమున నమ్మిక కుదురుపడునె ?

పద్మనాభము॥ వందారుదిక్పాలగంధేభదానాను
బంధానుయాతాలిసందోహమాడ్కిన్
మందాకినీవీచిమందానిలాఘ్రాత
మందారభూజాతమాల్యంబులంతన్
జిందెన్ రఘూత్తంసుశీర్షంబునన్ ముందుఁ
జెన్నొందు రాజ్యాభిషేకంబు పోల్కిన్
బందీగృహోన్ముక్తసందానితామర్త్య
బందీజటాఘోటసంధాయకంబై .

తరలము॥ అరివధంబున వర్మచాపగుణానుబంధము వీడు నా
పరమపూరుషు రామచంద్రుని బ్రస్తుతించి ముదంబునన్
హరిహయంబుల తోడితేర నరాధిపాజ్ఞని యంత యం
బరపథంబున నాకసీమకుఁ బాఱె నుబ్బి జయంబునన్.

<= విభీషణుఁడు రావణున కౌర్ధ్వ దైహికముల నొనర్చుట =>

తే॥గీ॥ భద్రగజమట్లు రణభూమి వ్రాలియున్న
దైత్యపతి గాంచి జాలి త ద్దారలెల్ల
రా_ర్తరవములతోడ దిగంతరమ్ము
లద్రువ విలపింపఁగడఁగి రంతంతఁ గుంది.

ఉ॥ "హా దశకంఠ! కంఠదశకార్పణతోషితనీలకంఠ! ని
త్యోదితదోర్బలా! బలసముద్ధృతశంకరశైల! విక్రమా
సాదితదిగ్జయా! జయవశంవదశక్ర! దివంబుఁ జేరి నే
యీదనుజాన్వయంబు పొలుపేది నశింపఁగ, లంక కే ద్పుడన్.

సీ॥ మఱఁదివిక్రమకళామంధాద్రి యని పొంగఁ
గుంభకర్ణుం డిట్లు కూలె నాజి,
సుతుఁ డింద్రదనిర్జేత శూరశేఖరుఁ డన్న
శత్రుహ_స్తంబుల సమసె నతఁడు,
పతి జితాఖిలదిశాపతి యంచు గర్వింపఁ
బరిపంథిచే నిట్లు పడితి వీవు,
బందుగుల్ సురవధూబందీకరిష్ణులు
చచ్చి రీగతి వీరసంగరమున,

తే॥గీ॥ ధరణితనయానిమి_త్తమై తపనకులుని
కోపకీలల నీ లంక రూపువాసె
పరవధూకాంతుఁ గాల్పదె బ్రహ్మనైనఁ
బాడితప్పిన తేఁ డింక బ్రదుకుగలదె?"

కం॥ అని మందోదరి మున్నగు
వనితలు శోకించి శోకభరమునఁ గ్రుంగన్
వినవచ్చు లంకలో రో
దననిస్వనమాత్ర మొకటి దైన్యము దోఁపన్.

ఉ॥ వీరుఁడు రామచంద్రుఁడు విభీషణుచే నొనరింపజేసె సం
స్కారము దైత్యనాధునకు శాస్త్రవిధంబున బ్రహ్మతత్పరుల్
సారతురంగమేధముఖసత్క్రతుకర్తలు సంగరక్షమా
భీరులు యోగ్యు లెవ్విధికిఁ జేర్చెదరో ని తత్క్రియమంత దెల్పుచున్.

తే॥గీ॥ ఉచితగతి దైత్యనాధున కూర్ధ్వదేహ
విధుల సంస్కృతి చేసి విభీషణుండు
రామపాదాగ్రముల చెంతఁ బ్రణతుఁ డగుచుఁ
నిల్చె సద్భక్తివశుఁడై యచు నీరవమున.

## ⇐ విభీషణ పట్టాభిషేకము ⇒

ఉ॥ తమ్ముని బంపె రాఘవుఁడు "దైత్యకులేశ్వరసింహపీఠ మం
దిమ్ముగ నిల్పి రాజ్యము వహింపఁగఁ బట్టముకట్టి రమ్ము ని
త్యమ్ముగ మత్కృపాఫలము నాప్తుఁ డితండిఁక నొందుగాక వై
రమ్ము ఫలమ్ము వైరి రణరంగమునం గనె గావునన్".

ఉ॥ ఈవిధి రాముఁ డంప దనుజేశ్వరరాజ్యమునన్ విభీషణున్
శ్రీవిభవంబెలర్ప నభిషిక్తునిగా నొనరించె లక్ష్మణుం
డావసుధేశమౌళికృప నవ్యయసౌఖ్యము లంది కీర్తితోఁ
బావనరాజ్యచక్రమును వంశము నిల్పె విభీషణుండు తాన్.

స్రగ్ధరావృత్తము॥ పాతివ్రత్యప్రశస్తన్ బ్రథితగుణగణన్ భర్తృసక్తైకచిత్తన్
సీతన్ హృష్టాంతరంగన్ శ్రితకలుషహరన్ సేవ్యపాదాబ్జయుగ్మన్
జాతానందాశ్రునేత్రన్ సరసిజవదనన్ క్షత్త్రియోత్తంసు నాజ్ఞన్
బూతన్ గై సేసి పుచ్చెన్ బొలుచుమణులతోఁ బుణ్యకాంతాళితోడన్

సుగంధివృత్తము॥ ప్రియంబుఁ దోఁప వచ్చు నాప్రియాంగనామతల్లికిన్
భయంబుగల్గ రాఘవుం డవాచ్యభీషణాస్యుఁ డై
దయావిహీనచిత్తుఁడై కృతాంతతుల్యుఁ డైన, వి
స్మయంబునొంది శోకమొంది సాధ్వి కంపమొందుచున్.

తరువోజ॥ పతిచిత్త మెఱిఁగిన పడఁతి భూజాత
యతిదుఃఖవివశయై యడలి చిత్తమున
జితిఁ బేర్చి యనలంబు చేర్చి మేన్ దోఁపఁగఁ
హుతచిత్రభానునం దురకఁ గన్నిట
నతిభక్తిఁ బ్రాణేశ్వరాంఘ్రులు గడిగి
నతశీర్షయై వందనంబు నొనర్చి
వెతఁద్రోసి వలగొని వీతిహోత్రంబు
స్తుతగుణవ్రాతయై చొచ్చెఁ జెచ్చెఱను.

మానిని॥ సాహసవృత్తి నిశాచరదుష్కృతి స్వామిపదంబులె సాక్షిగ సం
మ్మోహ మెఱుంగక పుణ్యపతివ్రతి భూసుత చొచ్చినతోడ నటన్
దాహగుణాఢ్యత దాకినదెల్లను దగ్ధమొనర్చెడు తచ్ఛిఖియున్
శ్రీహరిచందనశీతలుఁ డయ్యెను సీతకు పూతచరిత్ర కటన్.

కవిరాజ విరాజితము॥ సురకరి గాంగసరోజను దాల్చిన చొప్పున సీతను శీర్షమునన్
ధరణిపుచెంతకు హవ్యవహుండటఁ దాలిచి తెచ్చి వచించె నిటుల్
“పరమ పతివ్రత భూసుత రామ! యపాంసుల చేకొను మత్తనువీ
వరసతి చొచ్చుటమాత్రముచే నతి పావనమయ్యె జగంబులలో.

ఇంద్రవజ్ర॥ ఆగీతి హవ్యవాహునుఁ డాడి నిలువన్
శ్రీరామచంద్రుండు చెన్నొంది తనలోన్
కారుణ్యపూర్ణుఁ డై కాంచి యామెను వా
మోరుస్థలంబున నుంచి యిట్లనెఁ దా.

మత్తకోకిలము॥ "పాతకుండగు దైత్యుచేఁ జెరబడ్డ నాతిని జానకిన్
నీతిలేక గ్రహించె నీమహినేత యందురు లోకు లీ
రీతిఁ బావకపూత సీత పరిగ్రహించుట పాడియా
జాతవేదుని సంస్కరించిన సాధ్వీశీల మనల్పమే?

తే॥గీ॥ కడఁగి తెలుపఁగ నస్మ దాగమనవార్తఁ
జను మయోధ్యకు వేగ మో యనిలపుత్త్ర!"
యనుచు పవనాత్మజాతుని పనిచి రాముఁ
డానతిచ్చెను స్వపురప్రయాణవిధము.

## — శ్రీరాముని యయోధ్యా ప్రయాణము —

మత్తకోకిల॥ రాజరాజు జయించి రాక్షసరాజు తెచ్చిన పుష్పకం
బా జగత్పతి యెక్కి భూతనయానుజన్మసమేతుఁడై
వీజనంబుల సేవచేయ విభీషణుండు కపీశ్వరుం
డోజ వానరసేనఁ గొల్వఁగ నుత్తరాశకు వెల్వడెన్.

తే॥గీ॥ వ్యోమయానంబుతో నభ్రసీమఁ జనుచు
సద్గుణాకరుఁ డా రామచంద్రుఁ డల్ల
శాంత రత్నాకరముఁ జూచి మంతనమ్ము
లాడఁ గడఁగెను జాయతోఁ బ్రోడ యగుచు.

ఉ॥ "ఏపున నీపయోధి గను మింతి మదుజ్జ్వలసేతుభిన్నమై
ప్రాపితశుద్ధఫేనకులభాసురనీలతరంగ మాచుఁ దా
రాపథదర్శనీయము శరత్సమయోదితచారుతారకా
దీపిత మా నభంబుగతిఁ దేజరిలుంగద! సుప్రసన్నమై.

కం॥ సగరుని యజ్ఞాశ్వంబును
నగభేది రసాతలమ్మునం దునుపఁగ నా
సగరాత్మజు లిలఁ ద్రవ్వి తు
రగమున కై, నిల్ప సాగరం బిది యమ్మా.

సీ॥ ఈ సాగరము లోకహితకామియై జగ
దానందకరు నమృతాంశుఁ గనియె,
ఈ వారిరాశి జలేంధనంబును గ్రోలు
నౌర్వాగ్నిఁగప్పు హృదంతరమున,
ఈ పయోధిజలమ్ము నినమరీచిక లాని
గర్భమ్ముదాల్చు లోకమ్ముకొఱకు,
ఈ యబ్ధిలో గణనీయరత్నధనంబు
లంకురించుచు నుండు ననుదినంబు,

తే॥గీ॥ బహువిధోజ్జ్వలరూపసంప్రాప్తి నొంది
యాత్మమహిమను దశదిశావ్యాప్తిఁ గాంచి
యింతయంతని యిట్లని యెన్నరాక
హరికి సరివచ్చుగాదె యీ యంబురాశి.

తే॥గీ॥ ఆదిపురుషుండు కల్పాంతమందు లోక
సంతతి హరించి, నాభిసంజాతకమల
సంభవుఁడు ధాత నిగమోక్తి సంస్తుతింప
యోగనిద్రను బొందు నీ యుదధియందు.

ఉ॥ పక్కములన్ హరింప సురభర్త శతారముఁ బూన భీతికిం
జిక్కి మహీధరాళి మదిఁ జంతిలి శత్రుభయంబు ద్రోప పెం
పెక్కిన ధర్మతత్పరు మహీవరు సంశ్రయమొందు కైవడిన్
జక్కగ నీ పయోధి శతసంఖ్యలు చేరెను వీడి గర్వముల్.

తే॥గీ॥ సాకతమ్మునఁజేరి రసాతలమ్ము
పరమపూరుషుఁ డుద్వాహభరముఁ దాల్పఁ
బ్రళయవర్ధిత వార్ధి నిర్మలజలమ్ము
పరగు నవకుంఠనం బౌచు ధరణిసతికి.

తే॥గీ॥ ముఖసమర్పణ విధమునఁ బ్రోడలైన
తెఱవలల్లల్లఁ దరఁగ వాతెఱలతీపుఁ
గ్రోలఁజేయుచుఁ దానును గ్రోలి తనియు
నితరదుష్ప్రాపసుకళత్రవృత్తి వార్ధి.

ఉ॥ క్రోలి నదీముఖాంబువులఁ గూర్మఝషాదులతోఁ దిమింగిలా
భీలపయశ్చరంబు లిదె భీకరదంష్ట్రలతోడి మోములన్
హేలగ మూర్ధరంధ్రముల నిచ్చెలుఁ జిమ్మును మింటికై పిదే
బాలమృగాక్షి శృంగకనిపాతితనిర్ఝరవారిధార నాన్.

తే॥గీ॥ వెలికి నొక్కుమ్మడిని నక్రవితతి రాఁగ
భిన్నమైగండముల నంటు వెల్లనైన
ఫేనశకలమ్ము లరయుమీ మీననయన!
మత్తమాతంగకర్ణచామరము లట్లు.

కం॥ వేలానిలంబు గ్రోలక
హేలగఁ దలలెత్తు పాము లివెఁ గను మబలా!
బాలార్కాంశువివృద్ధ
జ్వాలఫణామణులతో నివాళించు గదే!

తే॥గీ॥ ఇంతి! నీజిగిమోవితో నీసుఁబూను
విద్రుమంబులపై నూర్మి వితతి నిల్చు
నలఁతిసంకుల తెలిచాయ లరయవచ్చుఁ
జిఱుతలేనవ్వులొల్కు వాతెఱను బోలి.

తే॥గీ॥ జలముగ్రోలుచు వార్ధిపై నిలిచి మొయిలు
భ్రమణ మొందఁగ నావర్తబాంధవమున
మరల నీవార్ధి మంథాద్రి మథ్య మాన
మగుచున్నట్లు గనవచ్చు నంబుజాక్షి!

తే॥గీ॥ పంటవాల్గంటి! పాదాల పచ్చఱాల
యందియలఁ బోలి మున్నీటియంచుఁ దనర
దఱిని మెఱుఁగొందు లేఁబచ్చతళుకు నాఁగ
లలితగతిఁ దోఁచు నీలవేలావనమ్ము.

మ॥ నవలా! యియ్యదె ధూతకేతకరజోనద్ధమ్ము వేలావన
మ్మవియే సైకతభిన్నశుక్తిపుటపర్యస్తంబు లౌ ముత్యముల్
నవనీలోత్పలనేత్ర! చూచితె! ఫలానమ్రంబు తీరద్రుమం
బవలోకింపు విమానవేగమున డాయ స్వచ్ఛఁ గూలం బదే!

తే॥గీ॥ వీక్షణ మొనర్పు కరభోరు! వెనుక దారి
వారినిధి దూరమగుచుండ వసుధ శైల
కాననంబుల వార్ధి యంకంబుఁ బాసి
దూర మపసర్పణము నొందుతీరు దోఁచు.

తే॥గీ॥ ఒక్కచో దేవమార్గంబు నొంది పాఱు
నొక్కచో మేఘమండల మొఱసి పాఱు
నొక్కెడ విహంగపథమున నుఱుకువెట్టు
మ న్మనోరథమట్లు విమాన మిద్ది!

చ॥ సురగజదానసౌరభము సొంపువహించి నిలింప నిర్ఝరీ
పరి లఘుశీతలాంబుకణబాంధవ మొంది మరుత్తరంగమల్
పరిణతభానుతాపపరిభావిత మైన భవ న్ముఖాబ్జమం
దొఱయుచుఁ గ్రమ్మ చెమ్మటల నూరకఁ గ్రోలెడికంటె మానినీ!

తే॥గీ॥ పద్మకింజల్కవర్ణ! గవాక్షసీమ
దూరి త్వత్పాణిపీడితతోయదమ్ము
నవ్యసౌదామినీ భూషణముల రాల్చు
రావణహరిష్యమాణ వౌ నీవు పోలె.

తే॥గీ॥ వీరుగో! మానివర్యు లపేతవిఘ్న
సంతతిగ నెంచి యీ జనస్థానసీమ
నూతనోటజముల గట్టి భీతివీడి
తపము చేయఁగనున్నారు ధర్మపరత!

తే॥గీ॥ మాల్యవంతంబు నాఁ జను మహీధరమ్ము
నంబరంబంటు శృంగంబు నరయు మిదిగో!
త్వద్వియోగాశ్రుపులు పయోధార లిందు
నించితిమి యంబుదంబులు నేను నొకట.

సీ॥ కూలవంజుళకుంజగూఢసారసపంక్తి
నరయు పంపాసరోవరము దీని,
గాంచనకింకిణీకలనాదముఖరమ్ము
గోదావరీ హంసకులముఁ గనుము,
ధారాస్రవత్పయోధరవివర్ధితచూత
బాలమ్ము పరికింపు పంచవటిని,
నవనవోజ్జ్వలదర్భకబళపోషితబాల
హరిణమ్ము గను మస్మ దాశ్రమమ్ము,

తే॥గీ॥ కలశ జన్మాశ్రమం బిద్దె కమలనేత్రి!
యతివ! గాంచితె యిది సుతీక్ష్ణాశ్రమంబు,
అత్రిమున్యాశ్రమం బిద్ది యంబుజాక్షి!
చిత్రకూటాద్రి యిద్ది పవిత్రచరిత!

తే॥గీ॥ పచ్చజాగమి కెంపులు పగడములును
బఱచినట్లుగఁ గెంజాయ పండ్లు పసరు
టాకు జొంపంబు లొప్పు నీయవనిరుహము
శ్యామనామాంకిత వటమ్ము సరసిజాక్షి!

సీ॥ హరినీలమణులతో హురుమంజిముత్యాలు
సవరించి కూర్చిన సర మనంగ,
నల్లగల్వలతోడఁ దెల్లదామరపూలు
తగఁ జేర్చి గ్రుచ్చిన దండ యనఁగ,
కాదంబకులముతోఁ గలహంసకులములు
తారుమారుగ నున్న తా వనంగ,
అగరుఁజూర్ణముతోడ హరిచందనపుఁబొడి
చల్లి దీర్చిన రంగవల్లి నాఁగ,

తే॥గీ॥ కటికచీకట్లతో చంద్రకాంతి యనఁగ
నభ్రకాళిమతో శారదాభ్ర మనఁగ
కాలభుజగాళితో శంభుగాత్ర మనఁగ
వెలయు నిదె గంగ యమునయుఁ గలయుచోటు.

కం॥ గంగాయమునాతటి నీ
సంగమతీర్థంబు పంచజనువకు నబలా!
భంగం బొందని మోక్ష ము
సంగును బహుపాపి కైన క్షణగాహమునన్.

తే॥గీ॥ దూరమునఁ దోఁచు నదె శృంగిబేరపురము
సాధ్వి! యటఁ జేరవచ్చె నిషాదరాజు,
గుహుఁడు నిశ్చల మద్భక్తి సహితుఁ డగుచు;
జెడలుదాల్చితి మిట మునీశ్వరుల పోల్కి.

సీ॥ ప్రభవ మెద్దానికిఁ బద్మభూనిశ్చల
మానసాకల్పిత మానసంబు,
పొలుపొందు నెద్దాని పొందమ్మి పుప్పొడి
యక్షిణీ వక్షోరుహాగ్రసీమ,

పోషించు నేయేఱు పుణ్యపయోధార
తత కోసలధరిత్రి ధాత్రి వోలె,
తీర్థ రేనదినీట దినకరాన్వయభూపు
లశ్వమేధమహాధ్వరావభృథము,

తే॥గీ॥ లట్టి సరయూతరంగిణి యదిగో సీత!
ధరణివిభుబాసి విన్ననై తల్లిఁబోలి
దూరముననుండియే తేర్చి మారుతముల
వీచి హస్తాగ్రముల గారవించు నన్ను!

తే॥గీ॥ సాధ్వి! గను మదె సంజకెంపోయఁ బోలు
రక్తధరణీరజంబంబరంబుఁ గప్పు
పవనసుత బోధితుం డైన భరతుఁ డిటకు
పౌరవర్గంబుతో వచ్చు తీరు దోఁచు.

ఉ॥ సంగరరంగమందు ఖరసంహరణం బొనరించి వచ్చు నా
కుం గజరాజయాన నిను గూరిమి లక్ష్మణుఁ డిచ్చినట్లు లీ
మంగళవర్తనుం డనఘు మామకరాజ్యరమన్ వహించి యీ
యంగఁ దలంచి వచ్చు జనకాజ్ఞను సంగరపార మొందుటన్.

ఉ॥ గురుని పురస్కరించి తను గొల్వగవచ్చిన సేననిల్పి నా
గరులు నమాత్యముఖ్యు లనుగాములు గా జెడ లూని వల్కలాం
బరములు గట్టియున్న మునివర్తను జూచితె కేకయీసుతున్
గరమున నర్ఘ్యపాత్రగొని కాల్నడ న న్గనవచ్చు భక్తి మై.

మ॥ జనకాజ్ఞాగతరాజ్యలక్ష్మి తనయం సంబంటి క్రీడింపఁ బా
వనమధ్యక్షపరీతుఁ డై యువ వయఃపాకంబువాఁ డయ్యుఁ దా
వనవాసవ్రత మూని న న్ననుకరింపం బూనుచున్ సంయమీం
ద్రనుతుం డై యిటు దీర్ఘకాల మసిధారాచర్య సల్పుం గదే!"

తే॥ అనుడు భావజ్ఞ మై విమానాధిరాజ
మంబరమునుండి ధరణికి నవతరించె ;
నచ్చెరవు నొంది భరతానుయాయు లైన
ప్రకృతులున్ముఖదృష్టి నారయుచు నుండ.

సీ॥ తౌర్యత్రికంబును తూర్యస్వనంబులు
మొత్తమై దశదిశల్ బోరుకలఁగ,
ఆనందమునఁ దేలి యఖిలపౌరజనంబు
జయవెట్టి సేసఁబ్రా ల్చల్లుచుండ,
సత్వరంబున విభీషణుఁడు భూమికిడిగ్గి
దయచేయుఁ డిటకని దారిచూప,
సమయజ్ఞుఁడై కపీశ్వరుఁడు సేవాసక్తి
నండ నిల్చుచు భుజాదండ మొసఁగ,

తే॥గీ॥ స్ఫటికనిర్మితసోపానపథముబట్టి
ధరణికిని డిగ్గె శ్రీరామధరణినేత,
అద్రిశిఖరంబు డిగ్గు పంచాస్య మనఁగ
అభ్రగజమును డిగ్గు పాకారి యనఁగ.

తే॥గీ॥ కులగురువసిష్టునకు మ్రొక్కి కూర్మి నర్ఘ్య
పాద్యముల నంది కౌఁగిట భరతుఁ జేర్చి
త్యక్త రాజ్యాభిషేకపూతంబు శిరము
మూర్కొనుచు నల్ల హర్షాశ్రువులను దడిపె.

తే॥గీ॥ జడలుగట్టిన శ్మశ్రుకేశములతోడఁ
బ్లక్షవృక్షములటు మంత్రివర్యు లెఱుఁగఁ
బ్రణయబహుమానపూర్ణకృపాభరార్ద్ర
దృష్టి వీక్షించి యుచితసత్కృతి యొనర్చె.

శా॥ "ఆపద్బాంధవు లీకపీశ్వరుఁడు దైత్యాధీశుఁ డస్మద్రణ
వ్యాపారంబున కూఁతగట్టులు జయప్రాప్త్యేకమూలంబు" లం
చాపద్మాప్తుఁడు దెల్ప మున్ను భరతుం డవ్వారికి న్మ్రొక్కి సం
తాపం బారఁగఁ గౌఁగలించెను సుమిత్రాసూతి హర్షాఢ్యుఁడై.

కం॥ వానరసైనికముఖ్యులు
మానవరూపములఁ దాల్చి మదగజములపై
నానందంబుల నెక్కిరి
దాన జల మ్మద్రిఝరుల తలపులు నింపన్.

తే॥గీ॥ అరదముల నెక్కిరెల్ల రాయధిపు నాజ్ఞ
రామచంద్రుండు సీతతో రథము నెక్కె;
భరతుఁ డవ్వేళ సీతకుఁ బ్రణతుఁ డగుచు
వందనమొనర్చె సౌదల బదము లంట.

ఉ॥ రావణచాటువందనతిరస్కృతిహేతుకసర్వవంద్య తత్
పావన భూసుతా చరణపద్మము లగ్రభవానువృత్తి బ
ద్ధావిలమూష్కకైశికజటారుణసాధుశిరఃప్రణామ సం
భావితమూర్తులై తనరె వర్ధిత శాశ్వత వైభవంబులన్.

## ⇐ రామాదులయోధ్యఁ జొచ్చుట ⇒

తే॥గీ॥ రామచంద్రాగమంబు పురంబునందుఁ
జాటఁబంచిన మాత్రము లుత్సాహ మెసఁగి
పురజనంబులు కైసేయఁ బూని రల్ల
పురమునల్లడలను బెండ్లితటిని బోలె.

సీ॥ చలువపన్నీరు రచ్చలఁజల్లి నవరత్న
రంగవల్లుల సుందరముగఁ దీర్చి,
ఘనసారమును సుధాకర్దమంబును జేర్చి
సౌధహర్మ్యంబుల సంస్కరించి,

కదళికాస్తంభముల్ గట్టి గేహాళులందు
గృహాశిరంబుల నిల్పి కేతనములు,
మలయజాగురుకుంకుమంబుల మేదించి
కమ్మనిసురభి ధూపములు వైచి,

తే॥గీ॥ యోజ కైచేసి నెమ్మి పురీజనంబు
తివిరి రామాగమంబుఁ బ్రతీక్షసేయు
వారినిధి చంద్రుపొడుపును గోరునట్లు
గాఢహర్షోద్గతాశ్రుసంకలిత మగుచు.

క॥ సాకేతపురంబున కి
క్ష్వాకుకులోత్తంసుఁ డేగెఁ బౌరావళితో
నాకపురంబున కమరా
నీకంబులు గొల్వ నమరనేత చని నటుల్.

సీ॥ గంధద్విపంబులు గంధేభయానలు
మందయానంబుల ముందు నడువ,
జవనాశ్వతతులతో సాదివ్రజంబులు
విభ్రమగతుల వెన్వెంట నేఁగ,
రథసమూహంబుల రథికవర్గంబులు
గంభీరగతులఁ బ్రక్కదలి వెడల,
ఆప్తముఖ్యులు సచివావతంసులు చేరి
సరససల్లాపముల్ సలుపుచుండ,

తే॥గీ॥ వానరాసురనేత లిర్వంక నుండి
సందడు లడంప భరతుండు ఛత్ర మూన
వ్యజనముల వీనగా సుమిత్రాత్మజాతు
లవనిసుతఁ గూడి రాఘవుఁ డరుగు దెంచె.

తే॥గీ॥ ప్రణతిసత్కారకుశలసంప్రశ్నములను
చిఱుతనవ్వులవెన్నెలగురియు కనులఁ
తన్ను దర్శించు పౌరులఁ దగినరీతి
గారవించెను రాముఁ డుదారవృత్తి.

ఉ॥ పురవనితాజనమ్ము రఘుపుంగవు రాక నెఱింగి సంభ్రమ
స్ఫురణల మేడల న్నిలిచి సోరణగండులనుండి సేసలన్
గురియుచుఁ బూలఁజల్లుచుఁ జకోరయుగాకృతి నున్న కన్గవన్
గర మనురక్తిఁ గ్రోలుదురు కాంతతదాస్యసుధాప్రపూరమున్.

సీ॥ "జనకాజ్ఞఁ దలఁదాల్చి వనులఁ గష్టములోర్చి
చిరకీర్తిగొను ధర్మపరుఁ డితండె!
రావణ కుంభకర్ణ ప్రముఖాసుర
వీరులఁ జంపిన ధీరుఁ డితఁడె!
అన్నతో నడవుల బన్నంబులం గుంది
సౌభ్రాత్రమున మించు చతురుఁ డితఁడె!
సౌశీల్యమున ధనంజయ నుతిపాత్రమై
యుల్లసిల్లు సతీమతల్లి యీమె!"

తే॥గీ॥ అనుచు నొండొరులకుఁ జెప్పికొనుచు విస్మ
యానిమిషనేత్రకమలాళి నంగనాళి
తనివి నెనయక యతితృష్ణఁ గనుచు నుండ
రాజమార్గంబు గడచి రారాజసుతులు.

తే॥గీ॥ అరిగి నగరికి గడచి కక్ష్యాంతరములు
రాజసౌధంబు చేరి యారఘుకులజులు
జనకసౌధంబుఁ జొచ్చిరి సంభ్రమమున
సందడించుచు జననుల ముందుఁ జూడ.

తే॥గీ॥ పతివియోగంబుచే దీనరూప లైన
తల్లులను గాంచి రచ్చట దాశరథులు
సంశ్రితోపఘ్న మెడలినఁ జాలిదూలి
నేలఁ జేరాడులతికలఁ బోలి యుండ.

తే॥గీ॥ విజితశాత్రవు లారఘువీరవరులు
తల్లులకు మ్రొక్కి పాదపద్మముల వ్రాల
బాష్పపరిరుద్ధనేత్ర లాపడఁతు లపుడు
స్పర్శసుఖముల నెఱిఁగిరి వారి నెల్ల.

ఉ॥ కైక వివర్ణయై నిలువఁ గాంచి రఘూద్వహుఁ డల్లఁ "దల్లి! యి
క్ష్వాకుకులేశుఁ డిట్లు పరిపాలిత సత్యవచస్కుఁ డయ్యె! నే
నాకవిరోధి రావణుని నాశమొనర్చితిఁ; గీర్తి గాంచితిన్
నీకృప మూలమం"చతివినీతి నొనర్చెఁ బ్రణామసత్క్రియన్.

చం॥ "వినక హితోక్తి నేఁగి పతివెంట వనంబులఁ గూర్చి బన్నముల్
గనిన వరాకి" నంచుఁ గడకంట జలంబులు గ్రమ్మ మ్రొక్క, భూ
తనయను గ్రుచ్చి "సాధ్వి! గుణధన్యవు; త్వత్కృతిఁ గీర్తి నంది యీ
యినకులముం దరించె" నని యెంతయు మెచ్చిరి యత్త లత్తఱిన్.

## శ్రీరామ పట్టాభిషేకము

తే॥గీ॥ అంత రామాభిషేకార్థ మఖిలవార్ధి
జలము పుణ్యతరంగిణీసలిలచయము,
హేమఘటములతోఁ దెచ్చి యిచ్చి రల్ల
వానరేశ్వరు నానతి వానరాళి.

తే॥గీ॥ శ్మశ్రుజాలంబులును బల్లజడలుదాల్చి
తపసివేసంబుతోఁ జూడఁదగిన రాముఁ
డుచితసంస్కారనైపథ్యరచనఁ బొంది
యఖిలనయనోత్సవప్రదుఁ డగుట యరుదె?

సీ॥ తలయంటి చంపకతైలపూరంబున,
బోరుకార్చి కవోష్ణపుణ్యవారి,
తడియొత్తి మృదుపట్టధౌతవస్త్రంబున
దిగ్గ్రుద్వి కైసేసి సిగలుముడిచి,
అళికాగ్రతలముల నిలిపి కస్తురిబొట్టు,
మైనలంది సుగంధమలయజంబు,
తొడిగించి రతనంపుఁదొడవులు మెయినిండ
బట్టుపుట్టంబులు గట్టి మేన,

తే॥గీ॥ రత్నమయసింహపీఠిక రామచంద్రు
ధరణితనయను నిల్పి యుత్సాహమొప్ప
రాజ్యపట్టాభిషేక సంభ్రమ మెలర్పఁ
బరమ సంతోషమునఁబొంగ బురము జనులు.

తే॥గీ॥ వామదేవ వశిష్ట జాబాలి కాశ్య
పాదిమునులు యథావిధి వేదవిధుల
శ్రీరఘూత్తము పట్టాభిషేక మంతఁ
దీర్పఁగడఁగిరి హర్షాబ్ధిఁ దేలియాడి.

శా॥ అంబాలోచనహర్షబాష్పకణసేకారబ్ధమూర్ధాభిషే
కంబుం దీర్చిరి రామచంద్రునకు భూకాంతుల్ మహీదేవలో
కంబుల్ కన్నెలు మంత్రి జానపదవర్గంబుల్ బుధుల్ మానిసం
ఘంబుల్ పుణ్యపతివ్రతల్ జలధి గంగా ముఖ్యతీర్థంబులన్.

తే॥గీ॥ మనువు మొదలుగ నినవంశ మనుజపతులు
దాల్చు రత్నకిరీటంబు తరణివంశ్యు
శిరమునను నిల్పి గురుఁడు వశిష్టమౌని
జన్మసాఫల్య మంది యశంబు గాంచె.

తే॥గీ॥ భరతుఁ డ మ్మణిపాదుకాద్వయము రామ
పాదయుగమునఁ దొడిగి యర్పణ మొనర్చె
సకలకోసలసామ్రాజ్యచక్రభరము
దశగుణాధికవర్ధితార్థములతోడ.

కం॥ అనసూయాసతి యిచ్చిన
ఘనతరదివ్యాంగరాగకలన ధరిత్రీ
తనయయుఁ గనఁదగె నయ్యెడ
ననలవిశుద్ధిక్రమంబు నఁటుఁ జూపునటుల్.

సీ॥ వామాంకసీమ సౌదామినీలతఁ బోలి
సీతాపురంధ్రి వసించియుండ,
భక్తిసంభరితుఁడై భరతుండు వెనుచక్కి
ధవళాతపత్రంబుఁ దాల్చి నిలువ,
మించు నెయ్యముల సౌమిత్రు లిర్వంకను
వింజామరల్ పూని విసరుచుండ,
పవమానసుతుఁ డగ్రభాగోపవిష్టుఁ డై
పాదపద్మంబులఁ బట్టుచుండ,

తే॥గీ॥ రవితనూజ విభీషణ ప్రముఖులైన
యాప్తు లుచితాసనాసీనులగుచుఁ గొలువ,
నిండుపేరోలగం బుండె నీలమేఘ
సమశుభాంగుండు శ్రీరామచంద్రవిభుఁడు.

చం॥ కొలువున నుండి రాఘవుఁడు క్రూర దశానన కుంభకర్ణ దో
ర్బలములు యుద్ధకౌశల పరాక్రమలీల లెఱుంగఁ దెల్పుచుం
దలఁపక యాత్మవిక్రమ ముదాత్తత గాంచుట ధీరచిత్తుఁ డై
కొలిచెను విస్మయం బచటఁగూడిన పెద్దల కంతనంతటన్.

## సుగ్రీవ విభీషణాదులు స్వగృహముల కేగుట

కం॥ దానవ వానరనాథుల
నానాంబరరత్నభూషణంబులఁ దన్పన్
బూని సెలవంది యరిగి ర
నూనాత్మగృహంబులకు మనోహర్షములన్.

ఉ॥ ఈ మరుదాత్మజుండు తరియించి పయోనిధిఁ గుల్యపోల్కి ని
స్సీమ విపత్పయోధి దరిజేర్చె నిటుల్ దరిబోలె నంచు సత్
ప్రేమ దలిర్పఁ గన్గవలవిందుగ ముందటనిల్పి జానకీ
రాములు చూపుఁదమ్ములఁ సరంబులనించుచు వాయుసంభవున్.

ఉ॥ "మారుతసూతి! త్వత్కృత మమానుషమా! ప్రతిసేయ నేర్తుమే?
కోరువరంబు కాదనక కూర్చెద మెద్దియు" నా, "హిమాద్రిపై
దారకమంత్రరాజ జపతత్పరవర్తన నుందుఁ ద్వత్కథా
పూర మిలం గలంత" కనఁ "బొమ్మటు లౌ" నని పుచ్చిరాతనిన్.

సీ॥ జనను లంచా రామచంద్రుండు పూజింప
సకలసాధ్వులు సుతోత్సవముఁ గనిరి
అనుఁగుఁదమ్ములు గాగ మనుకులుం డెంచుట
ననదల కొదవె రాజాశ్రయంబు,
కన్నబిడ్డలఁబోలెఁ గాఁచి పాలించుట
ప్రజలకెల్లను బితృభక్తి గుదిరె,
సమవర్తియై దుష్టజనుల శిక్షించుట
పాపచింతకు లభావంబు గనిరి;

తే॥గీ॥ సకలసంపద లొదవి కష్టములు వాయ
రామునే దైవమంచును బ్రజ దలంచు;
రామరాజ్యము వైభవప్రాజ్య మగుచు
నిత్యసంపచ్చిరస్మరణీయ మయ్యె.

శా॥ శ్రీరామోజ్జ్వలపాదపద్మయుగసంసేవారతా! నిర్మలా!
పారావారగభీర! భీరహితహృత్పద్మా! కవీంద్రస్తుతా!
ధీరోత్తంస! యశేషలోకవినుతా! దివ్యాత్మ సంపత్ప్రియా!
కారుణ్యోజ్జ్వలనిత్యవై భవవరా! కళ్యాణ సంపత్కరా!

కం॥ శ్రీవాణీరమణీమణి
భావితకళ్యాణవాక్యవై భవజాలా!
శ్రీవజ్రాంబాలోలా!
పావన సత్కీర్తి సత్యపాలనశీలా!

మాలిని॥ సరసిజదళనేత్రా! చంద్రమాంబా సుపుత్రా!
సరసకవిశరణ్యా! సంభృతాశేషపుణ్యా!
పరిణతమృదుచిత్తా! భద్రసత్కీర్తివిత్తా!
పరమసుగుణసాంద్రా! స్వామిబాబూ! సుధీంద్రా!

గద్య॥ ఇది శ్రీమత్కాశ్యపగోత్ర పవిత్ర సుబ్రహ్మణ్యపుత్ర
బుధజనవిధేయ వేంకటసుబ్రహ్మణ్య నామధేయ
ప్రణీతంబైన శ్రీరఘురామచరిత్రంబునందు
యుద్ధకాండము.



శ్రీః

శ్రీ శారదాంబాయై నమః.

# శ్రీ రఘురామ చరిత్రము

## ఉత్తరకాండము

కం॥ శ్రీమత్సమస్తలోక
క్షేమంకర వివిధయోగ్యకృతితత్పర ! ని
స్సీమోదారయశశ్శో
భామండన ! ధన్య స్వామిబాబు ! నయజ్ఞా !

తే॥గీ॥ అవధరింపుము కుశలవు లవలి కథను
బల్కఁ దొడఁగిరి యిటు రామభద్రుతోడ,
అఖిల సభ్యులు నిర్నిమేషాక్షు లగుచుఁ
జిత్రలిఖితాకృతులలీలఁ జేరి వినఁగ.

తే॥గీ॥ సర్వసుఖములతో రాజసౌధములను
నిలిచి యొక్కొక్క తఱి నల్లఁ దలఁచికొనఁగ
జానకీరాములకును హర్షమ్ము గూర్చు
దండకారణ్యవాస వృత్తాంత మెల్ల.

కం॥ శ్రీరామచంద్రుఁ డెల్లడఁ
బౌరజనామోద కలన వర్తించుచు సీ
తారమణి గూడి కోసల
ధారుణి శాసించు శాశ్వతఖ్యాతి గనన్.

సీ॥ మంత్రిముఖ్యులఁ గూడి మంతనం బొనరించు
సదనులం దేకాంతసదనభూమి,
జాగరూకత గూఢచారముఖంబున
స్వ పర రాష్ట్రంబుల వార్తలరయు,

పౌరముఖ్యులతో సభాస్థలిఁ గొల్వుండి
పౌరకార్యముఁ దీర్చు పాడిమెఱయ,
గురు దేవ బుధ మిత్రకోటులఁ దన్పును
సంతతం బుచితోపచారవిధుల,

తే॥గీ॥ అల్పసుఖభోగి యై క్లేశమధిక మోర్చు
నఖిలజనరంజనై కకార్యార్థి యగుచు,
స్వప్రజారంజనాత్తయశంబు కంటెఁ
బ్రార్థ్య మన్యంబు గలదె సూర్యాన్వయులకు.

తే॥గీ॥ అదనుదప్పక రాజకార్యములు దీర్చ
మరగి వెన్నంటు నల రాచసిరిని బోలు
జనకతనుజాతతో రామచంద్రుఁ డంతి
పురమునను బుచ్చు నిముసమ్ముపోల్కిఁ బ్రొద్దు.

సీ॥ మలయమారుతరమ్యమధుమాసవేళలఁ
బ్రచ్ఛాయశీతలారామసీమ,
దావోజ్వలోష్మనిదాఘదినంబుల
యంత్రధారాగృహాభ్యంతరముల,
శారదపూర్ణిమాచంద్రాతపంబుల
చంద్రకాంతోపలసౌధభూమి,
హిమభారశీతల హేమంతరాత్రుల
కోష్ణగర్భాగార కోష్ఠతతుల,

తే॥గీ॥ లంబమానాంబువాహనభంబు లైన
వర్ష ఋతువాసరముల నుప్పరిగలందు
జనకతనయాద్వితీయుఁ డై యినకులుండు
విహరణ మొనర్చు తరితీపు పెరిమలొలుక.

మ॥ ఒకచో భూసుతయున్ రఘూద్వహుఁడు లీలోద్యానకేళీరతిన్
వకుళాశోకసమేరుచూతవిటపిప్రచ్ఛాయ వర్తిల్లఁ ద
న్ముకుళంబుల్ తలిరాకు జొంపములు సొంపుల్ నింపి యంతంత కొం
డొక యౌత్సుక్యముఁగొల్పు దర్పకవిలాసోత్సాహ మింపొందఁగన్.

మ॥ జలకేళీరతి జానకీసతియుఁ గౌసల్యాతనూజాతుఁడున్
గలహంసీకలనాదమేదురతరంగవ్రాత కేళీ సరో
జలమధ్యంబునఁ గ్రుంకువెట్టుదురు మై సంతాపముల్ దీర సం
చలదబ్జాకరవీచిడోలికల నుత్సాహంబు పెంపొందఁగన్.

సీ॥ అవిరళ ప్రియకథాలాపాక్రమారబ్ధ
మందాక్షమందసంభాషణములు,
ఇతరేతరాంగసంగతిజాయమానసం
వాహనగాఢోపగూహనములు,
అనురాగరసవర్ధితానంద హేతుక
క్షణభూతదీర్ఘనిశాదివములు,
నవనవాయిత మనోభవవిలాసవిశేష
పరిణత ప్రీతివివర్ధనములు,

తే॥గీ॥ అనపహార్య విశేషరసాంతరములు,
సతతవర్ధిష్ణు విస్రంభసముదయములు,
జానకీరామ సుచిర వాంఛాఫలములు
భువననుత తత్ప్రమానుషోత్సవము లలరె.

ఉ॥ ప్రణయసుధాస్రవంతి యెడఁబాటున వేసఁగిబోలె శుష్కమై
యణఁగి కృశత్వమంది ; ప్రియబంధుసమాగమ మైనయంత శ్రా
వణసమయ ప్రవాహమునఁ బాఱును బో యతివేల మాచు రా
వణకృతవిప్రయోగమును వారలకూరిమి పెంచెఁ జెచ్చెరన్.

కం॥ ఈవిధి సీతారాములు
జీవనసర్వస్వరసవిశేషాసక్తిన్
రేవగలు కవసి యెడయక
భావజవిక్రియలఁ జిక్కి వర్తిలుచుండన్.

సీ॥ శరపుష్పపాండురచ్ఛవిదృశ్యమానమై
నెమ్మోము తెలిదమ్మిసొబగుఁ దాల్పఁ,
గ్రమ్మ తేఁటులతోడఁ దమ్మిమొగ్గలఁబోలి
చనుదోయి నలుపెక్కు మొనలఁ దోఁప,
కలదులేదనుశంక కలిగించు లేఁగౌను
వళులఁ దేరక యుబ్బువాటు నొందఁ,
సహజమంథరమైన చతురచంక్రమణంబు
గర్భభరాలస గతిఁ దనర్చ,

తే॥గీ॥ స్నిగ్ధతమ మాయెఁ గన్గవ చెలువుగాంచె
నలసతలుదోఁచెఁ నూర్పుల నెలయు మసలె,
నిమురలెడనెడఁ పొడసూపె; నెలఁత చూలు
తెలుపకయ తెల్పి ముదమును గొలిపెఁ బతికి.

ఉ॥ అంతట రాముఁ డొక్కయెడ నంతిపురంబునఁ గాంతతోడ నే
కాంతమున న్వసించి తనుగాత్రి కపోలయుగమ్ము నంటుచున్
జెంతకుఁదీసి యక్కునను జేరిచి, సిగ్గున విన్నఁబోవు నా
కాంతకు నెమ్మి సంతసము గల్గగ నిట్లను హృష్టచిత్తుఁడై.

తే॥గీ॥ "కార్శ్యమును పాండురత్వంబు గ్లాని సీత!
గానవచ్చెడు నీమేనఁ, గల్గె నొక్కొ?
యినకులాంకుర మిటఁ బుట్టు వెలుఁగుచిన్నె
లస్మదీయ మనోరథ మంత నిండ."

క॥ అని విభుఁడు పలుక సీతా
వనజాక్షియు సిగ్గుదోఁప వంచెమొగంబుఁ
నునుగెంపుమోవిచివురున
ననిచిన లేనవ్వు దెలిపె నాథున కల్లన్.

ఉ॥ దాన నెఱింగి రాఘవుఁ డుదారవిధంబునఁ బల్కె నిట్టు "లో
మానిని! దౌహృదమ్ము ననుమానమునొందక తెల్పు తీర్తు! సం
తానము వన్నెవాసియును దగ్గనుఁ బుట్టుములింత దాఁప; న
బ్జానన! యిద్దె యాన" యన నమ్మృగలోచన పల్కె నాథుతోన్.

ఉ॥ "ప్రాచ్యము యొండు నాథ! ననుబోలిన త్వత్ప్రియకాంత కిద్ధరన్
ద్వచ్చరణాంబుజద్వయ మెదం బదిలంబుగ నిల్పి గొల్చుటే
నిచ్చలు మ న్మనోరథము; నీ పదసేవయుఁ దక్క నొండొకం
డచ్చుపడంగ నేర్చునె మదాత్మ! యశోవిభవైకభూషణా!

తే॥గీ॥ తెలుపఁబడ కున్నఁ దలఁపులఁ బొలయుఁ గోర్కె
లరసినట్టుల దీర్చెద వార్యపుత్త్రి!
నిత్యమును మన్మనఃపీఠి నిలిచియుంట
నెఱిఁగికొందు వాఁకోర్కె నైన నవధరింపు.

సీ॥ శీతలకల్లోలశీకరాసారార్ద్ర
పవమానకంపితపాదపములు,
యజ్ఞక్రియానిమిత్తాసీతదర్భాంకు
రానివారితకామహారిణకములు,
త్యక్తజన్మవిరోధతతవన్యమృగజాత
పరిభుజ్యమానసీవారబలులు,
వైఖానసవ్రతప్రణయసంయమిసుతా
సంపూజితాతిథిసముదయములు,

తే॥గీ॥ దళిత నక్తంచరాభీలకుల భయములు
శాంత పావన మునినివాసములు విమల
జాహ్నవీతీర మునిజనాశ్రమపదములు
గాంచి విహరింపఁ దలఁపులు గలుగుచుండు.

తే॥గీ॥ తేట మిన్నేటి తెలినీటఁ దీర్థమాడి
పరమపావను లౌ మునీశ్వరులఁ గొలిచి
సౌమ్యవర్తనలౌ మునిసతులతోడఁ
గలిసి విహరింపఁ దలఁపులు వెలయు నాథ!"

కం॥ అన విని "పదునాల్గేఁడులు
వనముల వెత నొంది తనివి పడయదొ? కాకీ
వనజాక్షి యిట్లు కోరెను!
జనునే చింతింప ధాతృ సంకల్పంబున్."

చం॥ అని మదిఁ జింతఁగుందియుఁ బ్రియాంగన కట్లగు నంచుఁ బల్కి, య
య్యనఘుఁడు కింకరానుగతుఁ డై పురిఁజూడ నభంబునంటు చ
క్కని తనమేడ నెక్కి గణికానివహాభిగతోపకంఠమున్
మణిగణరంజితాపణము మంజులసౌధ మయోధ్యఁ గాంచుచున్.

తే॥గీ॥ పౌరజానపదాదిక ప్రకృతివర్గ
మెట్లు మచ్చీలవర్తన లెంచు ననుచు
శుద్ధవర్తనుఁ డటనుడి సొంపుఁదోఁప
భద్రుఁడను చారు నా రామభద్రుఁ డడిగె.

తే॥గీ॥ బలిమి నిటు రామపృష్టుఁడై భద్రుఁ డనిమె
"పరమ సద్భక్తి మీ దివ్యచరిత మెల్ల
కీర్తన మొనర్తు రొక జానకీ పునః ప
రిగ్రహముఁ దక్క దైత్యాపహృతి కతమున".

తే॥గీ॥ కలనఁ బగిలురు నాటిన కఱకుటమ్ము
కరణి నెదనాట నమ్మాట కలఁత నొంది
శిరము ఘూర్ణిల్ల వివశుఁడై తొఱఁగె నేల
నవనిజా శీల శంకావిషార్తుఁ డగుచు.

ఉ॥ శేరి మదిం దలంచె నెటుతీరును దుష్ప్రథ ? లంకనైన యా
దారుణవహ్ని శోధనవిధం బెటు ప్రత్యయబుద్ధి గొల్పు నీ
పౌరుల ? కీయ్యలర్క-విషభంగి నడంచిన యీ కళంక మీ
తీరున గ్రమ్మెఁ గ్రమ్మరి ; విధిం గడవం దరమౌనె యేరికిన్.

చం॥ పరమపతివ్రతామణి, నపాంసుల, గర్భభరాలసాంగి, నీ
ధరణిజ వహ్నిపూత, నెటు దారుణభంగిఁ బరిత్యజింతుఁ ? గా
కురువడి పౌరలోకమున నుబ్బు నపప్రథ నెట్లు సైతు ? నం
చరమర తల్లడిల్లు నృపుఁ డయ్యెడ నుయ్యెలలూఁగు నాత్మతోన్.

తే॥గీ॥ అనితరనివార్య మాట నయ్యపయశంబు
జానకిఁ ద్యజించి పాప నిశ్చయ మొనర్చె ;
శుభ్రకీర్తియ వాసి యశోధనులకు
ప్రాణమునకంటె నన సౌఖ్యపదవి ఘనమె ?

ఉ॥ విన్నఁదనంబు దోఁప రఘువీరుఁడు తమ్ములఁ వీతహర్షులన్
గ్రన్ననఁ బిల్చి యశ్రువులు గ్రమ్మగఁ గద్గద నీతెలుంగుతోఁ
దన్ను వసుంధరాసుత కతంబున లోకు లొనర్చునింద నా
పన్నతఁ దెల్పి కుందుచును బల్కె నిటుల్ కడు తెంపొనర్చుచున్.

తే॥గీ॥ "దినకరారబ్ధమై యశోదీప్తమైన
పరమపావన రాజర్షి వంశమందు
నమలదర్పణమునఁ దుషారానిలములఁ
బోలెఁ జెడుమచ్చ గలిగె మ న్మూలకముగ.

తే॥గీ॥ తోయవీచుల తైలబిందువును బోలి
పౌరులం దెల్ల బహుళమై వ్యాప్తినొందు
కశ్మలాపప్రథను పైఁప ; గంధగజము
కట్టుకంబంబు నోర్వని కరణి నింక.

తే॥గీ॥ వైరనిర్యాతనార్థమ్మ పగతుఁ జంపి
పడఁతిఁ దెచ్చితి ! మది వమ్మ ? పౌరుషమ్మ !
కాలఁద్రొక్కిన పైఁపక కఱచుఁ బాము
వైరమునఁ గాక రక్తపిపాస నొక్కొ ?

మ॥ ఫలసంప్రాప్తి సమీపవర్తి యయినన్ వర్జింతు వైదేహిఁ గో
సల రాజ్యేందిరఁ దొల్లి నల్ల జనకాజ్ఞన్ వీడిన ట్లంతతోఁ
దలఁగున్ దుష్ప్రథ ; పుణ్యసాధ్వి యిటు నిందాపాత్రతం గాంచె ని
ర్మలజైవాతృకబింబ మావిలధరాప్రచ్ఛాయ నల్పైవ నటుల్.

ఉ॥ చిత్తమునం దెఱుంగుదును సీత యపాంసులయంచు ; నైన నీ
రిత్త జనాపవాదముఁ బొరింబురిఁ గ్రమ్మ సహింపలేక యీ
బిత్తరిఁ గానఁ ద్రోసెద నపేతకృపామతి ; నిందఁ బాసి యే
నుత్తమకీర్తి నిల్వ మది కొప్పిదమే నొరుమాట దక్కఁడి."

తే॥గీ॥ అని సతీత్యాగ నిశ్చితస్వాంతుఁ డైన
యన్నఁ దగదని వారింప, నగు నటంచు
ననుమతింపంగనేరక య్యనుజు లెల్ల
రశ్రుపూర్ణాక్షులై వినతాస్యులైరి.

### లక్ష్మణుని సీతను విడిచిరమ్మనుట

మ॥ తన యాజ్ఞావిధిఁ దప్ప కెయ్యెడల నిత్యస్తుత్యుఁడై పొల్చు న
య్యనఘున్ లక్ష్మణుఁ జేరఁబిల్చి యట నేకాంతంబునన్ "సౌమ్య ! యీ
జనకోర్వీపతిపుత్త్రి గాంగతటసంజాతాటవీమధ్యమం
దును నా యాజ్ఞను ద్రోసి యిక్కలము నిర్దోషమ్ము గావింపుమీ.

తే॥గీ॥ జాహ్నవీతీరవనముల సంచరింప
ధరణిపుత్త్రిక యర్థించె దాహ్యాదమ్ము ?
నరసి తత్ప్రార్థనముఁ దీర్చు వ్యాజమునను
జనకజను వీడు వాల్మీకి వనముచెంత.''

తే॥గీ॥ అనఁగ జనకాజ్ఞ తీర్పంగ ననుఁగుజనని
దునిమె భార్గవుఁ డని మున్ను వినుటఁజేసి
యపుడు తలఁదాల్చె సౌమిత్రి యన్నయాజ్ఞ ;
గురుజనాజ్ఞల శంకింపఁ గూడ దెందు !

క॥ రామాజ్ఞ మీఱఁజాలక
భూమిజ వనిఁ ద్రోయలేక పూతచరితుఁ డా
సౌమిత్రి వగచు నయ్యెడ
రామానుజుఁ డగుట కంతరంగమునందున్.

క॥ అట్టిట్టొనర్పఁజాలక
యెట్టుం గడలేని కడిఁది యిక్కట్టనుచుం
దట్టాడి తుట్టతుద కిం
కెట్టో మది దిట్టపఱిచి యేర్చి కడంకన్.

ఉ॥ వంచన లోనడంచి జనవర్యు రథంబును బూన్చి జానకీ
చంచలనేత్ర మేడకు వెసం గొనివచ్చియు లోనికేగఁగా
నించుకఁ గొందలంపడియు నెట్టులొ ధైర్యము చిక్కబట్టి ని
శ్చంచలచిత్తవృత్తిమెయి జానకి సన్నిధిచేరి యిట్లనెన్.

ఉ॥ ''అంబ ! భవన్మనోరథము నారఘువీరుఁడు తీర్పఁ బంపె ; వే
గం బరదంబు నెక్కు''మని కౌతుకపూర్ణమనస్క సీత తే
రం బదిలంబుగా నిలిపి, త్రాసమెఱుంగని మేలువాజియు
గ్మంబులతోడఁ గానకు సుమంతుడు సూతుఁడు గాఁగ వెళ్ళెడిన్.

చం॥ కనుగవ విందుగా రుచిరకాననశైలనదీప్రదేశముల్
గనుచుఁ బ్రియంకరుండు తనకాంతుఁ డటం చెదఁ బొంగుఁగాని దు
ర్మనమునఁ గూర్మిఁ బాసి వనమండలి కంపు లెఱుంగదయ్యె భూ
తనయ; సురద్రుమమ్మచట దానె విషద్రుమ మాటనుం బలెన్.

ఉ॥ చెప్పఁగ నోడి లక్ష్మణుఁడు చిత్తమునందె యడంచు దుఃఖమున్
జెప్పక చెప్పగాఁ దొడఁగెఁ జేరి కనంబడు దుర్నిమిత్తముల్
చొప్పు తొలంగు మ్లానముఖశోభయు, మౌనవచఃప్రవృత్తియున్
దప్పక స్పందమాన మగు దక్షిణనేత్రముతోడ సీతకున్.

చం॥ ఎడనెడ దుర్నిమిత్తముల కింతియుఁ గొందలమంది తాల్మికిన్
లెడలఁగ మోముపాడఁగ ననిష్టముగల్గుట శంకచేయుచున్
బుడమికి సానుజన్ముఁడగు భూపతికిన్ శుభవృద్ధి గల్గ నా
యెడ మది వేల్పులం గొలుచు నెంచ దటన్ నిజభావిదుర్దశన్.

తే॥గీ॥ అగ్రజన్మాజ్ఞచే సాధ్వి నవనిజాత
నడవిఁ ద్రోచెడి నా సుమిత్రాత్మజాతు
నగ్రభువిఁ దోఁచి వీచి హస్తాగ్రమెత్తి
గంగ వారించు నటు మున్ను గానవచ్చె.

ఉ॥ సారథి తేరియుగ్యములఁ జయ్యనఁ బట్టి రథంబు నిల్ప సీ
తారమణిన్ మృదూక్తి సికతాతలి డిగ్గ నొనర్చి నెమ్మిఁ బెం
పారనిషాదరాజసముపాహృత నౌకను నిల్పి దాఁటె భా
గీరథి సత్యసంధుఁ డెడఁ గీర్తితసంధ తరించు కైవడిన్.

ఉ॥ ఆవలియొడ్డు చేరి జనకాత్మజ పాదములందు వ్రాలి యా
భూవిభునాజ్ఞ దెల్పి ధృతిపొల్పరి కుందుచు బాష్పవారిరు
ద్ధావిలకంఠుడై "నను నుదగ్రముగా శపియింపు మంబ! దో
షావహు"నంచు పేర్కొన భయాకులయై క్షితిపుత్రి యిట్లనెన్.

కం॥ “రామాజ్ఞావశవర్తివి
సౌమిత్రి యిటేల నీకు సంతాపింపన్
భూమీశునకును మీకును
సేమంబు గదన్న ! ప్రజకుఁ జెప్పు” మటన్నన్.

చం॥ “తగదన కెట్టి దుష్కృతియుఁ దప్పకతీర్చు నృశంసు డంచు ని
మ్ముగ నను బంచె రాఘవుఁడు ; పూనియొనర్పఁగ వచ్చి యద్ది చె
ప్పఁగ నీఁట నోరురాక బలువంతలఁజిక్కు దురాత్ము నిష్ఠుర
మ్ముగ శపియించి కోపశిఖ పూర్ణముగా దహియింపు మంబరో !”

ఉ॥ నావుడు “నెన్నఁడేనియు మనంబున దుష్కృతిఁజేయఁ డల్ప ; వా
భూవిభుఁ డార్యవర్తనుఁడు పుణ్యచరిత్రుఁడు ధర్మమూర్తి యిం
కీవిధిఁ గుందనేల ? నిను నేల శపింపగ వేఁడె దన్న ! దో
షావహ మెట్లు త్వత్కృతి భయంబెడలించి వచింపు మద్ది” నాన్.

తే॥గీ॥ ఎట్టకేలకు మది చిక్కబట్టి నిల్చి
బాష్పసంరుద్ధకంఠుఁ డై పల్కనోడి
వెలువరించెను రామాజ్ఞ వికలుఁ డగుచు
నశనిపాతంబు గతి సుమిత్రాత్మజుండు.

ఉ॥ దారుణ తత్పరాభవముతాఁకున కోఁపక సీత మై యలం
కారములెల్లఁ దూలి పెనుగాలికి డుల్లిన పూలఁ బోలఁగన్
మారుతవేగభగ్ననవమాలికపోలిక వ్రాలె మాత యా
ధారుణి కాత్మదైన్యము విధంబెఱిఁగించెదు పోల్కి నేలపై.

శా॥ కాకుత్స్థాన్వయుఁ డార్యవర్తనుఁడు త్వత్కాంతుండు నిన్నెట్టుల
న్ద్రోఁకంబెట్టు నయోనిజాతఁ బరిపూతాత్మన్ వనిం ద్రోయ నే
వీఁకం బుచ్చును ? విశ్వసింప ననుచున్ విశ్వంభరాదేవి సీ
తాకాంతన్ దనలోనికిం గొననిచందం బొప్పె నప్పాటునన్.

తే॥గీ॥ మూర్ఛవడిఁ దేరకున్న యా భూతనూజఁ
గాంచి సౌమిత్రి యతి దుఃఖకలితుఁ డగుచు
శీతలోదకములు చల్లి సేదఁదీర్చి
విసరుచుండెను గిసలయ వీజనముల.

తే॥గీ॥ తొలఁగె దుఃఖమ్ము మూర్ఛల్లి ధరణిజాత;
తేఁటి తపియించు నతిదుఃఖభారకలన;
లక్ష్మణకృతోపచార సంలబ్ధసంజ్ఞ
కష్టకర మయ్యె మోహంబుకంటె సతికి.

చం॥ దురిత మొకింతలేక వనిఁద్రోయఁగఁ బంపె నటంచు నాథు డీ
ష్పరములు పల్కఁబోదు నిజభాగ్యముమాత్రము నిందసేయు దు
ర్భరబహుదుఃఖభాజనము పాపపరీత మటంచు సాధ్వి; యె
త్తటి సతు లాత్మవల్లభ పదద్వయభక్తిఁ దొలంగ నేర్తురే?

తే॥గీ॥ సీత నాశ్వాసపఱిచి ప్రాచేతసాశ్ర
మంబు మార్గంబు దెల్పి యాయంబ యడుగు
దోయిపై వ్రాలి ప్రార్థించె దోష మిద్ది
సల్పితి నృపాజ్ఞ నవశుఁడ సైఁపు మనుచు.

ఉ॥ ఆతని లేవనెత్తి జనకాత్మజ పల్కెను "వత్స! నీయెడన్
బ్రీతివహించితిన్ మది విభీతిఁదొలంగు సమస్తసౌఖ్యముల్
బ్రాఁతిగ నొంది వర్ధిలు చిరమ్మును రామవశంవదుండ వై
యేతఱి పూజ్యవర్తన నుపేంద్రుఁడు శక్రవశాత్ముఁ డైనటుల్.

ఉ॥ అత్తలకెల్ల మన్నతుల నందఁగఁజేసి యనుక్రమంబుగా
మత్తనుసంభవుల్ స్వపితృమాన్యధరాధిపతిత్వభాగ్యసం
పత్తికి భాజనంబులగు భాతిగ దీవనలీయఁ బల్కు యీ
క్రొత్తడికాపురం బిటులు కూలెను కానలనంచు దెల్పుమీ.

తే॥గీ॥ కట్టెదుట వహ్నిపూత నక్కటిక మెడలి
కాననఁ బడఁద్రోయు జేని కిక్కరణిఁ దెల్పు
"వనులఁద్రోచితి లోకాపవాద వినుట
ననుమతి బలీయ మగునె ప్రత్యక్షమునకు.

ఉ॥ మంగళవర్తనుండ వతి మాన్యచరిత్రుఁడ విట్లు తెంపు మై
భంగపడంగ నన్ వనికిఁబంచుట నీ దొసగంచు నెంచ ; మ
త్సంగతపూర్వజన్మదురితం బిటు దుర్భరదుఃఖవార్ధి యై
పొంగి భయంకరంబుగను ముంచు ననున్ దరి గాంచకుండఁగన్.

మ॥ తొలి రాజ్యేందిరపొత్తు గా దనుచు నాతోఁ గానలం జొచ్చి తా
కలుషం బాత్మఁదలంచి, యీసునఁ దదాగారంబునన్ నిల్వ నీ
క లవమ్మేని కృపందలంపక ననున్ గారించుఁ బో యామె ; యాఁ
దలక్రిందైన సపత్నివర్గములమధ్యన్ బొత్తు సంధిల్లునే?

మ॥ దితిజోపప్లుతభర్తలైన మునిపత్నీవ్రాతముల్ చేర స
న్మతి నీయండ శరణ్యనై తి మును, దైన్యంబొప్ప నేఁడెట్టు లే
గతి నే నన్యుల రక్షఁగోరుదును, రక్షాదీక్ష మై నీవు భూ
పతివై యుండ ననాథ నాఁగ ; రఘుభూపాలా! కృతాఘం బొకో.

చం॥ కడ గనరాని త్వద్విరహగాఢమహోదధి మున్గనోడి యీ
చెడుతనువున్ ద్యజింప మదిఁ జింతయొనర్చియుఁ ద్వద్విసృష్ట మై
యడరెడు దివ్యతేజము నయంబు భరించుట పాడి గాన ని
ప్పుడమిని మేనుదాల్తు నినుఁబోలు తనూజులఁ జూచు నాసతోన్.

చం॥ ప్రసవముగల్గునంతకును భానునిబద్ధదృఢైకదృష్టి నై
యసదృశదీక్షఁ బూని భవదంఘ్రుల నెంచి తపం బొనర్చెదన్
బొసఁగ మఱొక్కజన్మమునఁ బుణ్యచరిత్రుఁడ వీవ భర్తవై
యొసఁగను విప్రయోగ మిటులెన్నఁడు గల్గకయుండ గోరుచున్.

ఉ॥ అన్యము పల్కనేటికి జనాధిప! భూప్రజ నెల్లవేళ సా
జన్యమునన్ భరించుట యశస్కరమై తగు రాచపాడి; యో
ధన్యచరిత్ర! నన్ను నిజదారగ నొల్లవయ్యెన మాని సా
మాన్యవిధంబునం గరుణమానక గావు" మటంచు దెల్పుమీ.

చం॥ అనఁ గనుదోయి యశ్రుజల మాఁగక కాల్వలుగట్ట నెట్టులో
జనకజకున్ బ్రదక్షిణముసల్పి కలంగి యెలుంగు రాల్పడన్
"జనపతి కట్ల తెల్పెద; విచారమునొందకు మంబ!" యంచటన్
వెనుకకుఁబోవ వెల్వడెను; బెగ్గడిలంబడె భీతి సీతయున్.

తే॥గీ॥ జనకజను గాంచుచును ముందుఁ జను నతండు
వెడలు సౌమిత్రి నరయుచు నడలు సీత;
సీత కన్వాయ సౌమిత్రి చేరెఁ దేరు
మఱది కన్వాయ మ్రాన్పడె ధరణిజాత.

ఉ॥ తేఱి యొకింత సీత దశదిక్కులు బోరుకలంగ జాహ్నవీ
తీర శిలోచ్చయంబులు ప్రతిధ్వనివేర గుహాముఖంబులన్
దారుణదుర్భరార్తిఁ బడి తారును గూయిడునట్లు దోఁపఁగా
భేరెలుఁగెత్తియేడ్చె నడవిం గురరీక్రియ ముక్తకంఠయై.

సీ॥ క్రమ్మనుమ్మలికఁ గేకారవంబుల వీడి
కాఱునెమ్ములు లాస్యగతులు వాయు,
తరఁగలై కన్నీరు దొరుగ వాల్గన్నుల
మృగకులంబులు పూరిమేయు టుడుగు,
వాడుపాఱుచులతల్ వంచిన తలలతో
శీర్ణపుష్పంబులై చెలువుఁ దొఱఁగు,
కొఱకులు మాని శకుంతసంతానంబు
కూయివెట్టు కులాయకూలములను,

తే॥గీ॥ జనకజాతుల్యదుఃఖ మై వనముగూడ
కరుణ దురపిల్లునటుఁ దోఁచెఁ గలఁగి యార్తి;
యురక రాఘవు లెట్టు లయోధ్యయందుఁ
బరితపించిరొ తొఱఁగి యా నిరపరాధ ?

⇐ వాల్మీకి సీత నాశ్రమమునకుఁ గొంపోవుట ⇒

ఉ॥ బోయ పులుంగు నేయ మదిఁ బొంగిన శోకరసమ్ము శ్లోకమై
యే యమివర్యునోటఁ బ్రవహించె సుధామయదివ్యకావ్య మై
యాయమిసత్తముండు సమిదాహరణార్థము చొచ్చి తద్వనీ
వాయువశంబునం జెవులఁ బొఱిన యార్తరవానుసారి యై.

ఉ॥ వచ్చుచు సీతఁ గాంచెనఁట; వాల్గనుదోయి దొఱంగు నశ్రువుల్
చెచ్చెఱఁ బోవఁగాఁ దుడిచి సీత నమస్కృతిచేసి నిల్చెఁ; బెం
పచ్చుపడంగ దౌహృదసమగ్ర సమున్నతలక్షణజ్ఞుఁ డై
యచ్చపు నెమ్మిఁ బల్కె "యమశాత్మజలం గనుదమ్మ యోగ్యలన్.

ఉ॥ ఇంతి యెఱింగితిన్; రఘుకులేశ్వరు పత్నివి; దుష్ప్రథార్తుఁ డై
కాంతుఁడు ద్రోవఁబంచె నినుఁ గాననభూమికిఁ; జింతవీడు; దే
శాంతరవర్తియౌ పితృనిశాంతము గాదె మదాశ్రమంబు నీ;
కంతయు యోగదృష్టి మెయి నారసితిన్ సుఖముండు మిచ్చటన్.

సీ॥ రావణప్రముఖ దుర్దైత్య నిర్మూలనో
ద్ఘాత లోకత్రయ కంటకుండు,
కలనై నఁ బరిహాసకథల నై నను బాస
తిరుగని సత్యప్రతిజ్ఞవాఁడు,
అణుతరాత్మశ్లాఘ విననోడి తలవంచి
కడులజ్జఁబడు నవికత్థనుండు,
సర్వవర్ణాశ్రమాచారధర్మక్రియా
ప్రవిమలసమయసంరక్షకుండు,

తే॥గీ॥ నైన నిష్కారణముగ ని న్నడవిఁ ద్రోయు
కతన రాఘవునెడ మాకుఁ గల్గు సుమ్ము
కోప మగ్గలముగ, నమ్మ కువలయాక్షి !
కరుణ యొక్కింత వలదె భూకాంతులకును.

సీ॥ అమరాంగనాగీత విమలకీర్తిధనుండు
దశరథేశుఁడు మామ తలిరుఁబోఁడి !
బ్రహ్మవిజ్ఞానసంపద్దానసురభి మ
త్సఖుఁడు నీ జనకుండు జలజనయన !
స్తవనీయ చరితుండు జగదేకవీరుండు
రఘుపుంగవుఁడు భర్త ప్రవిమలాంగి !
పతిదేవతాకులప్రథమగణ్యవు నీవు
పావనశీల వో పద్మగంధి !

తే॥గీ॥ కలదు నీకుక్షి, లోకమంగళకరంబు
నైన పురుషోత్తముని తేజ మంచయాన !
ఇట్టి యోగ్యత నొప్పు నీ వెన్న మాకుఁ
బూజనీయవు గాదె యంభోజవదన !

మ॥ మునిసంసర్గవినీతసత్వ మగు మ త్పుణ్యాశ్రమంబందు, హ
ర్ష నవోద్భిన్నహృదబ్జ వై ప్రసవసంస్కారంబు నర్థించుచున్
వనజాతాక్షి ! యపేతభీతి నిలుమా ! భద్రంబు సంధిల్లుఁ బా
వన మౌనీంద్రసతుల్ సపర్యఁ దనియింపం జేయ నిశ్చింత వై .

మ॥ యమివాసోటజపూర్ణతీర మఘసంహారప్రవాహంబు నౌ
తమసావాహినిఁ గ్రుంకులాడి తమితోఁ దత్సైకతోత్సంగభా
గములం దారచితోపచారబలిసంస్కారంబులన్ నెమ్మి మై
బ్రమదం బొప్పు మనఃప్రసాదమగు దూరంబేగు సంతాపముల్.

మ॥ బలికై నివ్వరి ప్రాలునుం ఋతుబలప్రాప్తప్రసూనంబులుం
ఫలముల్ దెచ్చి యొసంగనేర్తురు ; ప్రగల్భస్నిగ్ధవాక్చాతురిం
జలజాతాక్షి ! ముదంబుగూర్తురు మిథస్సల్లాపమాత్రంబునం
గలకంఠుల్ మునికన్యకల్ గలరు సంగాతంబు వాటింపఁగాఁ.

చం॥ చెలువ ! మదాశ్రమంబునను జిత్తవినోదము విస్తరింప నీ
బలముఖోలంది బాల నవపాదపరాజి పయోఘటంబులం
బొలుపుగఁదన్పుచుం బ్రసవపూర్వమె సంభృతమాతృపుణ్యవ
త్సలత స్తనంధయాత్మభవజాతవినోదముఁ జెంద కుందువే ?"

చం॥ అని తనచూపు సత్కృపకు హర్షముతో నొడఁబాటుచూపు నా
జనకజ వెంటఁగొంచు మునిచంద్రుఁడు శాంతమృగప్రచార మై
మునిజనవాసమై హరిణపోతసమాశ్రితవేదిమధ్య మై
తనరు నిజాశ్రమంబుఁ బ్రమదంబునఁజేరెఁ బ్రదోషవేళకుం.

తే॥గీ॥ సీత రాకకు మదిసంతసించు తాప
సాంగనల కర్షణమొనర్చె నామె మాని ;
దర్శకాలమ్ము పితృగణత్యక్తమైన
యమృతకరుకళ నోషధులందుఁ బోలె.

ఉ॥ శీలసమగ్ర లౌ తపసిచెల్వలు సీత సపర్యఁదన్పి, శో
కాలస నల్లఁదేర్చి, హరిణాజినకల్పితతల్ప మింగుదీ
తైలకృతప్రదీపలలితంబు, నిరస్తసమస్తదుస్తమో
జాలము నైన యొక్క యుటజంబున నిల్పిరి నెయ్య మొప్పఁగాఁ.

సీ॥ పతిఁదలంచుచు లేచి ప్రత్యూషవేళలఁ
దమసాధునీవారిధారఁ దోఁగి,
యాదిత్యునర్చించి యరుణాంబురుహములఁ
గులదేవతల నెల్లఁ గొలిచి భక్తిఁ,

దడిఁయొత్తి ధరియించి ధౌతవల్కలయుగ్మ
మతిథులఁ దన్పి యోగ్యార్చనముల,
ఫలమూలముల దేహభరణంబు గావించి
నిద్రించి కటికుశానేలలందుఁ,

తే॥గీ॥ భర్తృవంశాంకురంబులఁ బడయఁ గోరి
నియతముఁ నివృత్తి మైఁ దపోనిష్ఠఁ బూని,
పతిపదాబ్జాతచింతనాపరత సీత
దేహధారణ మొనరించు దివ్యదీక్ష.

మ॥ అట సౌమిత్రియు జానకిన్ విడిచి దివ్యస్రోతమున్ దాఁటి యా
రటముం జెందు చయోధ్యఁ జేరఁ జని తేరన్ రామభూమీశుతో
నెటులో సాధ్వి వనాళిఁ ద్రోసితిఁ గృపాహీనుండ నై యంచు నాఁ
డట డగ్గుత్తిక దెల్పి దైన్యమున సంతప్తాత్ముఁ డై నిల్వఁగన్.

చం॥ కనుగవ నశ్రుబిందువులు గ్రమ్మఁగ మోము వివర్ణమౌచు సీ
తున మిహికాకణాక్త నవతోయరుహంబున కుద్ది గాఁగఁ బె
న్వనఁటఁ దపించు రాముఁ డపవాదకునొచ్చి గృహంబునుండి ద్రో
సెను వనిఁ గాని పాయఁ డట చిత్తమునుండి మహీజ నెమ్మి మై.

శా॥ శోకావేగము నిగ్రహించియు మనఃక్షోభంబు సైరించి యా
కాకుత్స్థాన్వయుఁ డుర్వి సర్వజనరక్షాదీక్ష మై రేఁబవల్
సాకల్యంబుగఁ బుచ్చు సత్త్వగుణసంశ్లాఘ్యాత్ముఁ డై జీవమా
త్రైకాధారముగా భజించు మితభాగ్యం బాత్మసన్యాసి యై.

తే॥గీ॥ ఏకపత్నీవ్రతుం డయ్యె నిట్లు సీత
సాధ్వి నపవాదచేఁ బ్రవాసమున కంప
రామచంద్రాశ్రయం బంది రాజ్యలక్ష్మి
యలరె నసపత్న సౌఖ్యమ్ము లందినట్లు.

చం॥ జితదశకంఠుఁ డా నృపుఁడు సీతఁ దోడంగి వరింప కన్యఁ ద
త్ప్రతికృతిమాత్రయుక్తుఁ డయి భవ్యమఖంబులు పెక్కొనర్చె; భూ
సుత కిది కర్ణయుగ్మమున సోఁకి ముదం బొడఁగూర్చె నట్లు దు
ర్మతి వనిఁద్రోసె నన్న వగమాన్చి కృతార్థతఁగూర్చి నిచ్చలున్.

తే॥గీ॥ భూమిజఁ దోడంగి యా రామభూవిభుండు
రమణ రత్నాకరప్రాజ్యరశన యైన
ధరణిమాత్రము చేఁబట్టి తనియఁ జొచ్చె
సర్వసన్మునినుతధైర్యసారుఁ డగుచు.

⇐ లవణాసురవధ ⇒

క॥ లవణుండను దైత్యేశుఁడు
మివురన్ బాధింప సంయమిప్రవరు లటన్
రవివంశ్యు శరణు చొచ్చిరి
సవనక్రియఁ గావ రాత్రిచరు హరియింపన్.

క॥ భూపాలుఁ డగుట రాముఁడు
శాపోదకమెత్తి మునులు చంపరు దైత్యున్;
బ్రాఁపుచెడినంత రక్షకుఁ
దాపసు లది వ్యయముచేయఁ దలతురు గాదే.

ఉ॥ “శూలము కేలఁదాల్చి యనిఁజొచ్చిన దానవు గెల్వరాదు త
చ్ఛూలికి నైన; నొండు తఱిఁజూచి వధింపఁగఁ బోలు నంచు భూ
పాలునితో వచింప దనువంశ్య వధక్రమమున్ గ్రహించె; నె
క్కాలము శౌరి దైత్యవధకై యవతారముఁదాల్చు గావునన్.

శా॥ జైత్రంబంబుజమిత్త్రసత్కులము తజ్జాతుం డెవండేనియున్
శత్రుచ్ఛేద సమర్థుఁ డర్థయుతమా శత్రుఘ్ననామంబు నాన్
శత్రుఘ్నున్ బనిచెన్ విశేషవిధిచే సామాన్యశాస్త్రంబు బటుల్
శత్రువ్రాతము బాధ పాల్పడగఁ గౌసల్యాసుతుం డయ్యెడన్.

క॥ బలిష్ఠయై రామకృతాశీ
ర్బలిష్ఠయై దాశరథి రథియు రణదోహలి యై
ఫల పుష్ప రమ్యగహన
స్థలులం గను చరుగు మానిసంఘము వెంటన్.

ఆ॥వె॥ అగ్రగాము లగుచు నమ్మునివర్యులు
చూపు దారి నేగు శూరుఁ డతఁడు
తనరథంబు మున్ను జనువాలఖిల్యుల
తోడి యంశుమాలి కీడు వచ్చు.

చ॥ అటు లొకనాఁడు సాఁగి దివసాంతమునన్ రథనేమి నిస్వన
స్ఫుటకుతుకోన్నతాస్యమృగపోతకచంచలనేత్రమాలికా
పటలపరిష్కృతుం డగుచుఁ బావనుఁ డాతఁడు సేనతోడ నా
కృటను బ్రచేతసస్తనయుఁ గాంచఁ దదాశ్రమభూమి కేఁగినన్.

క॥ శ్రాంతాశ్వ నతని సంయమి
కాంతుఁడు స్వ తపోవిలాసకల్పిత బహుళా
నంతె సుఖభోగసంతతి
సంతుష్టుం జేసె నానిశన్ సైన్యముతోన్.

ఉ॥ వారిరుహాక్షి సీత ప్రసవవ్యథనొందుచు నేయి గర్భసం
స్కారవిధిజ్ఞ లైన మునికాంతల నేర్పున నష్టకష్ట యై
ధారుణి కోశదండములఁ దా నొడఁగూడ్చిన మాడ్కి నల్ల బ్రుం
దారకతుల్యులన్ యమళదారకులన్ రవితేజులం గనెన్.

తే॥గీ॥ రాఘవున కిట్లు పుత్త్రసంప్రాప్తి యయ్యె
ననుచు శత్రుఘ్నుఁ డాలించి హర్షమంది,
వేగుజామున సెలవంది వేడ్కఁ దేరుఁ
బూంచి సైన్యంబుతో దైత్యుప్రోలి కరిగె.

క॥ అతఁడు మధూపఘ్నుం డను
దితిజావాసమ్ము చేరె; దితిజుం డటవీ
గతజంతులఁ గొని కరము
ట్టతి రోషోద్దీప్తుఁ డగుచు నరుదెంచె వడిన్.

సీ॥ కాటుకపూసిన కరణి ధూమ్రంబైన
మేను మేఘంబట్లు మింటఁ బర్వ,
దూరభూస్థలినున్నవారి కైనను వాంతి
గలిగించునటు వసాగంధ మడర,
జ్వలియించు దవహుతాశజ్వాలికలఁ బోలి
పాటలంబగు కేశపటలి యెగుర,
క్రవ్యాద్గణంబులు గ్రమ్మి నల్దిక్కుల
భయద కోలాహలధ్వను లొనర్ప,

తే॥గీ॥ జంగమం బైన యల చితాజ్వలన మట్లు
భయజుగుప్సాకరంబుగ వచ్చు వాని
చెనఁటి నాదైత్యు కుంభీనసీకుమారుఁ
గాంచె సౌమిత్రి కోపాగ్ని కలితుఁ డగుచు.

ఉ॥ శూలవిహీనుఁ బోట దనుజున్ బొరిపుచ్చి వధింప నద్దియే
వేళ యటం చెఱింగి రఘువీరుఁడు దానవుఁ జుట్టుముట్టె; నె
క్కాలము శత్రు దుస్థితిని గాంచి తదంతరరంధ్రఘాతికిన్
బోల జయంబుగల్గు శుభముల్ సమకూడును గాదె యెవ్విధిన్.

మ॥ అవరోధించిన వైరి కిట్లనెను గ్రోధాభీలుఁడై రాక్షసుం
"డవురా! యేర్చెదు జాఠరాగ్ని కిటు పర్యాప్తంబులే యల్ప జం
తువులం చెంచఁగ భీతుఁడై నలువ తోడ్తోఁ బంచిన ట్లంత నా
సవిధంబొందితి, నిన్ను మ్రింగి యుదె నే చల్లార్తు నాయాఁకటిన్".

క॥ అని తర్జన మొనరించుచు
దనుజుం డొక తరువుఁ బెఱికి, దాన సుమిత్రా
తనయుఁ బ్రేసిన నాతఁడు
దునిమెఁ ముక్కలుగ దాని దోఃకౌశలిమై.

క॥ సౌమిత్రిశరనికృత్తం
బై మహీ నాతరువు ద్రెళ్ల నతిచిత్రముగా
రామానుజు నౌదలఁ బడె
భూమీరుహశీర్ణపుష్పపుంజ మ్మొకటన్.

ఉ॥ పాదపమిట్లు వమ్మయినఁ పర్వతశృంగమహోపలం బొకం
డా దనుజుండు బాహువుల నల్లఁ దెమల్చి సుమిత్రపట్టిపై
నూఁది పడంగవైచె శమనోగ్రభయంకరముష్టి పోల్కి న
మ్మేదిని గంపమొంద వెఱమించి తపోధన బృంద మార్వఁగన్.

క॥ ఐంద్రాస్త్ర మేసి యట దా
నిం ద్రుంచె సుమిత్రపట్టి నేర్పు మెఱయ న
ద్రీంద్రోపమము తచ్ఛిల
సాంద్రాణువు లగుచుఁ జిదికి సైకత మయ్యెన్.

శా॥ వాతోద్ధూతగిరీంద్రశృంగ మన నప్పాపుండు సౌమిత్రిపై
జాతస్పర్ధకృతాంతదండభయదాంసం బెత్తి రా భీమసం
పాతామోఘము వైష్ణవాస్త్రమును జాపంబందు సంధించి యా
దైతేయుఁ ధరఁగూల్చె దాశరథి మోదంబొంద మౌనీశ్వరుల్.

ఉ॥ ఆ లవణాసురుం డిటు తదస్త్రవిదారితవక్షుఁ డై ధరన్
వ్రాలఁగ దద్రణాంగణము గ్రక్కదలెన్ వనపర్వతాళితో;
నేలఁదొఱంగినట్టి రజనీచరుఁగాంచి మునీంద్రచిత్తముల్
జాలిఁగఱంగెఁ దొంటి భయసంగతి బోఁ గుదురొందినట్లుగన్.

తే॥గీ॥ చచ్చిపడియున్న దైత్యు మస్తకమునందు
కంకగృధ్రాదికంబులు కడఁకవ్రాలె
దైత్యుఁజంపిన యా సుమిత్రాకుమారు
నౌదలను రాలె దివ్యులతాంతవృష్టి.

చం॥ అనితరసాధ్యుఁడైన లవణాసురుఁ జంపుట మేఘనాదునిన్
దునిమి యశేషలోకపరితోష మొనర్చిన యన్న కీడుటం
చును మునిబృందము ల్బొగడ స్తోత్రపరాఙ్ముఖచిత్తవృత్తి నా
ననమును వంచె నా ఘనుఁ డనన్యబలోన్నతుఁడయ్యు నయ్యెడన్.

కం॥ అట నాతఁడు కాళిందీ
తటమున సౌరాజ్యబుద్ధధనమగు మధురా
పుటభేదనంబు నిల్పియుఁ
బటు బాహాశక్తి రాజ్యపాలన నెఱపెన్.

ఉ॥ ఆ మనువంశ్యుఁ డున్నగరహర్మ్యతలోన్నతచంద్రశాలలం
దిమ్ముఁగనిల్చి తత్పురము నెల్లను గాంచి ముదంబునొంది పై
గ్రమ్మెడు చక్రవాకముల రాకలు న య్యమునం దలంచుఁ దో
రమ్ముగఁ బైడిసొమ్ము లలరన్ దగు భూసతి నీలవేణిగాన్.

## ⇐ కుశలవుల జన్మవృత్తాంతము ⇒

సీ॥ ఉప్పరంబుదొలంగి యుర్వి నొక్కట నిల్వ
ప్రభవమందిన పుష్పవంతు లనఁగ,
గగనసంవాసంబు డెగడి మేదినినుండఁ
బరతెంచు నల పునర్వసువు లనఁగ,
నాకవాసమ్ము మనంబునఁ గాదని
నేలఁబుట్టిన యాశ్వినేయు లనఁగ,
ఒండొరులను బాయ నోప కొక్కెడ భూమి
జన్మించు చైత్రవసంతు లనఁగ,

తే॥గీ॥ ద్వివిధ రామరూపప్రతిబింబము లనఁ
గనుదోవల నిందు లై తోఁచు గవలఁ గాంచి
జన్మసాఫల్య మొందిన చందమునను
సంతసించును జానకి స్వాంతమందు.

క॥ ధరణిజ వాత్సల్యంబునఁ
గరఁగి సుధాలహరి యైన కిరణిం దనలో
మురియుచుఁ దోఁత్తో గీత
స్వరమున వాల్మీకి కనియె బహుదుఃఖిత యై.

చ॥ "మునికులచంద్ర! యీ కవలముద్దుమొగంబులఁ గాంచఁగల్గుటన్
దనువు తరించె; మత్తప ముదారఫలం బొడఁగూర్చె నిట్టు లా
దినమణివంశ్యు నానతిని దీర్చితిఁ; జెల్లె ఋణంబు; గాని మ
త్తనయు లనాథులై రి నృపదారకులయ్యు వనాంతజాతు లై.

చ॥ చిఱుతలఁ జూచి రాఘవుఁడు చిత్తమునం దెటు హర్ష మొందునో
తరణికులప్రదీపు లని తమ్ములు తా మెటు గారవింతురో
పురజను లెట్లు హర్షమునఁ బొంగుచుఁ బందువు సేయఁ జూతురో
కర మనురక్తి నత్త లెటు గాంతురొ వీరి నయోధ్యఁ బుట్టినన్."

తే॥గీ॥ అనుచు నుద్విగ్నయై పల్క నవనిజాత
నల్ల నోదార్చి వాల్మీకి యనియె నిట్లు
"ఉమ్మలించెదవేల నో యమ్మ! యిట్లు
కష్టములు పాయ సుఖములు గలుగవొక్కొ."

క॥ అని జనకహితుఁడు దశరథ
జనపతి నెయ్యుండు మౌని సమయజ్ఞుం డై
యొనరిచె నుభయప్రీతిన్
జనకజతనయులకు జాత సంస్కారంబుల్.

కం॥ కవలకుఁ గుశలవులని యా
కవికులతిలకుండు నామకరణ మొనర్చెన్
నవకుశలవనష్టాప
ప్లవగర్భక్లేశు లగుట ప్రకటము గాఁగన్.

సీ॥ యువతి యొక్కతె నెమ్మి నుగ్గుద్రావించెను
జలకమార్చె మఱొక్క సరసిజాక్షి,
తడియొత్తె వేఱొక్క తరుణీమతల్లిక
పద్మాస్య యొకతె ధూపంబువైచె,
పవ్వళింపఁగఁజేసెఁ బల్లవాధర యోర్తు
జోలపాడె మఱొక్క నీలవేణి,
ఉవిద యొక్కర్తుక యుయ్యేలనిడి యూఁచె
లాలించె నొక్క విశాలనేత్రి,

తే॥గీ॥ తాపసాంగన లిట్లు నెమ్మి తమకులొత్త
సాంద్రవాత్సల్యమునఁ బరిచర్యఁ దన్పి,
ప్రోది యొనరింప నుర్వరాపుత్త్రి మదిని
గవల మురిపెంబు గని హర్షకలనఁ గాంచు.

ఉ॥ శైశవ మించుక ట్లరుగ జానకిపుత్త్రుల నాశ్వినేయసం
కాశుల సత్కృపాకలన తాత్రకులోచితమైన రీతి మా
నీశుఁడు సంస్కరించి విధిదృష్ట విధంబున సాంగవేదవి
ద్యాశరచాపకౌశలరహస్యము లెల్ల నెఱుంగఁ జెప్పెచున్.

తే॥గీ॥ ప్రాక్తనాశేషభవదోషవహ్నికల
పరమపదదివ్యసౌధసోపానపాళి
అమృతపూర్ణంబు స్వకృతి రామాయణంబు
గఱపె శ్రుతిపేయలయతాళగతులు మెఱయ.

కం॥ కవ లాత్మజనని కడ రా
ఘువచరితామృతముఁ గురిసి గంభీరగతిన్
జెవిదోయి కింపు గొలుపుదు
రవనిజ పతివిరహదుఃఖ మల్ల శమింపన్.

కం॥ అని వాల్మీకి రచించిన
తనచరితముఁ గవలు దెల్పఁ దత్పరమతి యై
విని రామచంద్రనరపతి
యనిమేష గుశలవులఁ జూచి యచ్చెరువొలయన్.

ఉ॥ "ఏ మహిళాశిరోమణి ధరించె మిమున్ దనగర్భశుక్తి, మీ
కే మహనీయ తేజము పితృత్వము గాంచి యశస్యమయ్యెనో
యే మునివర్యుఁ డీకృతి రచించి పఠింపఁగఁ జేసె శైశవ
శ్రీమహనీయులార ! నెఱిఁజెప్పి యొనర్పరె కర్ణపర్వమున్."

కం॥ నావుడు "వాల్మీకుల యం
తేవాసుల మంబగలదు ధృతసద్వ్రత ; మా
కేవాఁడో జనకుఁ డెఱుగము ;
కావించె మునీంద్రుఁ డాదికావ్యము దీనిన్.

ఉ॥ ప్రీతిఁదలిర్ప మాకుఁ గఱపెన్ నిగమంబుల నెల్లఁ దొల్లి ; ప్రా
చేతసుఁ డంత నీకృతి రచించి పఠింపఁగఁ జేసె ; దీన మా
మాత వినోదమొందు ; మునిమండలి హర్షముగాంచు ; నిద్ధ వి
ఖ్యాతము భూవరా ! ప్రథమకావ్య మనన్ బుధలోకమాన్య మై."

మ॥ అనినన్ హర్షరసాబ్ధిఁ దేలి రఘువంశాధీశుఁ డ బ్బాలురన్
గనకాలంకృతిముఖ్యసత్కృతులఁ దన్పం జూడ "మా కేల ? కా
ననపర్ణోటజనిత్యవాసుల కనర్ఘం బైన యిక్కానుక ? పా
వనచారిత్ర ! భవత్కృపాలవము మాపై నిల్పినం జాలదే ?"

చం॥ అని వినయోత్తరంబుగ జనాధిపుఁ డిచ్చిన యీవు లెల్ల చే
కొనక యనుజ్ఞనొంది జనకోటి నుతింప నిజాశ్రమంబుతో
వను జని రాకవల్ ; నృపతివర్యుఁడు ప్రాన్పడి నిర్నిమేషుఁడై
కనుగొనుఁ జూపుమేరకడగాఁ దనచూపులు వెంటనంటఁగన్.

సీ॥ రమణీయ రాఘవప్రతిబింబము లనంగఁ
జూపట్టు యమళుల రూపుఁగాంచి,
కిన్నరస్వరముల గీటుబుచ్చెడి వారి
గానమాధురి కర్ణగతులఁ గ్రోలి,
శబ్దార్థవిన్యాససౌరభంబుల నించు
వాల్మీకిరచిత ప్రబంధ మరసి,
సత్యశమాచారశౌర్యగాంభీర్యాది
సద్గుణోత్తమ రామచరిత మెన్ని,

తే॥గీ॥ పరవశతఁ గొన్న తత్సభావాసు లెల్ల
రవనిపతిచేయు సత్కృతి నవలఁద్రోయు
కవల నిస్పృహావర్తన గాంచి మివుల
నచ్చెరువునొంది రతిలోకమని నుతించి.

<= వాల్మీకి రామునకుఁ గుశలవుల వృత్తాంతము దెల్పుట =>

ఉ॥ ఆకమలాప్తవంశమణి యమ్మఱునాఁడు సభక్తిఁ దెచ్చి వా
ల్మీకికి సపర్యఁ దన్పుచు సలీలగ వారిఁ బ్రశంసఁ జేయ నా
నాకుభవుండు పల్కెఁ "గరుణం బరికింపుము తత్కుశీలవుల్
నీ కొడుకుల్ గ్రహింపు ధరణీసుత పావనశీల" నావుడున్.

చం॥ "అవనిజ మత్సమక్షమున నగ్ని విశోధితసాధ్వి దేవతా
ప్రవరనుతాత్మశీల ; యది పౌరు లెఱుంగక లంక దుష్టదా
నవపరిభూత యంచును మనంబుల నెంతురు గానఁ బ్రత్యయ
మ్మొ వలుక సీత, పౌరు లనుమోదముఁ జూప బరిగ్రహించెదన్".

కం॥ అనుటయుఁ దన శిష్యులచే
ముని రావించెను మహీజఁ బూతచరిత్రన్
విను తాత్మతపస్సిద్ధిన్
ఘననియమశ్లాఘ్యములచేత గడియించు సతిన్.

తే॥గీ॥ నాఁటి మరునాఁడు మనుకులనాయకుండు
ప్రకృతకార్యానుసంధానపరతఁ బౌర
వర్గసమ్మేళనంబు నేర్పఱచి వానిఁ
బిలువ నంపును దత్సభాస్థలి వసించి.

కం॥ స్వరసంస్కారంబుల యు
గ్వరమున నాదిత్యుఁబోలెఁ బ్రత్యూషమునన్
ధరణీశుఁ జేరె మునికుల
వరచంద్రుఁడు సుతులతోడివసుధాసుతతోన్.

సీ॥ సంస్కారశూన్యమై జడగట్టి పల్లనై
వ్రేలి మూఁపునవ్రాలు వేణితోడ,
దయనీయ మునిజనాదరణీయ నిర్మల
సంధ్యాకషాయ వస్త్రంబుతోడ,
గరనలిపశ్చర్యఁ గ్రశమంబుఁ దాల్చియు
సతిలితరోజ్జ్వల దేహయష్టితోడ,
భర్తృపాదార్పిత పరమపావనశీల
దీప్యమానైకాగ్రదృష్టితోడఁ,

తే॥గీ॥ దత్సభాస్థలి నిల్చిన ధరణిజాత
నరసినంత విశుద్ధగా నెఱిఁగి పౌరు
లశ్రుపూర్ణాక్షులై వినతాస్యులైరి
చిత్రరచితాకృతులు నా నచేష్టు లగుచు.

ఉ॥ అంతట వామలూరుభవుఁ డమ్మహిజాతను గాంచి "తల్లి ! నీ
కాంతుఁడు త్వత్సతీత్వపునిగారము లోకు లెఱుంగఁగోరి సా
మంతులతోడఁ గొల్వమరె ; మానిని ! పౌరులెఱుంగ నీవు దృ
ష్టాంతమొకండు చూపి జనసంసద మెచ్చు తెఱంగొనర్పు" నాన్.

శా॥ వాల్మీకిప్రియశిష్యసంభృతజలోపస్పర్శచేఁ బూతయై
కేలోమ్మొద్పుం గదియించి భర్తృపదముల్ గీలించి చిత్తంబునన్
"బల్మింబట్టిన దైత్యుఁ డవ్యభిచరద్భావంబుతో నాథుపైఁ
జెల్మిం దప్పనయేని, తల్లి ధరణీ ! చేకొమ్ము న న్నియ్యెడన్.

సీ॥ అంగరాగము లిచ్చి యనసూయమొదలైన
సతులు పూజించుట సత్యమేని,
ఆలంక జరిగిన యగ్నిసంశోధన
కమరదానవులబ్బ మందిరేని,
అకలంకవర్తనయని పావకుఁడు తెచ్చి
యినకులేశ్వరున కర్పించనేని,
త్రికరణశుద్ధిగా దినకరాన్వయదీపుఁ
దక్క నన్యుని మదిఁ దలఁపనేని,

తే॥గీ॥ వేయిజన్మంబులకు రఘువీరుఁ డాత్మ
విభుఁడు గావలె నంచుఁ దలంతునేని,
విశ్వవిశ్వంభరాదేవి ! ప్రేమతోడ
అరసి నను నిల్పుఁగాక యాత్మాంతరమున."

ఉ॥ అనుచుఁ బ్రతిజ్ఞసేయుడు మహానినదంబున భూమి వ్రక్కలై
యినశతకోటితేజము జనించి తదంతరమందు శేషశీ
ర్ష నివహాధార్యమాణశుభరత్నమయాసనమధ్యసంస్థయై
కనఁదగి భూత ధాత్రి నిజకన్యను జేకొనిపోయె లోనికిన్.

ఉ॥ ఏఁపున సీత సత్క్రియ హరించిన కుంభిని ద్రుంప మార్గణా
రోపమొనర్చు రాఘవు గురుండు ప్రసన్ను నొనర్చి యల్ల సం
తాపము వాయఁజేసె భవితవ్యము తద్విధమంచుఁ దెల్పి ; యా
భూపతి యశ్వమేధమును బూర్ణమొనర్చె ప్రశాంతచిత్తుఁ డై.

కం॥ సవనాంతమందు మానుల
నవనీపతి వీడుకొల్పి యవనీసుతపైఁ
దవిలిన తన యనురాగము
కవలయెడన్నిలిపె విదితకార్యస్థితి యై.

సీ॥ జానకీముఖపద్మసౌందర్య మిదియని
ముద్దునెమ్మోములఁ బుణికిపుణికి,
రాఘవధవళనేత్రద్వంద్వ మిదియని
కందోయి పల్మరు గాంచిగాంచి,
సీతమ్మచెవిదోయి చెలువ మియ్యదియని
నెమ్మి కర్ణంబుల నిమిరినిమిరి,
శ్రీరామునెమ్మేనిచెలువ మియ్యదియని
నిచ్చలు కౌఁగిటఁ గ్రుచ్చిగ్రుచ్చి,

తే॥గీ యహమహమికలుమీర శుద్ధాంతకాంత
లా కుశలవుల నిల్పి నిజాంకపాళి,
మురియుచుందురు వాత్సల్యభరిత లగుచు ;
కనుగవ వెలుంగులన శిశుజనులు గారె !

కం॥ జననులు పితృలోకమునకుఁ
జనగా నొనరించి యుచితసంస్కారంబుల్
జననాథుఁడు మాతౄణము
ననుజులతోఁ దీర్చె ధర్మనిత్యాశయుఁ డై.

## ⇐ యముండు శ్రీరాముని వైకుంఠమునకు రమ్మని ప్రార్థించుట ⇒

ఉ॥ అంతట నొక్కనాఁడు వసుధామరరూపమునన్ యముండు భూ
కాంతుని జూడవచ్చి "రఘుకాంత! రహస్యమొకండు గల్గ నే
కాంతమునందొకండె యుండఁదా'' యనెన్ : కౌతుకియై దరిఁజేర్చి "కోరినన్
చెంతకుఁ జేరనీయకుము చేర్చిన వారల ద్రుంచువాఁడ'' నం చానతొసంగినన్.

క॥ రామానుశాసనుఁ డయ్యెడ
సౌమిత్రిని నిల్పె ద్వారసంరక్షణకై ;
రామాజ్ఞ తలధరించెడి
ధీమహితుం డతఁడుగాఁడె త్రిభువనమందున్.

మ॥ "సరసీజాసన ముఖ్యనిర్జరులు యుష్మద్దర్శనాకాంక్ష ని
ర్భరకౌతూహలులై త్వదాగమన దివ్యద్భాగ్య మాసింతు ; రి
క్కరణిన్ దీర్చితి దేవకార్య మిఁక నాకౌకంబు గైసేయఁగా
"వలెఁ దేంచేయుఁ'' డటంచుఁ బల్కె యముఁడున్ సాష్టాంగ ప్రణామంబుతోఁ బ్రీతిలోన్.

క॥ ఇలఁ బ్రఖ్యాతుఁడగు మునికు
లతిలకుఁడు దుర్వాసుఁ డంతట దినమణివంశ్యున్
లలిఁ జూడఁగోరి ద్వార
స్థలి నిల్వఁగ లక్ష్మణుండు చకితాత్మకుఁ డై.

ఉ॥ ఏకతమున్నదే ఱేఁడు పరులెవ్వరు లోఁజొరరాదటంచుఁ దా
వాకొని ; యాఁచినన్ ముని యపారతపోమహిమాఢ్యుఁడోర్మి మై
నూఁకొనునో ? నిసర్గభయదోగ్రతపోదవవహ్ని గాలఁగా
వీఁకను శాపమిచ్చునో ? యపేతకృపామతి నంచు భీతుఁడై.

క॥ వారింపఁడయ్యె ! ముని బృం
దారకుఁ డట లోనికేగె ; ధాత్రీపతియున్
గారవమునఁ బూజించెను ;
వారక చనె యముఁడు విఘ్నభగ్నాశయుఁడై.

ఉ॥ రామనియోగముం గడచి ప్రాణము దాల్చునె లక్ష్మణుం డనన్
ధీమహితుండు యోగసరణిన్ సరయూనది మేనుబాసి శ్రీ
రాముని యాజ్ఞఁ దీరిచి చిరంతనధామముఁ చేరి నిత్య సు
త్రామసమానభోగముల రంజిలు లక్ష్మణుఁ డాత్మమూర్తితోన్.

తే॥గీ॥ పరఁగు తనయాత్మలలో నొకభాగ మిట్లు
నాకమున కేగ నా జననాథమౌళి,
ధర్మ మయ్యెడ ముక్కాలఁ దనరినట్లు
శిథిలగతి నిల్చె మదినెంతొ కలఁతఁ జెంది.

సీ॥ ప్రథితవిక్రముఁ గుశావతీరాజుగాఁ జేసి
క్రూరారిమదగజాంకుశుని గుశుని,
శరబలార్ధనుశరావతిపాలకు నొనర్చి
లలితోక్తిజనితాశ్రులవుని లవుని,
[illegible] యగ్నిసహితుఁడై యుత్తరా
శకు నించుకించుక సాఁగిసాఁగి,
పతిభక్తిగృహమాత్రవర్జ్యమయోధ్యచే
ననుగమ్యమానుఁడై యరిగియరిగి,

తే॥గీ॥ దైత్య వానర నర పురోధసులతోడ
నయగుణసమాప్తశుభవిమానంబు నెక్కి
మహితవైకుంఠదివ్యధామంబుఁ జేరె
సాంద్రసత్కీర్తి శ్రీరామచంద్రమూర్తి.

మ॥ అలంకేశ్వరుఁ ద్రుంచి తీర్చి సురకార్యంబట్లు వాతాత్మజున్
బ్రాలేయాద్రి, విభీషణున్ దితిజ సామ్రాజ్యేశుఁగా లంకలో
శ్రీలక్ష్మీశుఁడు నిల్పి శాశ్వతజయశ్రీసంభయుగ్మంబు నాన్
లీలామానుషవేషమున్ విడిచి తొలిం జేరె వైకుంఠమున్.

ఉ॥ శ్రీరఘురాముఁడే యఖిలసేవ్యపరాత్పరుఁ డౌటఁ దత్కథా
సారము విన్నవారల కచంచలనై భవ మిచ్చుఁ బ్రీతుఁడై,
యీ రఘురామ సచ్చరిత మిష్టశుభంబులొసంగు పేర్మి మం
దారమహీజ మట్లు నిరతం బతిభక్తిపఠించు వారికిన్.

తే॥గీ॥ భక్తితో విన్న జన్మసాఫల్యమబ్బు,
పూర్వసంచితభవదోషములు నశించు,
ఆయురారోగ్యసంపద లలమికొనును,
కలికృతాఘంబు లఁడచు నీకావ్య మిలను.

చం॥ జనకసుతాకళత్రపదసారసమత్పదభూతమానసా !
వినయవివేకశీల ! సముపేతగుణోన్నత ! పుణ్యవర్తనా !
వనధిసుతాకటాక్ష చిరవర్ధితశాశ్వతభాగ్యవైభవా !
మునిజనతుల్యవర్తన ! యమూల్యయశోవిభవైకభూషణా !

కం॥ నిత్యానిత్యవివేక
స్తుత్య మనీషావిశేషశోభితకీర్తీ !
మత్యమరాధిప ! లక్ష్మీ
నిత్యాశ్రిత ! ధర్మకర్మనిర్మలమూర్తీ !

లయగ్రాహి॥ మంగళమివిస్ఫురదభంగురయశోవిభవ
సంగతిమహోజ్జ్వలశుభాంగ ! మృదువేషా !
అంగజతనూవిభవభంగకరశంభు శర
భంగపదపద్మయుగసంగతహృదబ్జా !
స్వాంగవలయాయితభుజంగసుఖలింగపద
రంగదరుణాంబురుహ భృంగకులచంద్రా !
సంగపరిదూరయతిపుంగవసమాదృతష
డంగయుతవేదరత ! మంగళగుణాఢ్యా !

గద్య॥ ఇది శ్రీమత్కాశ్యపగోత్రపవిత్ర సుబ్రహ్మణ్యపుత్త్రి
బుధజనవిధేయ వేంకట సుబ్రహ్మణ్య నామధేయ
ప్రణీతంబైన శ్రీరఘురామచరిత్రంబునందు
సర్వంబు నుత్తరకాండము.



PRINTED AT GORDON PRESS, 770, TRIPLICANE HIGH ROAD, MADRAS-5.

# తప్పొప్పుల పట్టిక



| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 11 | 6 | తోఁచర్ల | లోఁచర్ల |
| 19 | 18 | మోచనారతిన్ | మోచనార్థమై |
| 38 | 4 | శతృఘ్ను | శత్రుఘ్ను |
| 55 | 12 | బదల | బవల |
| 89 | 12 | పెన్పనట | పెన్వనట |
| 91 | 10 | శరశరాసనముల్ | శరకుఠారములన్ |
| 97 | 10 | లక్షణుఁడు | లక్షణుండు |
| 99 | 15 | గల్గె | గలిగె |
| 111 | 8 | రోపిత | పాపిత |
| 120 | 2 | దైత్య | అసుర |
| 123 | 16 | చెల్లెలిఁగనఁడు | చెల్లెలింగనఁడు |
| 131 | 3 | నట్టెలు | సట్టులు |
| 136 | 10 | గావగ | మాతను |
| 145 | 20 | కటులన్ | కటుల్ |
| 146 | 17 | లాఁకాకుత్థ్సులకాఁన | లాసత్వాధ్యులకాఁన |
| 149 | 7 | కిన్నుదోయి | కనులదోయి |
| 155 | 2 | చిత్తముల్ | చిత్తమున్ |
| 162 | 6 | సుతకృ | సుతును |
| 166 | 2 | మదంగతి | మందగతి |
| 183 | 14 | వెడలు | వెలలు |
| 187 | 23 | ప్రతివాత | ప్రతిఝంఝా |
| 189 | 5 | సౌభ్యాగంబు | సౌభాగ్యంబు |
| 192 | 6 | పొనుపు | పొలుపు |
| 192 | 19 | తరఁగలఁబోలి | తరఁగఁబోలి |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 192 | 23 | దుఱుసు | దురుసు |
| 203 | 21 | దాల్చి | తొఁడిగి |
| 213 | 5 | పవనాత్మజుఁడు | పవమానాత్మజుఁడు |
| 223 | 18 | మెచ్చి | నెదల |
| 227 | 15 | దాని | వాని |
| 232 | 17 | మిన్నకున్న | యూరకున్న |
| 244 | 16 | దర్భకబళ | దర్భాయవస |
| 255 | 4 | ఘూపసముల | ఘూపసమ్ము |
| 257 | 1 | దీనరూప | దీనవదన |
| 264 | 22 | ది; ప్రియబంధు | దియు, ప్రియాత్మ |
| 266 | 16 | మైన సహధరింపు | అని యరియుచుండు |
| 287 | 23 | అనర్ఘ్యంబైన | అనూనంబైన |
| 290 | 18 | తలంతునేని | తపింతునేని |
| 291 | 24 | ధర్మనిత్యాశయుఁడై | ధర్మహార్యాశయుఁడై |
| 293 | 23 | శ్రీ సంభ | శ్రీ స్తంభ |
| 294 | 17 | మంగళమి | మంగళము. |